TELUGULO ALABDHAVANMAYAM

By DR. R. SRI HARI, Professor & Head, Dept. of Telugu,
University of Hyderabad, Hyderabad - 500 134

Copies : 500

Price : Rs. 40-00

1993



For copies :
R. ANANTALAXMI
16-2-836/F/2
Madhavanagar, Saidabad
Hyderabad - 500 659

This book is published with the financial assistance of Telugu University.

Printed at :
Padmavati Art Printers
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad-380.
Phones : 611413, 600547

# అంకితం

అమ్మమ్మ

రత్నమ్మకు



# వాఙ్ముఖం

నన్నయకు పూర్వమే తెలుగులో సాహిత్య గ్రంథరచన జరిగిఉండాలి. కాని మనకీనాడు ఆ సాహిత్యంలో ఒక్క గ్రంథంకూడా లభ్యం కావడం లేదు. నన్నయకు తరువాతి కాలంలో రచింపబడ్డ సాహిత్యంలో కూడా ఎన్నో గ్రంథాలు మనకీనాడు అలభ్యంగానే ఉన్నాయి. లక్షణ గ్రంథాలు, కావ్యావతారికలు, సంకలన గ్రంథాలు మొదలైన ఆకరాల మూలంగా తెలుగు సాహిత్యంలో నష్టప్రాయమై, అలబ్ధంగా ఉన్న కృతులు కొన్ని వందలవరకు ఉండవచ్చునని తెలుస్తుంది.ఏ విధమైన ఆకర గ్రంథంలోనూ ప్రసక్తి లేకుండా గ్రంథం పేరు కూడా తెలియకుండా నష్టమైపోయిన గ్రంథాలు మరెన్నో! దీన్నిబట్టి మనకు లభించిన ప్రాచీన తెలుగు సాహిత్య గ్రంథరాశి ఎంత మాత్రమో మనం సులభంగా ఊహించుకోవచ్చు. ప్రాచీన సాహిత్య గ్రంథరాశిలో నష్టభాగం, లబ్ధభాగం రెండూ సమ భాగంలో ఉండవచ్చునని పండితుల అభిప్రాయం. అంటే మనకు లభించిన ప్రాచీన సాహిత్యం సగమేనన్న మాట. ఈ సగం కూడా పూర్తిగా ముద్రణకు నోచుకోలేదు. ఇందులో సగం మాత్రమే ముద్రితమైనది. ఇంకా సగం అముద్రితంగానే ఉన్నది. తెలుగు సాహిత్యానికున్నంత ఇంత నష్టజాతకం మరే సాహిత్యానికీ లేదంటే అతిశయోక్తి కాదేమో! ప్రాచీనసాహిత్యవిషయంలో తెలుగువాళ్ళు ఇంత నష్టజాతకులు కావడం నిజంగా దురదృష్టం.

ప్రాచీన తెలుగు సాహిత్య గ్రంథరాశిలో సగభాగం నష్టమైపోయిందని చెప్పుకున్నాం. ఈ గ్రంథ నాశానికి కారణాలు ప్రధానంగా మూడు. ఒకటి- మహమ్మదీయుల దండయాత్రలు ఈ దండయాత్రలు జరిగిన సందర్భాల్లో దేవాలయాలు, రాజప్రాసాదాలు దగ్ధం చేయబడేవి. పూర్వకాలంలో పుస్తక భాండాగారాలకు దేవాలయాలు, రాజప్రాసాదాలు నిలయాలు. వీటిని దగ్ధం చేసినప్పుడు ఈ పుస్తకభాండాగారాలుకూడా దగ్ధమైపోయినవి. రాజమహేంద్రవరం, ఓరుగల్లు, విజయనగరం మొదలైన చోట్ల జరిగిన దండయాత్రల్లో

ఎన్నెన్ని గ్రంథాలు పరశురామ ప్రీతి ఐనాయో! రెండో కారణం - ప్రాచీనులకు పురాణాలపై ఉన్నంత ఆసక్తి ఇతర కావ్యాలపై లేకపోవడం అందువల్ల పురాణాలకు దొంకినన్ని ప్రతులు ఇతర కావ్యాలకు దొరకవు. నన్నెచోడ కృతమైన కుమార సంభవ కావ్యానికి ఒకే ఒక తాళపత్ర ప్రతి, సకల నీతి సమ్మతానికి ఒకే ఒక కాగితపు ప్రతి లభించిన విషయం మనకు తెలిసిందే. కావ్యాలకు పెక్కు ప్రతులు లేకపోవడం వల్ల, ఉన్న ఒక్క ప్రతి ఏ కారణం చేతనో నశించిపోవడం వల్ల ఎన్నో ప్రాచీన కావ్యాలు నష్టమైపోయినాయి. ఇక మూడో కారణం- తాళపత్ర ప్రతులను జాగ్రత్తగా రక్షించకపోవడం. తాళపత్ర ప్రతి ఎక్కువ కాలం ఉండదు. అది శిథిలమయ్యే స్థితికి వచ్చినపుడు దానికి మరో ప్రతి రాయించవలసి ఉంటుంది. కృతికర్త వారసులు సాహిత్య ప్రీతి ఉన్నవారైతే ఆ కావ్యానికి మరో ప్రతి రాయించి భద్రపరచుకుంటారు. పండితపుత్రులే ఐతే దాన్ని రక్షించలేక ఏ నదిలోనో కలిపివేసి లేదా పాతరలో పూడ్చిపెట్టి సంతృప్తిపడతారు. లేదా ఇంటి యజమానురాండ్రు వానకాలంలో పొయ్యి సరిగా మండక, పొగతో బాధపడలేక తాటాకు గ్రంథాలతో మంట చేసుకొని వంట చేసుకోవడం కూడా జరిగేది. ఈ విధంగా కూడా కొన్ని గ్రంథాలు నష్టమైఉంటాయి 'ఏ రాయైతేనేం తల పగులగొట్టుకోవడానికి' అన్నట్లుగా కారణాలేవైతేనేం- అమూల్యమైన తాళపత్ర గ్రంథాలు ఎన్నో నష్టమైపోయినాయి.

కావ్యావతారికలు, ఛందోవ్యాకరణాది లక్షణ గ్రంథాలు, సంకలన గ్రంథాలు ఈ మూడూ తెలుగులోని అలబ్ధ వాఙ్మయాన్ని గురించి, విస్మృత కవులను గురించి తెలుసుకోవడానికి ముఖ్యమైన ఆధారాలు. వీటిలో కావ్యావతారికల వల్ల విస్మృత కవుల వివరాలు, అలబ్ధ కావ్యాల వివరాలు మాత్రమే తెలియవస్తాయి. కాని లక్షణ గ్రంథాల వల్లా, సంకలన గ్రంథాల వల్లా విస్మృత కవులను గురించి, అలబ్ధకావ్యాలను గురించి వివరాలు తెలియడమే కాక ఆయా అలబ్ధకావ్యాల్లోని పద్యాలు కూడా లభ్యమౌతాయి. వీటివల్ల ఆయా కవుల శైలీవిశేషాదులు తెలియవచ్చే అవకాశం ఉన్నది. దీన్నిబట్టి అవతారికలకన్నా లక్షణ గ్రంథాలు, సంకలన గ్రంథాలు అలబ్ధకావ్యాల పరిశీలనకు బాగా ఉపయోగపడతాయని చెప్పవచ్చు.

సంకలనగ్రంథాలు, లక్షణ గ్రంథాలు - వీటి ఆధారంగా తెలుగులో అలబ్ధమైన కావ్యాల్లోని లభ్యమైన పద్యాలనన్నింటినీ ఈ గ్రంథకర్త ఏరికూర్చి 'అలబ్ధ కావ్య పద్య ముక్తావళి' అనే సంకలన గ్రంథాన్ని సిద్ధంచేసి 1973లో ప్రకటించినాడు. పద్యాలు లభ్యమౌతున్న అలబ్ధ కావ్యాలకు సంబంధించిన వివరాలే ఈ గ్రంథంలో ఉన్నాయి. కాని ఒక్క పద్యమైనా లభించని అలబ్ధ కావ్యాల ప్రసక్తి అందులో వచ్చే అవకాశం లేదు. అంతేకాక, లక్షణగ్రంథాల్లో ఎక్కడా పేర్కొబడక కేవలం ప్రబంధ రత్నావళి వల్ల మాత్రమే తెలియ వస్తున్న పెదపాటి సోమయ కేదారఖండం, భావన పెమ్మన అనిరుద్ధ చరిత్ర, నిశ్శంకుని కొమ్మయ వీరమాహేశ్వరం మొదలైన అలబ్ధ కావ్యాల ప్రసక్తి కూడా అందులో కానరాదు అంటే తెలుగులోని అలబ్ధ సాహిత్యాన్ని ఒక్క సారిగా, ఒక్కచోట దర్శించుకోదలచుకున్న జిజ్ఞాసువులకు ఆ గ్రంథం సమగ్ర మైన సమాచారం ఇవ్వదు ఆ గ్రంథ ప్రణాళిక ఉద్దేశంకూడా అది కాదు.

'అలబ్ధకావ్యపద్యముక్తావళి' గ్రంథాన్ని సిద్ధంచేస్తున్న సమయంలోనే 'తెలుగులో అలబ్ధ సాహిత్యం ఎంత ఉన్నది' అని బేరీజువేసి, మనం ఎంత సాహిత్యాన్ని పోగొట్టుకున్నాం అనే విషయాన్ని పరిశీలించాలన్న సంకల్పం కలిగింది. దీనివల్ల తెలుగులో అలబ్ధ సాహిత్య విషయంలో నేను చేపట్టిన ప్రణాళికకు సమగ్రత కలుగుతుందని భావించడమైనది ఆ సంకల్ప ఫలితమే 'తెలుగులో అలబ్ధవాఙ్మయం' అన్న ఈ గ్రంథం.

సంకలనగ్రంథాలు, అవతారికలు, లక్షణగ్రంథాలు మొదలైన వివిధ ఆకరాల మూలంగా తెలియవచ్చిన సుమారు 650 గ్రంథాలను ఈ గ్రంథంలో గుర్తించడం జరిగింది వాటిని వివిధ భాగాలుగా వింగడించి దిగువ పేర్కొం టాను.

| | | | |
|---|---|---|---|
| పురాణేతిహాసాలు | 50 | కావ్యప్రబంధాలు | 265 |
| మాహాత్మ్యాలు | 19 | చిత్రకావ్యాలు | 3 |
| ఉదాహరణలు | 4 | దండకాలు | 4 |
| స్తుతులు | 10 | కీర్తనలు | 1 |
| గద్యాలు | 2 | రగడలు | 1 |

| | | | |
|---|---|---|---|
| అష్టకాలు | 2 | గీతలు | 5 |
| చాటుకథలు | 1 | చాటుపద్యాలు | 1 |
| భాణాలు | 3 | పిన్నపాలు | 1 |
| భగవద్గీత | 1 | సాంగత్యరచనలు | 4 |
| యక్షగానాలు | 31 | వ్యాఖ్యానాలు | 5 |
| ఛందస్సులు | 29 | వ్యాకరణాలు | 8 |
| అలంకారం | 7 | నిఘంటువులు | 2 |
| నీతి శాస్త్రం | 8 | జ్యోతిషం | 1 |
| శకునశాస్త్రం | 1 | సాముద్రికం | 1 |
| ధర్మశాస్త్రం | 2 | అశ్వ శాస్త్రం | 1 |
| నాట్య శాస్త్రం | 1 | వేదాంతం | 6 |
| కామ శాస్త్రం | 4 | జైనకావ్యాలు | 3 |
| శైవగ్రంథాలు | 17 | అష్టభాషా కృతులు | 1 |
| ఇతరాలు | 90 | | |

ఈ కృతులన్నీ 18 వ శతాబ్ది చివరివరకు రచింపబడ్డవి. ఈ గ్రంథాలన్నీ అలబ్ధాలు కనుక వీటికి సంబంధించిన వివరాలను విపులంగా చర్చించడం సాధ్యం కాదు. కృతుల పేర్లను బట్టి, అవతారికల్లో లభ్యమైన వివరాలను బట్టి, లభ్యమైన పద్యాలను బట్టి కొన్ని కృతులకు సంబంధించిన వివరాలు తెలిసినా మరికొన్ని కృతుల వివరాలు ఏమాత్రమూ తెలియడం లేదు, కనుక ఆయా అలబ్ధ గ్రంథాలకు సంబంధించిన వివరాలను తెలిసినంతమేరకు ఈ గ్రంథంలో వివరించడం జరిగింది. కొన్ని కావ్యాల పేర్లు తెలిసినా వాటి రచయితల పేర్లు తెలియరావు. అటువంటిచోట్ల కావ్యానికి సంబంధించిన వివరంమాత్రం తెలియజేయబడింది. కావ్యావతారికల్లో కొన్ని చోట్ల కావ్యాల పేర్లు చెప్పక కేవలం కవుల పేర్లను, వారి బిరుదులను కావ్య రచనా ధురీణతను మాత్రం ప్రశంసించడం కనిపిస్తుంది. అట్టివాళ్ళలో బయ్యన, పెద్దయామాత్యుడు, లింగమకుంట సర్వకవి, గణనాథకవి (గణేశకవి) మొదలైనవారు కొందరు. భోజరాజీయాది కృతికర్తయైన అనంతామాత్యుని ముత్తాత బయ్యన తిక్కనచే భవ్యభారతి అనే బిరుదాన్ని పొందిన భాసుర కవితా చతురుడు. ఇక్కనతాత పెద్దయామాత్యుడు నెల్లూరు పాలించిన రెండో తిక్కరాజు ఆస్థానాన్ని అలంక

రించిన కవీశ్వరుడు. లింగమకుంట రామకవికి తాతయైన లింగమకుంట సర్వ కవి కవిసార్వభౌమ బిరుదాంచితుడు గణనాథమహాకవి కుతుబ్షాహీ రాజుల ఆస్థానాన్ని అలంకరించిన కవీశ్వరుడు ఇలాంటి కవులను 52 మందిని గుర్తించి 'కృతుల పేర్లు తెలియని కవులు,' అన్న శీర్షికలో (పుట 133-146) పేర్కొనడం జరిగింది. వీళ్ళందరూ ఎన్నో అమూల్యమైన కావ్యాలను రచించి నట్లుగా సాహిత్యం సాక్ష్యమిస్తున్నా వారి కావ్యాలకు నామమాత్రావశేష భాగ్యం కూడా లేకపోవడం విచారించాల్సిన అంశం.

ఇలా పరిశీలిస్తే తెలుగులో నష్టప్రాయమైన అలబ్ధ సాహిత్యం ఎంత ఉందో మనకు అవగతమౌతుంది. తెలుగు సాహిత్య చరిత్రలో అలబ్ధసాహిత్యా నికి ఒక ప్రత్యేకస్థానం ఉన్నదనడంలో అతిశయోక్తి లేదు.

అముద్రితాలైన తాళపత్ర గ్రంథాల్లోని అవతారికా భాగాలను పరిశీలిస్తే ఇంకెన్నో అలబ్ధ కావ్యాల వివరాలు లభించవచ్చు. కాని వివిధ ప్రాంతాల్లో ఉన్న తాళపత్ర గ్రంథాలయాలకు వెళ్ళి అముద్రిత కావ్యావతారికలను పరిశీ లించడం వ్యయ ప్రయాసలతో కూడినపని. అవతారికా భాగాలు పేర్కొబడ్డ కొన్ని గ్రంథాలయాల 'డిస్క్రిప్టివ్ కేటలాగు'లను మాత్రం పరిశీలించడం జరిగింది.

తెలుగులోని అలబ్ధ వాఙ్మయాన్ని గురించిన ఈ గ్రంథం ప్రాచీన తెలుగుసాహిత్యచరిత్రరంగంలో ఏ మాత్రం ఉపయోగపడ్డా, ఈ నా కృషి సఫలమైందనే భావిస్తా.

ఈ గ్రంథ ప్రచురణకు ఉచిత రీతిగా ఆర్థిక సాహాయ్యం అందజేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి - ముఖ్యంగా అప్పటి విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి, ప్రస్తుత ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి, రిజిస్ట్రార్ డా॥ టి. వెంకటరెడ్డిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

—ఆర్. శ్రీహరి

# సంకేత సూచి

| | |
|---|---|
| అ. కా. ప. ము. | అలబ్ధకావ్యపద్యముక్తావళి |
| ఆం.క.స.<br>క.స. | ఆంధ్రకవిసప్తశతి |
| ఆం.సం.సా. | ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణ |
| క. త. | కవితరంగిణి |
| ద. దే. ఆం. | దక్షిణదేశీయాంధ్రవాఙ్మయం |
| య. వా. చ. | యక్షగానవాఙ్మయచరిత్ర |
| శ. క. చ. | శతకకవులచరిత్ర |
| స. ఆం. సా. | సమగ్రఆంధ్రసాహిత్యం |

# తెలుగులో
# అలబ్ధ వాఙ్మయం

**అంతర్వేదిమాహాత్మ్యము**

కేసన, మల్లన కవులు రచించిన 'విష్ణు భజనానంద'మనే కావ్యం అవతారికలోని "మహిమ నంతర్వేది మాహాత్మ్య మాదియౌ కృతులిచ్చె ర్యాలి కేశవునకు" అనే వాక్యంవల్ల ఈ కావ్యనామం తెలుస్తుంది. ఈ కావ్య రచయిత పెనుమత్స గోపరాజు. ఈతడు క్రీ. శ. 1500 ప్రాంతానికి చెందిన వాడు కావచ్చు. అంతర్వేది మాహాత్మ్యం మొదలైన కావ్యాలను రచించినట్లుగా విష్ణు భజనానందంలోని పై వాక్యం వల్ల తెలియవస్తున్నా తక్కిన కావ్యాల పేర్లు కూడా మనకు తెలియరావు. ఈతడు తన అంతర్వేద మాహాత్మ్యాన్ని రాజోలు తాలూకాలోని ర్యాలి గ్రామంలో నెలకొని ఉన్న కేశవస్వామికి అంకితం కావించినాడు.

**అంబరీషచరిత్ర**

ఈ కావ్యకర్త ఎవ్వరో తెలియదు. కేసన, మల్లన కవులు రచించిన విష్ణు భజనానందంలోని—

ధృతి నంబరీషచరిత్రాదిగా గల్గు
కృతులందుకొనె చమత్కృతి చెలరేగ

అనే పద్యం వల్ల ఈ కృతిని పెనుమత్స అనంతరాజు అంకితం పొందినట్లుగా తెలుస్తుంది. అంతర్వేది మాహాత్మ్యం రచించిన పెనుమత్స గోపరాజు ఈతని తండ్రి.

**అంబాలభాణము**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. ఇందులోనిదిగా ఒక పద్యం రత్నాకరం గోపాలకవి రచించిన 'సకలలక్షణసారసంగ్రహం'లోనూ, మరో పద్యం వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలోనూ ఉదాహరింపబడింది ఇది

సంస్కృతంలోని భాణానికి అనువాదం కావచ్చు. (చూ :- అలబ్ధకావ్యపద్య ముక్తావళి. 1 పు.)

**అంబికావాదము**

ఇది కాకునూరి అప్పకవిచే రచింపబడ్డ యక్షగానం. ఈ యక్షగానం లోని ఇతివృత్త మేమిటో స్పష్టంగా చెప్ప వీలులేదు. అప్పకవి 17 వ శతాబ్దికి చెందినవాడు. గొప్ప లాక్షణికుడుగా ప్రసిద్ధి పొందినవాడు. ఈతడు అప్ప కవీయం అవతారికలో తాను రాసిన గ్రంథాలను ఈ విధంగా పేర్కొన్నాడు.

జగతినాప స్తంబ శాఖోక్త షట్కర్మ పద్ధతి ఖండనిబంధనంబు
కాలబాలార్క వాఖ్యజ్యోతిష గ్రంథ సంహితా సుశ్లోక సంగ్రహంబు
శ్రీమదనంత ప్రసిద్ధ మహావ్రత కల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశ సుశ్లేష నిందాస్తుతి భావగర్భిత సీసపద్య శతము
లలితకవి కల్పకాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీజనౌఘధర్మ ద్విపదము
నంబికావాదనామక యక్షగాన
కృతియు జేసితి కాకునూరి కులయప్ప (పీఠిక 85)

దీనినిబట్టి అప్పకవి ఆపస్తంబషట్కర్మ నిబంధనాన్ని, కాల బాలార్క వానికి శ్లోక రూప సంగ్రహాన్ని, తెలుగులో అనంత వ్రతకథను, శ్రీశైల మల్లికార్జునుని మీద శ్లేష నిందాస్తుతిరూప సీసపద్య శతకాన్ని, కవి కల్పక మనే లక్షణగ్రంథాన్ని- స్త్రీలకు ధర్మ ద్విపదను, అంబికా వాదమనే యక్ష గానాన్ని రచించినట్లుగా తెలుస్తుంది. అప్పకవి రచించిన గ్రంథాల్లో అప్ప కవీయం తప్ప మరే గ్రంథమూ మనకు లభ్యం కాలేదు.

**అంబికాశతకము**

రావిపాటి త్రిపురాంతకుడు ఈ శతక కర్త. ఈతడు ఉదాహరణం, తారావళి, అంబికా శతకం, ప్రేమాభిరామం అనే నాలుగు కృతులను రచించి నట్లుగా తెలుస్తుంది. వీటిలో ఒక్క ఉదాహరణం మాత్రమే సమగ్రంగా లభ్య మౌతుంది తక్కినవి లభ్యం కాలేదు. 'అంబికా' అనేది ఇందులోని మకుటం. ప్రబంధరత్నాకరంలోనూ, ఉదాహరణ పద్యాల్లోనూ ఈ శతక పద్యాలు మూడు లభ్యమౌతున్నాయి. (చూ : ప్రబంధరత్నావళి. 38, 39 పు.)

**అఖిలపురాణసారము**

'అఖిల పురాణ సారాంశమిట్లలవియే, యిల విలాసంబుగాఁదెలుగుజేయ' అని గణపవరపు వేంకట కవి (17 శ) తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం అవతారికలో (51 వ పద్యం) తానీ కృతిని రచించినట్లుగా చెప్పు కున్నాడు. వేంకటకవి ఈ కావ్యాన్ని విలాసంగా తెలుగుచేసినాడట. ఐతే దీని మూలమైన సంస్కృత గ్రంథమేదో తెలియరాదు.

**అగస్త్యవ్యాకరణము**

ఈ వ్యాకరణం ఒక్క లక్షణ శిరోమణి గ్రంథంలో మాత్రమే పేర్కొబడింది (4-514). ఈ కృతి కాల కర్తృత్వాలు తెలియరావు. లక్షణ శిరోమణి లోని ఉదాహరణాన్ని బట్టి ఇది సంస్కృతంలో రచింపబడ్డ సూత్రరూపమైన వ్యాకరణమని తెలుస్తుంది.

**అచ్యుతాభ్యుదయము**

ఇది తంజావూరు నాయకరాజులలో ప్రసిద్ధి వహించిన రఘునాథ నాయకుడు తన తండ్రియైన అచ్యుతనాయకుని చరిత్రను నిబంధించి రచించిన ద్విపదకావ్యం. తమ తండ్రుల చరిత్రను తెలిపే రచనకు శ్రీకారం చుట్టినవాడు రఘునాథ నాయకుడే. రఘునాథుడీ కావ్యాన్ని రచించినట్లుగా అతని నలచరిత్రంలోని క్రింది ద్విపదలు సాక్ష్యమిస్తున్నాయి.

భూషించి 'యచ్యుతాభ్యుదయ' ప్రబంధ
నిర్మాణమున మాకు నిఖిల దేశముల
నిర్మల సత్కీర్తి నెగడు గావునను
యటువలె ద్విపదకావ్యములేటి యొకటి
ఘటియించి సత్కీర్తి గైకొందునంచు

రఘునాథుని రామాయణంలోనూ, గోవింద దీక్షితుల సాహిత్యసుధలోనూ అచ్యుతాభ్యుదయం పేర్కొబడింది. విద్యావతులైన స్త్రీలు రఘునాథ నాయకుని ఆస్థానంలో ఈ కృతిని చదివి వినిపించినట్లు రఘునాథ నాయకాభ్యుదయంలోని ఈ క్రింది ద్విపద వల్ల తెలుస్తుంది:

విరిబోండ్లు కొందరు వినిపించిరపుడు
భువిమెచ్చ 'నచ్యుతాభ్యుదయ' కావ్యంబు.

**అథర్వణచ్ఛందము**

అథర్వణ కృతంగా భావింపబడే ఈ ఛందోగ్రంథంలోని ఎన్నో పద్యాలు గౌరన, అప్పకవి, రంగకవి మొదలైన లాక్షణికులచే తమ లక్షణ గ్రంథాల్లో ఉదాహరింపబడ్డాయి.

**అథర్వణభారతము**

అథర్వణాచార్యుడు ఈ భారత కర్త. ఈతడు 12 వ శతాబ్ది చివరనో, 13వ శతాబ్ది ప్రారంభంలోనో, ఉండి ఉంటాడని పండితుల అభిప్రాయం. అప్ప కవీయం, ఆంధ్రకౌముది, ఆంధ్ర ప్రబంధరత్నాకరం, కవి చింతామణి మొద లైన లక్షణ గ్రంథాల్లోనూ, ఉదాహరణ పద్యాలన్న సంకలన గ్రంథంలోనూ ఈ భారతంనుండి పద్యాలు ఉదాహరింపబడ్డాయి. వివిధ ఆకరాలను బట్టి లభించిన మొత్తం అథర్వణ భారత పద్యాల సంఖ్య 27. (చూ:- అలబ్ధకావ్య పద్యముక్తావళి 5-13 పుటలు)

**అద్వైతసిద్ధాంతము**

అల్లసాని పెద్దన ఈ కృతికర్త.

**అధోక్షజపక్రియ**

అప్పకవి పేర్కొన్న ప్రాచీన లక్షణ గ్రంథాల పట్టికలో ఈ కృతి ప్రసక్తి కనిపిస్తుంది. (పీఠిక-5) ఇది వ్యాకరణ గ్రంథం కావచ్చు. దీనికర్త అధోక్షజుడు. ఈతనికి సంబంధించిన వివరాలు తెలియవు.

**అధ్యాత్మరామాయణము**

మైసూరుకు చెందిన చెన్నపట్టణ నిర్మాత ఇమ్మడి జగదేవ రాయలు (17 వ శతాబ్ది) ఈ కృతికర్త. ఈతడు తెలుగులో అధ్యాత్మ రామాయణాన్ని రచించినట్లుగా ఔబళకవి వామనపురాణ అవతారికలోని కింది పద్యంవల్ల తెలు స్తుంది:

అమితమధ్యాత్మ రామాయణము తెనుంగు
కబ్బముగ గూర్చినట్టి యక్కబ్బితేడు
వరుల కవితా ప్రవీణతలరయ నేర్చు
నని పచింపగ వలయునే యద్భుతముగ.

**అనంతమహాత్త్వము**

బొడ్డపాటి పేరయ కవి ఈ కృతికర్త. ఇందులోని ఒకే ఒక పద్యం ప్రబంధ రత్నాకరంవల్ల లభ్యమౌతుంది. (ప్రబంధ రత్నావళి - 60 పు.) ఈ పద్యంలో సూర్యస్తుతి ఉంది. ఇది గ్రంథారంభ పద్యం కావచ్చు.

**అనంతవ్రతకథ**

ఇది కవ్వకవిచే రచింపబడిన కావ్యం. ఇందులో అనంత వ్రతకల్పానికి సంబంధించిన కథ ఇతివృత్తమై ఉంటుంది. (చూ :- అంబికావాదం).

**అనిరుద్ధచరిత్రము**

బళ్ళారి ప్రాంతానికి చెందిన వడకండ్ల గురురాజకవి ఈ నాటకాన్ని రచించినట్లుగా అతని 'శేషధర్మము' అనే గ్రంథంలో చెప్పబడింది.

**అనిరుద్ధ చరిత్ర**

బావన పెమ్మనచే రచింపబడిన ఈ కావ్యంలోని 10 పద్యాలు పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరంలోనూ, 54 పద్యాలు ఉదాహరణ పద్యములు అనే సంకలన గ్రంథంలోనూ ఉదాహరింపబడ్డాయి. అంటే ఈ కావ్యంలోని పద్యాలు మొత్తం 64 లభించినాయన్నమాట. (చూ :- ప్రబంధరత్నావళి 47.64 )

**అభినవాంధ్రనిఘంటువు**

వేంకటేశాంధ్రమనే పేరుతో ప్రసిద్ధిచెందిన పద్య నిఘంటువును రచించిన గణపవరపు వేంకటకవి (17 శ.) ఈ నిఘంటువు కర్త. ఈ నిఘంటువు అకారాదిగా కూర్చబడ్డ దేశీయ పద నిఘంటువు. వేంకటకవి అకారాదిగా ఈ దేశీయ పద నిఘంటువును రచించినట్లుగా జయంతి రామయ్య పంతులు గారు తెలిపినారు.

**అభిమన్యువిలాసము**

చిత్రకవి అనంతయ్య కుమారుడు చిత్రకవి వెంకటరమణకవి (17 శ.). ఈ కృతిని రచించినట్లు వెంకటరమణ కవి సాంబవిలాసకావ్యంలోని కింది ఆశ్వాసాంత గద్యలో పేర్కొనబడింది:

"త్రిలోక సంజీవన్యభిమన్యు విలాస సకల వర్ణనాపూర్వ రామాయణ కుమారగురు విలాసాది దివ్యకావ్య కరుణాతిధురీణ శేముషీ విశేషపారీణ రాఘవ పాండవీయ, విష్ణు చిత్తీయ, వసుచరిత్ర ప్రముఖ దివ్యకావ్యార్థ

బోధన సమర్థ హృదయ కమల సకల విద్వత్కవీంద్ర విధేయ వేంకటరమణ నామధేయ కవీశ్వర విరచితంబైన సాంబవిలాసమను మహాప్రబంధము."

ఈతని కావ్యాలలో సాంబవిలాసం. సకల వర్ణనాపూర్ణ రామాయణం మాత్రమే లభించినాయి.

**అభిరామవాసుదేవము**

ఈ కృతిని ఎడవల్లి వేంకటకవి రచించినట్లుగా కోడూరి వేంకటాచలం రచించిన శివరహస్య ఖండంలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది:

ఆతని నభిరామవాసుదేవాది కా
వ్యముల రచియించి ప్రఖ్యాతినందినట్టి
ఘనుని నెడవల్లి వేంకటకవివరేణ్యు
నస్మదీయవిద్యాగురు నభినుతింతు.

ఈ కృతికర్త కోడూరి వేంకటాచల కవికి విద్యాగురువని ఈ పద్యం తెలుపుతుంది. (శివరహస్యఖండం ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది; నెంబరు డి 322 )

**అమరుకము**

ఇది అమరుకకవి రచించిన అమరుకమనే సంస్కృతశతకానికి తెలుగు అనువాదం. కానుకొల్లు అన్నమరాజు ఈ అనువాద కర్త. ఇందులోని రెండు పద్యాలు 'ఉదాహరణ పద్యములు' అనే సంకలనంలో సేకరింపబడ్డాయి, (చూ: ప్రబంధరత్నావళి, పుట 2.) వీటిలో ఒకటి పార్వతీస్తుతిపరం, రెండోది శివస్తుతిపరం. కనుక ఇవి కావ్యారంభంలోని పద్యాలుగా భావించవచ్చు. ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో కూడా ఇందులోని ఒక పద్యం కనిపిస్తుంది. (చూ:- సాహిత్యసంపద, పుటలు - 274-275).

**అరుణాచలపురాణము**

పెదపాటి సోమనాథుడు ఈ కృతికర్త. 1500 ప్రాంతానికి చెందినవాడు. ప్రబంధ రత్నాకరం, ప్రబంధ మణిభూషణం, లక్షణసార సంగ్రహాల్లో ఈ కృతిలోని పద్యాలు పేర్కొనబడ్డాయి. ఈ కావ్యంలోని పద్యాలు మొత్తం పన్నెండు మాత్రమే లభ్యమైనాయి. (చూ:- అలబ్ధకావ్యపద్యముక్తావళి; పుటలు 14-18.) ఇతడు అరుణాచల పురాణమేకాక కేదారఖండం,

త్రిపుర విజయం, శివజ్ఞాన దీపిక అనే గ్రంథాలను కూడా రచించినట్లు సంక లన గ్రంథాలవల్ల తెలుస్తుంది.

**అర్ధనారీశ్వరకలాపము**

కెళ్ళకప్పయ కృతికర్త. ఈతడు ఏ కాలానికి చెందినవాడో తెలియదు. ఈతని తండ్రి సన్యాసి. తాత మల్లయ. ఈతడు తారాశశాంక విజయ కావ్యంలో తాను ధర్మాంగద చరితము, సముద్ర మథనము, ప్రవరాఖ్య చరితము, రఘురామ శతకము, అర్ధనారీశ్వర కలాపము అనే కృతులను రచించినట్లుగా పేర్కొన్నాడు.

ఈతని తారాశశాంక విజయ, ధర్మాంగద చరిత్రల వ్రాతప్రతులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నాయి. (కాల్ నెం టి 3-21, కాల్ నెం. టి. 3-204)

**అవతారదర్పణము**

పిల్లలమర్రి పినవీరభద్రుడు రచించిన కావ్యం ఈతడు శృంగార శాకుంతలం అవతారికలోని కింది పద్యంలో తాను రచించిన గ్రంథాలను ఈ విధంగా చెప్పుకున్నాడు.

> "రచియించినాడవు రమణీయవాగ్రీతి నవతారదర్పణంబభినవముగ
> పల్కినాడవు తేటపడజేసి నారదీయము సత్కవిశ్రేణియాదరింప
> చెప్పినాడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజువణితి
> కావించినాడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసితశయ్య"
>
> (22 వ పద్యం.)

పిల్లలమర్రి పినవీరభద్రుని వంశీయుడైన పెనుమళ్ళ సోమనామాత్యుడు తన సీమంతినీ కల్యాణంలో 'అవతారదర్పణంబన్న కావ్యము జేసె' అన్న పద్యంలో పై కావ్యాలతోపాటు శాకుంతలాన్ని, జైమిని భారతాన్ని కూడా పేర్కొన్నాడు. (అవతారిక.)

**అశ్వారాయచరిత్ర**

శ్రీరామ పట్టాభిషేకమని ఈ కావ్యానికి నామాంతరం. శ్రీనాథుని వెంకట రామయ్య ఈ కావ్యకర్త. 1700 ప్రాంతంలో ఉండిన కవి. ఈతడు వరంగల్లు సుబాలో ప్రసిద్ధ సంస్థానమైన పాల్వంచ పరిపాలకుల పోషణలో ఉన్నట్లుగా

తెలుస్తుంది. పాల్వంచ సంస్థానాధీశ్వరులకూ, జాఫరుద్దౌలాకు ధంసాలో జరిగిన యుద్ధాలు ఈ కావ్యంలో వర్ణింపబడ్డాయట. ఈ కావ్యం లభిస్తే పాల్వంచ సంస్థానాధిపతుల వంశావళి, కావ్యకర్తయైన వెంకటరామయ్య కవితా శక్తి మొదలైన వివరాలు తెలిసి ఉండేవి. ఈ కావ్య ప్రతి 'సిరిపురంలో కలదని వినికిడి' అని శేషాద్రిరమణ కవులు గోలకొండ కవుల సంచిక (పు. 411) లో పేర్కొన్నారు. కాని ఈ కావ్యం ఉనికి ప్రస్తుతానికి తెలియదు.

**అష్టభాషావిశేషకృతులు**

మరింగంటి సింగరాచార్యులు 'సీతా కల్యాణం' అవతారికలో తాను పద్నాలుగు సంవత్సరాల వయస్సులో ఈ కృతులను రచించినట్లుగా పేర్కొన్నాడు.

వరుస పద్నాలుగు వదిహేను వత్సరముల
సరస కవితాష్టబాషా విశేషకృతుల
సరణులేర్పడ నాటక శాస్త్రమెల్ల
గరిమ విరచించితివి గాదె! కవులువెన్న. (1.17)

ఈ రచన అష్టభాషలుగా ప్రసిద్ధిపొందిన సంస్కృతాంధ్రాల్లోనూ, షడ్విధప్రాకృతాల్లోనూ రచింపబడిన రచన కావచ్చు.

**అష్టమహిషీకల్యాణము**

రెడ్డిపల్లె ముద్దమరాజు రచించిన ఈ కృతిలోనివిగా రెండు పద్యాలు ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంలో పేర్కొబడ్డాయి. (చూ :- ప్రబంధరత్నావళి - 77 పుట.)

**ఆంధ్రప్రక్రియాకౌముది**

గణపవరపు వేంకటకవిచే రచింపబడ్డ వ్యాకరణ గ్రంథం. వేంకట కవి తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం అవతారికలో ఈ గ్రంథ రచనను గురించి ఈ విధంగా పేర్కొన్నాడు:

రహిగ (బా)ణిని యాచార్య రచితమైన
ప్రక్రియా కౌముదిని యాంధ్రరచన చేత
సీసమాలిక జేసి ప్రసిద్ధిగాంచి
నట్టి యప్పయకవి వేంకటార్యమణిని (1.49)

పాణిన్యాచార్యుడు రచించిన ప్రక్రియా కౌముదిని సీసమాలికగా అను వదించినట్లు పై పద్యం చెపుతుంది. కాని పాణిని ప్రక్రియాకౌముది పేరుతో వ్యాకరణాన్ని రచించలేదు. ఐతే భట్టోజీ దీక్షితునికి పూర్వుడైన రామచంద్రా చార్యుడు ప్రక్రియాకౌముది అనే గ్రంథాన్ని రచించినాడు. ఇది పాణినీయ సూత్రాలనే ప్రక్రియానుగుణంగా అమర్చిన వ్యాకరణం. కనుక వేంకటకవి పాణిన్యాచార్య రచితమైన ప్రక్రియా కౌముదిని అనువదించినట్లుగా చెప్పు కున్నాడు. దీనిని రామచంద్రాచార్యులు రచించిన ప్రక్రియా కౌముదికి అను వాదంగా భావించవచ్చు. వేంకటకవి 17 వ శతాబ్ది మధ్యకాలానికి చెందినవాడు.

## ఆంధ్రప్రతాపరుద్రీయము

ఇది విద్యానాథకృతమైన సంస్కృత ప్రతాపరుద్రీయానికి గణపవరపు వేంకట కవిచే రచింపబడ్డ ఆంధ్రానువాదం. ప్రతాపరుద్రీయానికి వచ్చిన తెలుగు అనువాదాల్లో బహుశః ఇది మొట్టమొదటిదేమో! కాని ఇది అలభ్యం. ఐతే సర్వ లక్షణ శిరోమణిలో ఆరు నుంచి తొమ్మిదివరకు గల ఉల్లాసాలలోనిది ఈ గ్రంథమే కావచ్చునని పండితుల ఊహ. వేంకట కవి తానీ గ్రంథాన్ని రచించినట్లుగా ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం అవతారికలో ఈ విధంగా చెప్పుకున్నాడు:

అతులిత విద్యానాథ
'ప్రతాపరుద్రీయ' భాసుర రసమంజరులన్
గృతులెంచ నాంధ్రకృతులుగ
వితముగ జేసితివి సరస వేంకటసుకవీ! (36 వ పద్యం)

చూ :- ఆంధ్రప్రక్రియాకౌముది

## ఆంధ్రప్రయోగరత్నాకరము

కొండవీటిరెడ్డి రాజుల కాలంలో (14 శ.) ఉన్న బప్పన కవి ఈ కృతిని రచించినట్లుగా కావలి వెంకటస్వామిగారు పేర్కొన్నారు. ఈతడు గొప్ప వ్యాకరణ పండితుడట. ప్రస్తుతం గణపవరపు వేంకటకవి రచించిన ఆంధ్ర ప్రయోగ రత్నాకరం లభ్యమైనా ఆ పేరనే రచింపబడ్డ బప్పనకృతి లభ్యం కాలేదు.

**ఆంధ్రభాషాభూషణము**

కేతన ఆంధ్రభాషాభూషణమనే పేరుగల వ్యాకరణ గ్రంథాన్ని రచించినాడు. ఇదే పేరుతో మరింగంటి సింగరాచార్యులు కూడా ఒక కృతిని రచించినట్లుగా ఆతని సీతా కల్యాణ కావ్యావతారికలోని పద్యం (1-20) వల్ల తెలుస్తుంది. కేతన కృతివలెనే ఇది కూడా వ్యాకరణ గ్రంథం కావచ్చు.

**ఆంధ్రరసమంజరి**

ఇది సంస్కృతంలో భానుదత్తుడు రచించిన రసమంజరి అనే అలంకార శాస్త్రగ్రంథానికి ఆంధ్రానువాదం. ఇందులో నాయికానాయకుల స్వరూపం, తద్భేదాలు వర్ణింపబడ్డాయి. ఈ అనువాద కర్త గణపవరపు వేంకట కవి. ఈతడీ గ్రంథాన్ని రచించినట్లుగా ఈతని ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాస కావ్యం అవతారిక వల్ల తెలుస్తుంది. (36 వ పద్యం.)

పుదుక్కోట కవులలో పేర్కొనదగిన కవులలో మన్నారయ్య లేక శ్రీమన్నారాయణయ్య అనే కవి (1730-69) రసమంజరిని అనువదించినాడు. అది లభ్యమే.

**ఆంధ్రవసంతతిలకభాణం**

ఇది సంస్కృతంలోని వసంత తిలక భాణానికి తెలుగు అనువాదం. గణపవరపు వేంకటకవి (17 శ) ఈ కృతికర్త. రూపక భేదాల్లో భాణ ప్రక్రియకు చెందిన కృతి. ఇది నాటకరూపంలో అనువదింపబడిందో లేక ప్రబంధరూపంలో అనువదింపబడిందో తెలియదు.

**ఆంధ్రవేదాంతము**

తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు ఈ కృతికర్త. ఇది ద్విపదలో రచింపబడిన కృతి.

**ఆదినారాయణచరిత్రము**

కవిరాక్షసుడనే కవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా లక్షణ గ్రంథాల వల్ల తెలుస్తుంది యతిప్రాస విలాసం అనే లక్షణ గ్రంథంలో ఇందులోని ఈ కింది పద్యం ఉదాహరింపబడింది.

శ్రీయుతలోచనోజ్జ్వల మరీచులు భాను మరీచివిస్ఫుర
త్తోయజకాంతితోడఁదులతూగగ బచ్చని పట్టు గట్టియ

త్యాయత శంఖ చక్ర రుచిరాసి గదాధరు డేగుదెంచె నా
రాయణు డార్తరక్షణపరాయణుడా గజరాజు పాలికిన్.

దీని ప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారంలో ఉంది.
చూః- పరిషత్పుస్తకభాండాగారము - మూడవభాగం - పుట 51-52.

**ఆదిపురాణము**

ఇది జైన తీర్థంకరులలో మొదటివాడైన ఋషభదేవుని చరిత్రను వర్ణించే కావ్యం. సర్వదేవుడు దీనికర్త. పదో శతాబ్దికి చెందిన జైనకవి. కన్నడ రత్నత్రయంలో ఒకడైన పొన్నకవి ఆదిపురాణాన్నే కాక భారతంలోని విరాట పర్వాన్ని కూడా రచించినట్లు ప్రబంధ రత్నావళి వల్ల తెలుస్తుంది. ప్రబంధ రత్నాకరం, ప్రబంధ రత్నావళి, ప్రబంధ మణిభూషణం, లక్షణ శిరోమణి మొదలైన గ్రంథాల్లో ఆదిపురాణంలోని పద్యాలు ఉదాహరింప బడ్డాయి. ఆదిపురాణంలో లభ్యమైన పద్యాలు ఐదు మాత్రమే. (చూ : అలబ్ధ కావ్యపద్యముక్తావళి, పుట. 19-20.) నన్నెచోడుని కుమార సంభవంలో ఈతని అనుసరణలున్నట్లుగా మానవల్లి కవిగారు పేర్కొన్నారు. వాదీంద్ర చూడామణి అనే జైనాచార్యుడు కూడా ఆదిపురాణాన్ని రచించినట్లుగా తెలుస్తుంది.

**ఆనందలహరి**

పోచిరాజు పీరన్న ఈ కృతిని రచించినట్లుగా ఆతని భల్లాణ చరిత్రలో పేర్కొనబడింది. పీరన్న ఈ కృతిని శతకంగా పేర్కొన్నాడు. ఇది శ్రీ శంకరుల కృతికి అనువాదం కావచ్చు.

**ఆదిపురాణము**

జైనాచార్యుడైన వాదీంద్ర చూడామణి 'ఆదిపురాణము'నే గ్రంథాన్ని రచించినట్లుగా తెలుస్తుంది. కాని అది ఏ భాషలో రచింపబడిందో తెలియదు.

**ఆర్యాశతకము**

చింతలపల్లి గోపాలకవి ఈ శతక కర్త. ఇది సంస్కృతంలోని ఆర్యా సప్తశతికి అనువాదమో లేక స్వతంత్రశతకమో స్పష్టంగా చెప్పలేము. ఈ గోపాలకవి రాఘవాభ్యుదయ ప్రబంధ కర్తయైన చింతలపల్లి ఛాయాపతికి తండ్రి. గోపాలకవి ఈ శతకాన్ని రచించినట్లుగా రాఘవాభ్యుదయంలో ఛాయాపతి ఈ విధంగా పేర్కొన్నాడు:

విలసత్పాండితి(గల్పనాగతి జగద్విఖ్యాతుడై జాములో
వల నార్యాశతకంబు వజ్రగిరి గోపాలాంకితంబూహచే
సి లలిన్ దివ్యసుమాంబరాభరణముల్ శ్రీమించ జేకొన్న యో
గ్యులమేటిన్ గవిరాజు నెన్నదరమే గోపాల విద్వన్మణిన్. (1.44).

దీనినిబట్టి గోపాలకవి ఈ శతకాన్ని జాములోవల రచించినట్లుగాను, వజ్రగిరి గోపాలస్వామికి అంకితం చేసినట్లుగాను తెలుస్తుంది.

**ఇందుమతీ కల్యాణము**

పెనుమత్స వేంకటాద్రి ఈ కృతిని రచించినట్లుగా కేసన, మల్లన కవులు రచించిన విష్ణుభజనానందం అవతారికా పద్యంలో చెప్పబడింది.

'ఇందుమతీ కల్యాణము'
పొందుగ రచియించె సకలబుధులకు శ్రోత్రా
నందమ్ముగ(బద్మ ప్రభు
నందనుడీ వేంకటాద్రి నరపతు లెంచన్.

ఈతడు 1500 ప్రాంతానికి చెందినవాడై ఉండవచ్చు.

**ఇందుమతీ కల్యాణము**

అంగర బసవయ్య ఈ కావ్యకర్త. పెదపాటి జగ్గకవి ప్రబంధ రత్నాకరంలో ఇందులోని ఎనిమిది పద్యాలు లభిస్తున్నాయి. (చూ :- ప్రబంధ రత్నావళి; పు. 65 66.)

**ఇందుమతీ పరిణయము**

పోలూరి గోవిందకవి ఈ ప్రబంధాన్ని రచించినట్లుగా కావలి వేంకట రామస్వామి తమ కవుల చరిత్రలో పేర్కొన్నాడు. 1600 ప్రాంతానికి చెందిన ఈ కవి తంజావూరు రాజుల పోషణలో ఉండేవాడని తెలియవస్తుంది. (ద దే.వా 512 పు.)

**ఇందుమతీ పరిణయము**

ఆలూరి కుప్పన ఈ కావ్యకర్త. 18 వశతాబ్ది మధ్య కాలానికి చెందిన వాడు. తంజావూరు ప్రభువైన తుళజేంద్రుడు తనకు ఆంధ్ర కాళిదాసను బిరుదునిచ్చినట్లుగాను, కస్తూరి రంగకవి శిష్యుడైనట్లుగాను ఈతని ఆచార్య విజయం అవతారిక వల్ల తెలుస్తుంది. ఆచార్య విజయంలో తాను రచించిన గ్రంథాలను కృతికర్త ముఖంగా ఈ విధంగా పేర్కొన్నాడు.

లీల పంచనదీస్థలపురాణము తెని
గించితివారూఢకీర్తి మెఱయ
పఱగు రామాయణ భాగవతంబులు
యక్షగానము చేసితద్భుతముగను
కరమొప్పఁబరమ భాగవత చరిత్రయు
కృతి యొనర్చితివి ఉన్నతి దలిర్ప
తెలివొందు నిందుమతీ పరిణయనామ
కృతి రచియించితివతులగరిమ
గురుతరోజ్జ్వలసరణితో హరికథాసు
ధారసాభిధ కావ్యముదారఫణితి.

ఈతని పంచనదీ స్థలపురాణము, రామాయణ భాగవత యక్షగానాలు, పరమ భాగవత చరిత్ర, ఇందుమతీ పరిణయం, హరికథా సుధారసం, ఆచార్య విజయం అనే కృతుల్లో రామాయణ భాగవత యక్షగానాలు, ఆచార్య విజయం అనే గ్రంథాలు మాత్రమే లభిస్తున్నాయి. తక్కినవి లభ్యంకావు.

**ఇందుమతీ పరిణయము**

పెనుమత్స వెంకటాద్రి (1500) ఈ కావ్యాన్ని రచించినట్లుగా కేసన, మల్లన కవులు రచించిన విష్ణుభజనానందంలో పేర్కొనబడింది.

**ఇందుమతీ పరిణయము**

చిత్రకవి అనంతయ (1580) ఈ కావ్యాన్ని రచించినట్లుగా అతని కుమారుడు చిత్రకవి వెంకటరమణకవి సాంబవిలాసం అవతారికలో పేర్కొన్నాడు ఇంతేకాక ఈతడు హరిహర శ్లేషోదాహరణం, సకల జీవన సంజీవనం, హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్య అనే గ్రంథాలను కూడా రచించినట్లు సాంబ విలాసం ఆశ్వాసాంతగద్యవల్ల తెలుస్తుంది. ఐతే వీటిలో ఒక హరిశ్చంద్ర నలోపాఖ్యానవ్యాఖ్య తప్ప తక్కినవన్నీ అలబ్ధాలే.

**ఇందుమతీ పరిణయము**

మండపాక పేరయకవి ఈ కృతికర్త. ఈతడు కుముద్వతీ పరిణయం, నిరోష్ఠ్య దాశరథీ శతకం మొదలైన గ్రంథాలు రచించినాడట బొబ్బిలిలో మండపాక వారి యిల్లు దగ్ధమైనపుడు ఈ కృతులన్నీ బూడిద ఐనాయట. (ఆ.సం.సా. 307 పు.)

### ఇందుమతీ వివాహము

కుమార ధూర్జటి (17 వ శతాబ్ది) ఈ కావ్యాన్ని రచించినట్లుగా అతని కృష్ణరాయ విజయ కావ్యావతారిక వల్ల తెలుస్తుంది. ఈతడు రచించిన సావిత్రీ కల్యాణమనే మరో కావ్యం కూడా లభ్యం కాలేదు. (చూ:- సావిత్రీ చరిత్ర).

### ఇంద్రవిజయము

నన్నయభట్టు కృతంగా పేర్కొనబడింది. ఈ కావ్యంలోని మొత్తం ఐదు పద్యాలు మాత్రం లభ్యమౌతున్నాయి. (చూ:- అలబ్ధకావ్యపద్యముక్తావళి 21-22 పు.) వీటిలోని 'అంగజుడను మాసటి' అనే పద్యాన్ని పేర్కొని ప్రభాకరశాస్త్రిగారు ఇది నన్నయ పద్యమనుట విశ్వాస్యమగునా అని సందేహాన్ని వెలిబుచ్చినారు. (ప్రబంధరత్నావళి పీఠిక, పు. 10).

### ఇంద్రసేనము

'ఉదాహరణ పద్యములు' అనే సంకలన గ్రంథంలో ఈ కావ్యంలోని ఒక పద్యం ఉదాహరింపబడింది. దీని కర్త ఎవ్వరో సంకలన కర్త పేర్కొలేదు. ఈ కృతికర్త 16 వ శతాబ్దికి పూర్వుడై ఉంటాడు ఉదాహృతపద్యం పురవర్ణనకు సంబంధించింది కనుక ఈ కృతిని ప్రబంధంగా భావించవచ్చు. ఈ పద్యం ప్రబంధ రత్నావళిలో ఉదాహరింపబడింది. (పు. 111).

### ఇతిహాససంగ్రహము

కృతికర్త పేరు తెలియదు. కాని జూపల్లి కొండలరాయ ప్రభువు ఈ కావ్యాన్ని అంకితం పొందినట్లుగా ఎలకూచి బాలసరస్వతి చంద్రికాపరిణయం అవతారికలో చెప్పబడింది.

> ఘనతం గొండలరాయ భూధవుడు విఖ్యాతిం జెలంగెన్, బుధౌ
> ఘనుతంబౌ నితిహాస సంగ్రహము లసత్కావ్యంబుఁ దానంది.

### ఉషాభ్యుదయము

పోడూరి బావన్న (18 శ) ఈ కృతికర్త. ఈతని తమ్ముడు పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయ కావ్యంలో ఈ కావ్య ప్రసక్తి కనిపిస్తుంది.

### ఉషాపరిణయము

తంజావూరిని పాలించిన విజయరాఘవ నాయకుడు ప్రహ్లాద చరిత్రమనే యక్షగానం అవతారికలో తాను రచించిన సుమారు ముప్పై కృతులను

పేర్కొన్నాడు. వాటిలో కొన్ని లభ్యమైనవి. అలభ్యమైన కృతులలో ఉషా పరిణయ యక్షగానం ఒకటి.

**ఈశ్వరీపరిణయము**

కాళిదాసకృత కుమార సంభవ కావ్యానికిది ఆంధ్రానువాదం. విజయ నగర సంస్థానంలో రాజకీయోద్యోగిగా నుండిన చట్రాతి లక్ష్మీ నరసకవి ఈ కావ్యకర్త.

**ఉత్తమగండచ్ఛందము**

ఇందులోని పద్యాలు కవి సర్పగారుడమనే ఛందో గ్రంథంలో ఉదాహరింపబడ్డాయి. పొత్తపి వెంకటరమణ కవి లక్షణ శిరోమణివల్ల ఈ ఛందః కర్త చిత్రపు భీమన (1500) అని తెలియవస్తుంది. ఇది ఉత్తమగండ బిరుదం కల ఔబళరాజపుత్రుడైన కంపభూపతికి అంకితం. ఈ కంపరాజు (1442 - 1459) మనుమంచిభట్టు రచించిన హయలక్షణవిలాసకృతిభర్త.

**ఉదాహరణము**

గణవరపు వేంకటకవి తన ఇరువదోఏట ఒక ఉదాహరణను రచించినట్లుగా ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలో పేర్కొన్నాడు. (26 పద్యం). ఈ ఉదాహరణ కృతికి కవి చేసిన నామకరణ మేమిటో తెలియదు.

**ఉదాహరణము**

మకతల కృష్ణమ్మ ఉదాహరణ మనే పేర ఒక కృతిని రచించినట్లుగా తెలుస్తుంది. (క.స. 42).

**ఉభయభాషామనోహరము**

అడిదం భాస్కరకవి రచించిన లక్షణసారమనే అముద్రిత లక్షణ గ్రంథం వల్ల ఈ కృతిపేరు తెలియవస్తుంది. ఇది ఛందోగ్రంథం కావచ్చు.

**ఉమామహేశ్వరము**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒకే ఒక పద్యం సరసాంధ్రవృత్తరత్నాకరం అనే నామాంతరంకల మాల్యాద్రి నృసింహచ్ఛందమనే ఛందోగ్రంథంవల్ల లభ్యమౌతుంది. (చూః - అలబ్ధకావ్యపద్యముక్తావళి, 23 పుట.)

**ఉలూచీపరిణయము**

సూల్వేటి హరియప్ప అనే కవి ఈ యక్షగానాన్ని రచించినట్లు అవుడూరి కిచ్చయ్య మాధవాభ్యుదయావతారిక వల్ల తెలుస్తుంది. (య.వా చ. 40)

**ఎఱ్ఱన రామాయణము**

"వల్మీకభవువచో వైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబు జేసె" అనే చెదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్ర కావ్యంలోని వాక్యంవల్ల ఎఱ్ఱన రామాయణాన్ని ప్రబంధంగా రచించినట్లు తెలుస్తుంది. ఇంతేకాక వివిధ లక్షణ గ్రంథాల్లో ఎఱ్ఱన రామాయణంలోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. వివిధ ఆకరాలవల్ల ఇందులోని యాభై పద్యాలు మనకు లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి. 24-35 పు.)

**కందర్పకేతువిలాసము**

ఈ కృతికర్త తెనాలి రామలింగకవి. ఈ కావ్యంలోని నాలుగు పద్యాలు జగ్గకవి తన ప్రబంధ రత్నావళిలో సేకరించాడు. (చూ:- ప్రబంధ రత్నావళి, పుట. 90) కుమార సంభవ పీఠికలో మానవల్లివారు మరో పద్యాన్ని ఈ కావ్యం లోనిదిగా పేర్కొన్నారు. మొత్తంమీద ఈ కృతిలోని ఐదు పద్యాలు లభ్యమౌతున్నా యన్నమాట. (చూ:- అలబ్ధకావ్య పద్యముక్తావళి; పు. 36-38).

**కందశతకము**

ఈ శతకంలోని ఒక పద్యం లక్షణశిరోమణిలో ఉదాహరింపబడింది. (4-152) 'అల్లయ వేమా' అనేది ఇందులోని మకుటం. "వీరభద్రారెడ్డి జేసిన కంద శతకములో భాస్కరుడు చెప్పిన కందము లక్ష్యము" అని ఉదాహరణ పద్యం అవతారికా వాక్యంవల్ల ఈ శతక కర్త భాస్కరుడని తెలియవస్తుంది.

**కంసవిజయము**

"అతులిత ప్రౌఢిచే నల కంసవిజయంబు ఘటియించు భువన విఖ్యాత శీల" అని విజయరాఘవనాయకుడు తాను కంసవిజయ యక్షగానాన్ని రచించినట్లుగా ప్రహ్లాదచరిత్రలో పేర్కొన్నాడు.

**కశివప్రాపశతకము**

గణపవరపు వేంకటకవి ఈ శతకాన్ని రచించినట్లుగా అతని ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసకావ్యావతారికవల్ల తెలుస్తుంది. (1-48)

**కన్నప్పచరిత్ర**

కంచిరాజు సూరయ్య ఈ కృతిని రచించినట్లుగా ప్రబంధ రత్నాకరం వల్ల తెలుస్తుంది. ఈ కావ్యంలోని నాలుగు పద్యాలిందులో ఉదాహరింపబడ్డాయి. (చూ:- ప్రబంధరత్నావళి 102.103 పుటలు).

**కన్నప్పచరిత్ర**

ఈ కావ్యాన్ని, సీమంతినీ విజయకావ్యరచయిత వీరభద్రకవిముత్తాత రచించినట్లుగ సీమంతినీ విజయం అవతారికలోని కింది పద్యపాదంవల్ల తెలుస్తుంది:

> మరకాణభూమీశ వరలబ్ధకవితాధురంధర వీరభద్రాభిధాన
> శశిర మీ ముత్తాత పదగుంభనలఁజెప్పె కన్నప్పచరిత సత్కవులు
> పొగడ.

వీరభద్రకవి ముత్తాత పేరు తెలియరాదు.

**కమలాకరచరిత్ర**

దీనికర్త ఎవ్వరో తెలియదు. రత్నాకరం గోపాలరాజు రచించిన సకల లక్షణ సారసంగ్రహమనే లక్షణ గ్రంథంలో ఈ కావ్యం నుండి మూడు పద్యాలు ఉదాహరింపబడ్డాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి, పుట 39.) ఈ కావ్యకర్త క్రీ.శ. 1670 కి పూర్వుడు.

**కరణికోద్ధారిణి**

ఊరి వీరభద్రకవి ఈ కృతికర్త. దొనకొండ గంగ నాతరను వర్ణిస్తూ చెప్పిన ఈ కృతిలోని ఒక్క పద్యం చాటుపద్య రత్నాకరంలో లభిస్తుంది.

**కర్ణామృతము**

వెలగపూడి వెంగళార్యుడీ కృతిని రచించినట్లుగా ఆంధ్రకవుల చరిత్ర వల్ల తెలుస్తుంది ఈ క్రింది పద్యం కర్ణామృతంలోనిదిగా కవుల చరిత్రలో పేర్కొబడింది.

> ఏ యధికుండు క్రోడత వహించిన నాతని రోమరంధ్రమున్
> తోయధులెల్ల నించు హవణుల్గన సేరకయుండె నట్టి నా
> రాయణు డద్భుతాకృతిని రాగిలి నందవదూటి దోయిటన్
> తోయము చల్లగా దనివి దోగుచునుండెడి చిత్రమెట్టిదో.

ఈ పద్యాన్ని గమనిస్తే ఈ కృతి పేరు కృష్ణకర్ణామృతమేమో అని భావించే అవకాశం ఉంది. (3 వ భాగం, 157 వ పుట.)

**కల్పితకల్పలత**

గణపవరపు వేంకటకవి ఈ కృతిని రచించినట్లు ఆతని ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసం అవతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

జగతిన్వృత్త చతుష్టయ
మగణితముగఁజిత్ర కవితలై దిర్వదిలోఁ
దగ మెప్పు గనందగు రూ
ఢిగఁగల్పిత కల్పలత పాటించిన ప్రౌఢన్-(46వ పద్యం)

ఈ కృతి చిత్రకవితాకృతి.

**కృష్ణవిలాసము**

విజయరాఘవ నాయకుడు ఈ యక్షగానాన్ని రచించినట్లుగా ఆతని ప్రహ్లాద చరిత్ర యక్షగానావతారికవల్ల తెలుస్తుంది.

**కవికంఠపాశము**

ఈ ఛందోగ్రంథ కర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని పద్యాలు లక్షణశిరోమణి (4-236) లోను, గౌరన లక్షణదీపికలోను, ఆనంద రంగ రాట్ఛందంలోను ఉదాహరింపబడ్డాయి.

**కవికంఠాభరణము**

అప్పకవి పేర్కొన్న పూర్వలక్షణ గ్రంథాల పట్టికలో ఈ కృతి ప్రసక్తి కనిపిస్తుంది. (1-5) ఇది ఛందోగ్రంథం. దీని కర్త ఎవ్వరో తెలియదు.

**కవికదంబము**

ఆసూరి మరింగంటి కవులలో ఒకరైన సింగరాచార్యులు ఈ కృతికర్త. ఈతడు తన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ కావ్యం అవతారికలో తాను రచించిన గ్రంథాల నన్నింటినీ పేర్కొన్నాడు.

**కవికల్పకము**

అడిదం భాస్కరకవి రచించిన 'లక్షణసారం' వల్ల ఈ కృతి పేరు తెలియవస్తుంది. ఇది ఛందోగ్రంథం కావచ్చు. భాస్కరకవి లక్షణసారం అముద్రితం.

**కవికుముదసుధాకరము**

గొప్ప లాక్షణికుడుగా ప్రసిద్ధిచెందిన కాకునూరి అప్పకవిచే రచింపబడ్డ లక్షణ గ్రంథం. ఇందులో ఛందో విషయాలు వర్ణింపబడి ఉండవచ్చు. (చూ : అంబికావాదము.)

**కవిజనచింతామణి**

అడిదం భాస్కరకవి రచించిన లక్షణసారమనే అముద్రిత లక్షణ గ్రంథం వల్ల ఈ కృతి తెలియవస్తుంది. ఇది ఛందోగ్రంథం కావచ్చు.

**కవిభల్లటఫక్కిక**

ఆంధ్ర శబ్ద చింతామణిలోను, ఆంధ్ర కౌముదిలోను కవి భల్లటుని మతం పేర్కొబడింది. అప్పకవి ప్రాచీన లక్షణ గ్రంథాలను పేర్కొంటూ కవి భల్లట ప్రక్రియను పేర్కొన్నాడు. దీనిని బట్టి కవి భల్లటుడు కవిభల్లట ప్రక్రియ అనే తెనుగు వ్యాకరణ గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తుంది. ఈ వ్యాకరణ గ్రంథం సంస్కృతంలో రచింపబడిందో లేక తెలుగులో రచింపబడిందో తెలియదు. కవిభల్లటుడు 13 వ శతాబ్దికి చెందినవాడు.

**కవిమూషికమార్జాలము**

అప్పకవి పేర్కొన్న ప్రాచీన లక్షణగ్రంథాలలో ఈ కృతి పేరు కనిపిస్తుంది. (1-5.) ఇది ఛందోగ్రంథం కావచ్చు. పట్టాభిరామకవి రచితమైన కవిమూషికమార్జాల గ్రంథం లభ్యమే.

**కవిమనోహరము**

ఈ కృతి కర్త యెవ్వరో తెలియదు. ఇందులోని ఒక పద్యం ప్రబంధ సార శిరోమణిలో సంకలనం చేయబడింది. ఈ పద్యంలో పుష్పలావికల వర్ణనం ఉంది. (పుట. 4.)

**కవిరాక్షసచ్ఛందము లేక కవిరాక్షసీయము**

అప్పకవీయంలో కవిరాక్షసుని ప్రసక్తి కనిపిస్తుంది. (పీఠిక 46 పు.) అప్పకవి ప్రాచీన లక్షణ గ్రంథాలను పేర్కొంటూ కవిరాక్షసీయాన్ని కూడా పేర్కొన్నాడు (1-5.) ఇది ఛందోగ్రంథం. ఇందులోని కొన్ని పద్యాలు ఆనందరంగరాట్ఛందంలో ఉదాహరింపబడ్డాయి. కవిరాక్షసుడు నన్నయ, తిక్కనల నడిమి కాలానికి చెందినవాడు కావచ్చు.

**కవులషష్ఠము**

నంది మల్లయ, ఘంట సింగన అనే జంటకవులచే రచింపబడ్డ భాగవత షష్ఠస్కంధమే ఈ కృతి. లక్షణగ్రంథాల్లో దీనికి శృంగారషష్ఠం, రాచమల్లు వారి కవుల షష్ఠం అనే వ్యవహారం కూడా కనిపిస్తుంది. లక్షణసారసంగ్రహం, సుకవి మనోరంజనం, కవి సంశయ విచ్ఛేదం మొదలైన లక్షణ గ్రంథాల్లో ఇందులోని పద్యాలు మొత్తం ఇరవైఏడు వరకు లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి, పు. 40 - 46.) ఈ కావ్యం చిక్కతిమ్మరాజు కుమారుడైన తిమ్మరాజుకు అంకితమైనట్లుగా 'చండాంశుప్రభ' అనే ఇందులోని పద్యం వల్ల తెలుస్తుంది.

**కళాభిరామము**

ఇది నారాయణదేవునిచే రచింపబడిన కామశాస్త్ర గ్రంథం. పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరం ప్రత్యంతరంలో ఇందులోని ఐదు పద్యాలు సంకలితమై ఉన్నాయి. (చూ: సాహిత్య సంపద - 269 - 70 పుటలు.) దీనికి మదనకళాభిరామమనే పేరు ఉన్నట్లుగా తెలుస్తుంది.

**కళావతీ శతకము**

తేళ్ళపూడి కసవరాజు ఈ శతక కర్త. 'కళావతీ' అనేది ఇందులో మకుటం. ఈ శతకంలోని ఆరు పద్యాలు ప్రబంధరత్నాకరం వల్ల, ఉదాహరణ పద్యాల వల్ల లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్య పద్య ముక్తావళి, 47-48 పుటలు)

**కళావిలాసము**

నన్నెచోడుడు కుమారసంభవకావ్యాన్నే కాకుండా కళావిలాసమనే కావ్యాన్ని కూడా రచించినట్లు సంకలన గ్రంథమైన ప్రబంధరత్నాకరం వల్లా, లక్షణ గ్రంథమైన ఆంధ్ర ప్రబంధ రత్నాకరం వల్లా తెలియవస్తుంది. ఇందులోని మొత్తం ఏడు పద్యాలు లభ్యమైనాయి. (అలబ్ధ కావ్య పద్య ముక్తావళి, 49-51 పుటలు.)

**కళావిలాసము**

నన్నెచోడుడు కళావిలాసమనే కృతిని రచించినట్లుగా ఆంధ్ర ప్రబంధ రత్నాకరం వల్లా, ప్రబంధ రత్నాకరం వల్లా తెలుస్తుంది. కాని యీ కృతి

దానికి భిన్నం. నన్నెచోడుని కళావిలాసంలోని లభించిన పద్యాలను బట్టి అది నానా పురాణ కథలతో గూడిన కావ్యమని భావించవచ్చు. కాని ఇది ఒక కామశాస్త్ర గ్రంథం. దీని కర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని 21 పద్యాలు ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో సేకరింపబడినాయి. (చూ :- సాహిత్య సంపద, 258-267 పుటలు.)

**కాంచీపురమాహాత్మ్యము**

దగ్గుపల్లి దుగ్గన (15 శ.) ఈ కావ్యాన్ని రచించినట్లుగాను, నాసికేతూపాఖ్యాన కృతి భర్త గంగయామాత్యుని పెదతండ్రి కుమారుడగు చందలూరి దేవయమంత్రికి ఈ కావ్యం అంకితం చేయబడినట్లుగాను నాసికేతూపాఖ్యానంలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది:

మా పినతండ్రి గంగయయమాత్య శిఖామణి తత్తనూభవుం
డై పెనుపొందు దేవసచివాగ్రణి కిచ్చితివంధ్రభాషఁ గాం
చీపురనాథ దివ్యకథఁజిత్రతరంబుగ విస్తరించి నీ
వోపుదువార్య హృద్యమధురోక్తుల సత్కృతులొప్పజెప్పగన్.

(అవతారిక 1.20.)

ఈ కావ్యానికి శివకాంచీ మాహాత్మ్యమనీ, కాంచీ మాహాత్మ్యమనీ వ్యవహారం ఉన్నది. ఇందులోని రెండు పద్యాలు పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరింపబడ్డాయి. (చూ :- ప్రబంధరత్నావళి, 40 పుట.)

**కాంచీమాహాత్మ్యము**

కుడిచెర్ల తిప్పరాజు రచించిన ఈ కృతిలోని ఆరు పద్యాలు ఉదాహరణ పద్యాలు అన్న సంకలన గ్రంథంలో సేకరింపబడ్డాయి. (చూ:- ప్రబంధ రత్నావళి; పుటలు - 37-38.)

**కాదంబరి**

భాస్కరుని కేతన (12వ శతాబ్ది) చే రచింపబడ్డ కావ్యం. ఇందులోని పద్యాలు స.ల.సా., ఆ.రం.ఛం. మొదలైన ఛందోగంథాల్లోనూ, జగ్గకవి ప్రబంధ రత్నాకరంలోనూ, ఉదాహరణపద్యాల్లోనూ పేర్కొబడ్డాయి. ఇందులోని పద్యాలు ఆరు మాత్రమే లభించినాయి. (చూ:- అలబ్ధకావ్య పద్య ముక్తావళి, పుట - 52-54.) భట్టబాణుని సంస్కృతకాదంబరికి ఇది పద్యానువాదం.

**కామందకము**

ఈ గ్రంథంలోని సుమారు 310 పద్యాలు సకల నీతి సమ్మతంలో గ్రహింపబడ్డాయి. సంస్కృతంలోని కామందకుని అర్థశాస్త్రానికి ఇది అనువాద గ్రంథం కావచ్చు. దీని కర్త ఎవరో తెలియదు. దీనిని క్రీ. శ. 1430 కి పూర్వపు రచనగా భావింపవచ్చు.

**కార్తికేయాభ్యుదయము**

ఎలకూచి బాలసరస్వతి ఈ కావ్యం రచించినట్లుగా అతని చంద్రికా పరిణయం అవతారికవల్ల తెలుస్తుంది.

కడు జాలి చెప్పితిఁ గార్తికేయాభ్యుద
యాది కావ్యములు గుణాధికములు

**కాలామృతము**

ఇది కాలామృతమనే సంస్కృత జ్యోతిష గ్రంథానికి ఆంధ్రీకరణమట. రచయిత 1450-1500 మధ్యకాలంలో ఉన్న అప్పకవి వంశీయుడైన తిరుమల భట్టారకుడట. (గో.క.సం.)

**కాశీఖండము**

మోచెర్ల నన్నయ కవిచే రచింపబడిన ద్విపద కావ్యం. ఈతని సాంబో పాఖ్యాన ప్రబంధం (అముద్రితం) లోని ఈ కింది అవతారికా పద్యం వల్ల ఈ విషయం తెలుస్తుంది.

కాశీఖండము వేడ్కతో ద్విపదగా గావించి నే నిచ్చితిన్
వాసిన్ మీఱ నరాంకితంబుగను దానన్ లాభమేమంచు ను
ల్లాసంబొప్పగ సర్వలక్షణములన్ లక్షించి సాంబోదయం
బా సర్వేశ్వరు కంకితంబుగను జేయంబూని యున్నట్టిచోన్.

కంచెర్ల అయ్యనకవి కూడా కాశీఖండ కావ్యాన్ని ద్విపదలో రచించి నాడు. ఈ రెండు ద్విపద కావ్యాలూ అలభ్యాలే. అప్పకవీయంలో సాంబో పాఖ్యానంలోని పద్యాలు ఉదాహరింపబడటంవల్ల ఈ కవి క్రీ శ. 1660 కి పూర్వుడని భావించవచ్చు.

**కాశీఖండము**

కాశీఖండ కావ్యాన్ని ద్విపదలో కంచెర్ల అయ్యన (1500) రచించి నట్లుగా కంచెర్ల శరభకవి తన అధ్యాత్మ రామాయణం (అముద్రితం)లో ఈ విధంగా పేర్కొన్నాడు:

కవిత రచనలు గుల్కెడు పలుకులమర
 శబ్ద నాటకాలంకార సరణి లొప్ప
చెలువు మెఱయఁ గాశీఖండ మెలమి ద్విపదఁ
 జేసి కంచెర్ల అయ్యన్న శ్రీలు ప్రబల

మోచెర్ల నన్నయ కూడా కాశీఖండాన్ని ద్విపదలో వెలయించినాడు. ఐతే ఈ రెండూ ప్రస్తుతం అలభ్యాలే.

**కాళహస్తిలింగ శతకము**

బొడ్డపాటి కొండయ్య ఈ శతక కర్త. ఇందులోని మూడు పద్యాలు పెదపాటి జగ్గకవి ప్రబంధ రత్నాకరంలో ఉదాహరింపబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి 23-24 పు.) లభించిన పద్యాలను బట్టి ఈ శతకం "అంగ శివగంగ తిరుకాళహస్తిలింగ" అనే మకుటంతో సీసపద్యాల్లో రచింప బడినట్లు తెలుస్తుంది.

ఈ శతకానికి తిరుకాళహస్తిలింగ శతకంగా ప్రసిద్ధి ఉంది. ఈ కవి 1650 కి పూర్వుడు. అనంత మాహాత్మ్యం, పద్మినీ వల్లభం, మంగళగిరి విలాసం, సూర్య శతకం, శంకర విజయం మొదలైన కృతులను రచించిన బొడ్డపాటి పేరయకవి ఈతని వంశీయుడే కావచ్చు

**కాళిందీ పరిణయము**

ఇది తుమ్మూరి శరభరాజకవిచే రచింపబడ్డ కావ్యం. శరభరాజ కవి కాళిందీ పరిణయమే కాక శృంగార సుధార్ణవం, ప్రజ్ఞావతీ రాయబారం, లవలీ వివాహం, భాగవతాభ్యుదయం అనే కావ్యాలను, శరభరాజీయమనే వైద్య గ్రంథాన్ని, హరిహరస్తుత్యాత్మకాలైన ఎన్నో శతకాలను రచించినట్లుగా అముద్రితంగా ఉన్న ఈతని శరభరాజీయంలోని ఈ క్రింది అవతారికా పద్యం వల్ల తెలుస్తుంది.

శయ్యా చమత్కార సరసత గూర్చితి మహిని శృంగారసుధార్ణవంబు
పాక భేదములనేర్పడఁ బల్కితి వినుతి సేయ ప్రజ్ఞావతీ రాయబార
మవలీల రచియించితా నవ లవలీవి వాహంబు కవిరాజ వర్ణితముగ
సరసులుప్పొంగగా సమకూర్చలేదె భాగవతాభ్యుదయమను కావ్యమొకటి
వల్కితివి వేడ్కఁగాళింది పరిణయంబు పార్వతీనాథ విష్ణులఁ బ్రస్తుతించి
శతకముల్పెక్కు కూర్చితి శరభరాజ యెన్న సామాన్యకవివె కవీంద్రమౌళి.1

ఈతడు తాను ప్రతాపరుద్రదేవుని ఆస్థానంలో ప్రధాన మంత్రి పదవి నలంకరించిన శివదేవయ్య వంశీయుడనని, తెలంగాణ మండలి ఓరుగల్లు నివాసి ననీ చెప్పుకున్నాడు. శ్రీ కృష్ణుడు కాళిందిని పరిణయమాడడం ఈ ప్రబంధం లోని వర్ణ్యాంశమై ఉంటుంది.

**కిరాతార్జునీయము**

ఈ ప్రబంధ రచయిత ఎవ్వరో తెలియదు. ఇది దోమకొండ సంస్థా నాధి పతులలో ఒకరైన మొదటి ఎల్లారెడ్డికి అంకితమైన కృతియని పట్ట మెట్ట సోమనాథుడు రచించిన బ్రహ్మోత్తరఖండంవల్లా, మల్లారెడ్డి రచిం చిన శివధర్మోత్తరంవల్లా తెలుస్తుంది. (చూ :- బాలభారతము)

**కిరాతార్జునీయము**

ఏనుగు లక్ష్మణకవి రచించిన రామవిలాసకావ్యంలోని కింది పద్యం వల్ల ఈ కావ్యాన్ని గురించి తెలియవస్తుంది.

అమితఖ్యాతికి మూలమైన కృతి దానందెన్ గిరాతార్జునీ
యము శ్రీరాముల పేరఁ బద్యశతకంబారూఢి నిర్మించె భో
జమహీజానిగతిన్ ప్రసిద్ధి గనియెన్ సాహిత్య సారజ్ఞుఁడై
రమణన్ శ్రీ బలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్

ఈ కావ్యకర్త ఎవరో తెలియదు. పై పద్యం వల్ల ఈ కావ్యాన్ని వత్సవాయ బలభద్రరాజ కవి అంకితం పొందినట్లుగా మాత్రం తెలియ వస్తుంది.

---

1. శరభరాజీయప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. చూ. ఆర్. నెం. 539.

**కుమారగురువిలాసము**

చిత్రకవి వెంకటరమణ కవి రచించిన కృతి ఇది. ఇందులోని వస్తు వేమిటో తెలియదు.

**కుమారనైషధము**

పెదపాటి ఎఱ్ఱన ఈ కృతికర్త. ఈతని ఇంటి పేరు పెదపాటి కాదని, ఎడపాటి అని కవితరంగిణీకారుల అభిప్రాయం. ఇందులోని 17 పద్యాలను పెదపాటి జగ్గన తన సంకలనగ్రంథంలో ఉదాహరించినాడు. (చూ: ప్రబంధ రత్నావళి, పు. 16.20.)

**కుమారార్జునీయం**

మైసూరు సామంతరాజ వంశాలలో ఒకటైన సుగుటూరి వంశానికి చెందిన ముమ్మడి తమ్మభూపతి (1614-1630) ఈ కృతికర్త. ఈతడు రాజేంద్ర చోళ చరిత్ర, సౌందరేశ చరిత్ర అనే గ్రంథాలను కూడా రచించినట్లు కవి సప్తశతి తెలుపుతుంది. (171 పు.) ఈతని ఈ గ్రంథాలేవీ లభించలేదు.

**కుముద్వతీపరిణయము**

మండపాక పేరయ కవి (1710-57) ఈ కృతికర్త. ఈతడు నిరోష్ఠ్య దాశరథీ శతకం, ఇందుమతీ పరిణయం అనే కృతులు కూడా రచించినాడట. బొబ్బిలిలో మండపాకవారి యిల్లు పరశురామ ప్రీతి ఐన సందర్భంలో వీరి కృతులన్నీ బూడిద ఐనాయట. (ఆం. సం. సా. 307.)

**కువలయాశ్వచరిత్ర**

ఏర్చూరి సింగన (15 శ.) ఈ కృతికర్త. జగ్గకవి ప్రబంధ రత్నాకరం వల్ల ఇందులోని పన్నెండు పద్యాలు మాత్రమే మనకు లభ్యమౌతున్నాయి. (చూ:- ప్రబంధ రత్నావళి 100 - 103 పుటలు) వీటిలోని ఒక పద్యం తిమ్మ కవి లక్షణసారసంగ్రహంలో కూడా ఉదాహరింపబడింది.

**కువలయాశ్వచరిత్ర**

ఈ కృతి కేతనకృతంగా ఉదాహరణ పద్యములనే సంకలన గ్రంథంలో పేర్కొనబడింది. కేయూరబాహు చరిత్రను రాసిన మంచెన వాక్యాన్నిబట్టి తత్కృతిపతియైన నండూరి గుండయమంత్రి అన్నయైన కేతన కవియై నట్లుగా తెలుస్తుంది. అతని ఇతర గ్రంథాలేవీ తెలియవు. అతడే ఈ కృతి

కర్త కావచ్చు. ఇందులోని ఒక పద్యం 'ఉదాహరణ పద్యముల'లో ఉదాహరింపబడింది. (చూ :- ప్రబంధ రత్నావళి, 23 పు )

**కుశలవోపాఖ్యానము**

చిరుమూరి గంగరాజు ఈ కృతికర్త. ప్రబంధ రత్నాకరం, ఉదాహరణ పద్యములు అన్న సంకలన గ్రంథాలలో ఇందులోని పద్యాలు రెండు ఉదాహరింపబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి, 27 పు ) తెలుగులో కుశలవుల కథను ప్రత్యేక కావ్యంగా చెప్పిన మొదటి కృతి ఇదే.

**కూర్మపురాణము**

ఆంధ్ర ప్రయోగ రత్నాకరం అనే లక్షణ గ్రంథంలో 'మలయమారుతాభిధాన మల్లయ కూర్మపురాణం' అనీ, మలయమారుతం మల్లయ కూర్మపురాణం అనీ ఉండడం వల్ల మలయమారుతం మల్లన ఈ పురాణకర్త అని తెలుస్తుంది. కూర్మపురాణంలోని ఒక పూర్తి పద్యమూ, మరో పద్యంలో కొద్ది భాగమూ ఆంధ్ర ప్రయోగ రత్నాకరం వల్ల లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధ కావ్య పద్య ముక్తావళి, 59 పు.)

**కృష్ణకథ**

కాళహస్తి సంస్థానాధీశ్వరులలో ఒకడైన దామెర్ల వెంగళ భూపాలుడు ఈ కృతికర్త. బహుళాశ్వ చరిత్ర రచనకు ముందు తానీ కావ్యాన్ని రచించినట్లుగా వెంగళభూపాలుడు తన బహుళాశ్వ చరిత్ర అవతారికలో పేర్కొన్నాడు.

దామర వేంకటప్రభువతంసుని వెంగళభూప మా వయిన్
శ్రీ మెఱయంగ కృష్ణకథఁ జెప్పితి. (1.15.)

**కృష్ణగోపికాలంకారము**

పొత్తపి వెంకటరమణకవి తన లక్షణశిరోమణిలో ఈ కావ్యంలోని ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. (4.5.) దీని కర్త ఎవ్వరో తెలియదు.

**కృష్ణ దండకము**

చేకుమళ్ళ రంగశాయి ఈ దండకాన్ని రచించినట్లుగా అతని వాణీవిలాసవనమాలిక అవతారికవల్ల తెలుస్తుంది.

**కృష్ణభుజంగము**

నెల్లూరు వీరరాఘవకవి (1680-1740) ఈ కృతిని రచించినట్లుగా ఇతని వసుంధరా పరిణయంలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

'కష్ణభుజంగంబు' కృష్ణలీలామృతము
త్రిపురారి దండక కృతి రచించి
.... .... .... .... ....
ఘటన చేసితి వీరరాఘవ కవీంద్ర!

కృష్ణభుజంగ కృతిలో వర్ణింపబడిన కథావస్తువు కాళియమర్దనం కావచ్చు. ఈతడు యాదవ రాఘవ పాండవీయం, వసుంధరా పరిణయం, త్రిపురారి దండకం, స్తంభోద్భవం, రసమంజరి, సర్వలోకేశ శతకం, విశేషణ రామాయణం మొదలైన కృతులను రచించినాడు. వీటిలో మొదటి రెండు కృతులు, విశేషణ రామాయణం తప్ప తక్కినవన్నీ అలభ్యాలే.

**కృష్ణమల్లకథ**

గణపవరపు వేంకటకవి తానీ కృతిని ఇరవైయైదో ఏట రచించినట్లుగా ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాస కావ్యంలో చెప్పుకున్నాడు.

"ఇరువదేనవయేట గృష్ణమల్లకథ చ
తుర్ముద్ర జెప్పి సంతుష్టి గన్న" (అవతారిక 27 పద్యం.)

**కృష్ణలీలామృతము**

నెల్లూరి వీరరాఘవకవి (1680-1740) ఈ కృతిని రచించినట్లుగా ఇతని వసుంధరాపరిణయం అవతారిక వల్ల తెలుస్తుంది. (చూ:- కృష్ణ భుజంగము)

**కృష్ణలీలామృతము**

నెల్లూరి వీరరాఘవకవి (1680-1740) ఈ కృతికర్త. కామకళానిధిని రచించిన నెల్లూరి శివరామకవి ఈ వీరరాఘవకవి తండ్రి. ఈతడు సంస్కృతాంధ్రాల్లో మొత్తం ఆరవై గ్రంథాలకుపైగా రచించినాడు. వీటిలో 15 తెలుగు కృతులు. ఐతే వల్లీ రామాయణం, రసమంజరి, యాదవరాఘవ పాండవీయం, వసుంధరా పరిణయం మాత్రమే ప్రస్తుతం లభ్యమౌతున్న తెలుగు కృతులు.

**కృష్ణవిలాసము**

వరాతం అప్పన్న ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఆంధ్ర ప్రబంధ రత్నాకరం వల్ల తెలుస్తుంది. ఈ కావ్యంలోని ఒక పద్యపాదం మాత్రమే లభ్యమౌతుంది. (చూ:- అలబ్ధకావ్యపద్య ముక్తావళి - 61 పు.)

**కృష్ణవిలాసము**

విజయరాఘవ నాయకుడీ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో పేర్కొనబడింది.

**కృష్ణవిలాసము**

మండ లక్ష్మీనృసింహకవి రచించిన ఆంధ్రకౌముది అనే వ్యాకరణ గ్రంథంలో 'నాచన సోమయాజి కృతే కృష్ణ విలాసే' అనే వాక్యం వల్ల నాచన సోమన కృష్ణ విలాసమనే కావ్యాన్ని రచించినట్లుగా తెలుస్తుంది. ఇందులోని ఒక పద్యం మాత్రమే ఆంధ్ర కౌముదిలో ఉదాహరింపబడింది (చూ:- అలబ్ధ కావ్యపద్యముక్తావళి - 60 పుట.)

**కృష్ణార్జునసంవాదము**

పోచిరాజు వీరన్న (18 శ.) ఈ కృతికర్త. ఇతడు ఈ కావ్యాన్నే కాక శిల్హణచరిత్ర, పంచకావ్యములు, విభూతి మాహాత్మ్యము, మార్కండేయ చరితము, మనువంశ పురాణము, ముక్తదేవు కథ, ఆనందలహరి, సౌందర్యలహరి, భర్తృహరి సుభాషితములు అనే కృతులను కూడా రచించినాడు. ఈ కృతుల వివరాలన్నీ శిల్హణచరిత్ర వల్ల తెలుస్తున్నాయి.

**కృష్ణార్జునసంవాదము**

రాజవోలు సుబ్బరాయకవి (17 శ.) ఈ కృతిని రచించినట్లుగా అతని జయవిజయాభ్యుదయ కావ్యావతారికవల్ల తెలుస్తుంది. కవి దీనిని మహా ప్రబంధంగా పేర్కొన్నాడు. (చూ :- గరుడాంజనేయసంవాదం.)

**కేదారఖండము**

పెదపాటి సోమయ (1500 ప్రాంతం) ఈ కృతి కర్త. ఉదాహరణ పద్యాల్లోనూ, పెదపాటి జగ్గకవి ప్రబంధ రత్నాకరం లోనూ ఈ కావ్యంలోని పద్యాలు తొమ్మిది ఉదాహరింపబడ్డాయి. ఈతడు అరుణాచలపురాణము, త్రిపురవిజయము, శివజ్ఞానదీపిక అనే గ్రంథాలను రచించినట్లు సంకలన గ్రంథాలవల్ల తెలుస్తుంది. ఈతని గ్రంథాలన్నీ అలభ్యాలే.

**కేశవవిలాసము**

జటప్రోలు సంస్థానంలో ఉండిన శేషభట్టరు సింగచార్యులు ఈ కావ్య కర్త. 'శూద్ర ధర్మోత్పలద్యోతినీస్మృతి కౌముది' అనే గ్రంథంలో తానీ గ్రంథం వ్రాసినట్లుగా చెప్పుకున్నాడు. (స. ఆం. సా. 12 . 29 పుట.)

**కొట్టియశంకరేశ్వర శతకము**

నేడు కొణిదెన అని వ్యవహరింపబడే క్షేత్రంలోని శంకరేశలింగాన్ని స్తుతిస్తూ కస్తూరి భట్టరాజు చెప్పిన శతకమని నిడదవోలువారు తెలుపుతూ ఇందులోని రెండు పద్యాలను ఆంధ్రపత్రిక జయసంవత్సర ఉగాది సంచికలో పేర్కొన్నారు.

**కౌసల్యాపరిణయము**

శివరామాభ్యుదయమనే ద్వ్యర్థికావ్యాన్ని రచించిన పోడూరి పెదరామామాత్యుడు ఈ కృతి కర్త. పోడూరి వంశంలోని కొండకవి, బాపన్న విద్వత్కవులు.

**కౌస్తుభాభరణాంకము**

లక్షణ శిరోమణి కర్త శ.ష,సల ప్రాసమైత్రిని తెలుపుతూ 'కౌస్తుభాభరణాంకుడు లక్షణము' అని పేర్కొన్నాడు. గ్రంథాన్ని గూర్చికానీ, గ్రంథ కర్తను గూర్చికానీ వివరాలు తెలియరావు.

**గంగాగౌరీసంవాదము**

17 వ శతాబ్దికి చెందిన వేములవాడ సోమనాథుడు ఈ కృతికర్త. తెలంగాణంలోని వేములవాడ ఇతని నివాసం. సోమన విద్వజ్జనరంజని (వసుచరిత్ర వ్యాఖ్య) ధ్రువచరిత్ర, మరుత్సందేశము, ముద్రాలాభము అనే గ్రంథాలను కూడా రచించినట్లు తెలుస్తుంది. ఆయన గ్రంథాలలో విద్వజ్జనరంజని తప్ప తక్కినవన్నీ అలబ్ధాలే.

**గజేంద్రమోక్షము**

ఇది రఘునాథనాయకుడు రచించిన యక్షగానమనీ, దీనినాతని ఆస్థానంలో వినిపిస్తుండేవారనీ విజయరాఘవనాయకుని రఘునాథనాయకాభ్యుదయంవల్ల తెలుస్తుంది.

గణచతుర్థ్యుపాఖ్యానము

మరింగంటి వంశీయుడైన రామానుజాచార్యులు (1700 - 1780) ఈ కృతిని రచించినట్లుగా సురతాణీ పరిచయ కావ్యావతారికలో పేర్కొబడింది.

విఖ్యాతి గణచతుర్థ్యు
పాఖ్యానాది ప్రబంధబంధన కవిరా
ణ్ముఖ్యుడు తారావిమలస
మాఖ్యుడు రామానుజార్యమణి కేవలుఁడే. (1-56.)

గణాడంబరము

పండితారాధ్యుడీ కృతిని రచించినట్లు పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. (వాదప్రకరణం)

గరుడపురాణము

పింగళి సూరన ఈ కృతిని రచించినట్లుగా అతని కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం అవతారికల్లోని కింది పద్యాలు తెలుపుతున్నాయి.

జనముల్ మెచ్చగ మున్ రచించితినుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీ రాఘవ పాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుంగబ్బములెన్నియేనియును మత్పిత్రాది వంశాభి వ
ర్ణనలేమింబరితుష్టి నా కవి యొనర్పంజాల నత్యంతమున్
(ప్రభావతీప్రద్యుమ్నం - 6 వ పద్యం)

పై పద్యంలో గరుడపురాణం, రాఘవ పాండవీయం, కళాపూర్ణోదయా లేకాక ఎన్నో తెలుగు కావ్యాలు రచించినట్లుగా పేర్కొన్నా-ఆ కావ్యాల పేర్లైనా మనకు తెలియరావు.

ఇట మున్ గారుడ సంహితాదికృతులీవిం బొందగా పెక్కొనర్చుట
విన్నారము (కళాపూర్ణోదయం అవతారిక 14వ పద్యం.)

గరుడాంజనేయసంవాదము

రాజవోలు సుబ్బరాయకవి ఈ కృతికర్త (17శ). ఈతడు తన జయ విజయాభ్యుదయం అనే కావ్యంలో తాను చిత్రాంగదాపరిణయం, గరుడాంజనేయ సంవాదం, సుదంతా వివాహం, కృష్ణార్జున సంవాదం అనే కావ్యాలను రచించినట్లుగా చెప్పుకున్నాడు. ఈతని జయవిజయాభ్యుదయం తప్ప తక్కిన కావ్యాలేవీ లభ్యం కాలేదు.

### గాంగేయోపాఖ్యానము

వెలగపూడి కృష్ణయ తన భానుమద్విజయ కావ్యావతారికలో తమ వంశీయులు వ్రాసిన కావ్యాలను ఈ విధంగా పేర్కొన్నాడు.

భూనుత గాంగేయోపా
ఖ్యాన సుమంతోదయాంధ్ర కర్ణామృతముల్
మాన్యత వజ్రభుజోపా
ఖ్యానము శుభహేతు సేతుమాహాత్మ్యంబున్. (32వ పద్యం)

దత్తాత్రేయ చరిత్రన్
సత్తగు మర్యాదరామసచివచరిత్రన్
చిత్తరపు గృతులు చేసిన
యుత్తమ కవులెల్ల మీ కులోద్భవులగుటన్ (33వ పద్యం)

దీనినిబట్టి కృష్ణయకవి పూర్వులు గాంగేయోపాఖ్యానం, సుమంతోదయం, ఆంధ్ర కర్ణామృతం, వజ్రభుజోపాఖ్యానం, సేతుమాహాత్మ్యం, దత్తాత్రేయ చరిత్రం, మర్యాద రామన్న చరిత్రం అనే గ్రంథాలను రచించినట్లుగా తెలుస్తుంది. వీటిలో ఒక్క ఆంధ్ర కర్ణామృతం తప్ప తక్కిన కావ్యాలు లభ్యం కాలేదు. గాంగేయోపాఖ్యానంలో భీష్ముని చరిత్ర వర్ణితమై ఉంటుంది. ఈ గ్రంథాన్ని రచించిన వెలగపూడి వంశీయుడైన కవి పేరు తెలియరాదు.

### గిరిజాకల్యాణము

పింగళి సూరన ఈ కృతికర్త. లాక్షణికుల పుణ్యమా అని ఈ కావ్యం లోని నాలుగు పద్యాలు లభ్యమౌతున్నాయి. (చూ:- అలబ్ధకావ్యపద్యముక్తావళి; పు. 66 - 67.) సూరన తాను లలాటేక్షణభక్తి శీలుడనని చెప్పుకోవడడంవల్ల శివభక్తిని ప్రకటించుకోవడానికి ఈ కావ్యాన్ని రాసి ఉంటాడని ఆరుద్రగారు చెపుతున్నారు.

### గిరిజాధినాయకశతకము

చక్రపాణి రంగనాథుడు రచించిన వృత్తశతకం. కొన్ని పద్యాలు మాత్రమే లభ్యమైనాయి. (శ.క.చ. 729.)

### గిరిజాపరిణయము

ఈ కావ్యాన్ని రచించిన కవి పేరు తెలియదు. ఇందులోని రెండు పద్యాలు ప్రబంధ సారశిరోమణిలో సంకలనం చేయబడ్డాయి. పుష్పమాలికల వర్ణనం వీటిలోని వస్తువు. పింగళి సూరన గిరిజా కల్యాణమూ, ఈ గిరిజా పరిణయమూ వేరువేరు కావ్యాలో చెప్పలేము. (పుట. 24-25.)

### గుణాలంకారమణిమాలిక

వడకండ్ల గురురాజకవి ఈ కృతిని రచించినట్లుగా అతని శేషధర్మము లనే గ్రంథంవల్ల తెలుస్తుంది.

### గోకర్ణచ్ఛందస్సు

అప్పకవి తన అప్పకవీయంలో ఈ ఛందోగ్రంథాన్ని స్మరించినాడు. కస్తూరి రంగకవి, గౌరన, అప్పకవి గోకర్ణచ్ఛందస్సులోని కొన్ని పద్యాలను తమ గ్రంథాల్లో ఉదాహరించినారు. వర్ధమాన పురాధీశ్వరుడైన గోకర్ణుడు (1127) ఈ కృతికి స్వీకర్త అని పండితుల అభిప్రాయం. ఐతే కృతికర్త ఎవ్వరో?

### గోదావరీశతకము

ప్రెగ్గడవల్లి పోతయ్య ఈ శతకకర్త అనీ, 1466 ప్రాంతంలో ఉండిన వాడనీ వంగూరి సుబ్బారావుగారు తెలుపుతున్నారు. (శతక కవుల చరిత్ర - 738 పుట.) సుబ్బారావుగారి శతకకవుల చరిత్ర వల్ల ఈ శతకంలోని రెండు పద్యాలు తెలియవస్తున్నాయి. (పుట 738, పీఠిక.)

### గోపికాంశుకాపహారము

ప్రయాగ వేంకటాద్రికవిచే రచింపబడిన ద్విపద కావ్యం. ప్రయాగ కామేశ్వరకవి రచించిన గోపాల లీలా సుధాలహరి ఈ ద్విపదకావ్యానికి పద్యాను కృతియని గోపాలలీలాసుధాలహరి (అముద్రితం) అవతారికలోని కింది వాక్యం వల్ల తెలుస్తుంది.

'ప్రయాగ వేంకటాద్రీంద్రకృత గోపికాంశుకాపహార మనెడి ద్విపద కావ్యమేను పద్యకావ్యం బలన్పకల్పవలెఁజేయఁదలచి.'

**గోపికాగీతలు**

సంస్కృత భాగవతంలోని గోపికాగీతలకిది తెలుగు ద్విపదానువాదం. విజయ రాఘవ నాయకుడీ కృతికర్త. ఈ కృతి ప్రసక్తి అతని ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో కనిపిస్తుంది.

**గోపికానాటకము**

తరిగొండ వెంగమాంబ తన ద్విపద భాగవతావతారికలో తానీ యక్షగానాన్ని రచించినట్లుగా పేర్కొన్నది.

"కరమొప్ప నల 'గోపికానాటకంబు'
విరచించి భక్తితో"

**గోవర్ధనోద్ధరణము**

విజయరాఘవనాయకుడు ఈ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాదచరిత్ర నాటకం అవతారికవల్ల తెలుస్తుంది.

**గౌరీకల్యాణము**

కొట్టియ శంకరేశ్వర శతకాన్ని రచించిన కస్తూరి భట్టరాజు గౌరీ కల్యాణమనే కావ్యాన్ని కూడా రచించినట్లుగా నిడుదవోలువారు పేర్కొన్నారు. (చూ:- వ. మ. మం. 2 భా. 26 పు.) ఇందులోని ఒకే ఒక పద్యం లభ్యమౌతుంది. మానవల్లికవిగారు తమ కుమారసంభవప్రథమభాగం అనుబంధంలో దీనిని ఉదాహరించినారు.

**గౌరీపరిణయము**

సుభాషిత రత్నావళి కర్త ఏనుగు లక్ష్మణ కవికి అగ్రజుడైన ఏనుగు అనంతార్యుడు (క్రీ శ. 1700) ఈ కావ్యకర్త యని సుభాషిత రత్నావళి పీఠిక లోని కిందిపద్యంవల్ల తెలుస్తుంది.

"గౌరీపరిణయకావ్యము"
సూరీంద్రులు మెచ్చజెప్పి శుంభత్కవితా
పారీణ బిరుద మందిన
భూరి యశోఘనుడనంతబుధవరుడందున్.

గౌరీ వివాహము

వెణుతురుపల్లి విశ్వనాథ కవి ఈ ద్విపద కావ్యకర్త. ఈతని తండ్రియైన వేంకటామాత్యునికి వచ్చిన దిట్టకవి అనే బిరుదం వంశనామంగా మారి, ఈతనికి దిట్టకవి విశ్వనాథకవి అనే వ్యవహారం ఏర్పడింది. ఈతడు తన శేషధర్మము లనే గ్రంథంలో తాను రచించిన గ్రంథాలనన్నింటినీ వత్సరాయ తిమ్మ భూపాలుని ముఖంగా ఈ విధంగా పేర్కొన్నాడు.

సృజియించినాడవు శ్రీరామ విజయంబు యక్షగానంబు చిన్నపుడె రూఢిఁ
గల్పించినాడవు కవిజనశ్రవణ సౌఖ్యమున గౌరీ వివాహంబు ద్విపద
రచియించినాడవు ప్రచురచాతురి నిరోష్ఠ్య ప్రబంధము హరిశ్చంద్ర చరితఁ
గావించినాడవు దేవభాషను పారిజాతాపహరణంబు శాశ్వతముగ

అన్నిటను నీవ నేర్పరి వార్యవర్య
వర్ణనీయకవిత్వతత్వంబునందు
నిందుకోటీరచరణారవింద వంద
న ప్రభావనిధీ! విశ్వనాథసుకవి!

దీనిని బట్టి ఈతడు గౌరీ వివాహంతోపాటు శ్రీరామ విజయం, హరిశ్చంద్ర చరిత్ర (నిరోష్ఠ్య ప్రబంధం), పారిజాతాపహరణం అనే గ్రంథాలు కూడా రచించినట్లు తెలుస్తుంది. ఈయన గ్రంథాల్లో శేషధర్మములలోని అవ తారిక తప్ప తక్కినవి లభ్యం కాలేదు. వీటిలో పారిజాతావహరణం సంస్కృత కావ్యం. తక్కినవన్నీ తెలుగుకృతులే.

గౌళికాశాస్త్రము

వెలగపూడి కృష్ణయామాత్యుని భానుమద్విజయావతారికలోని కింది పద్యం వల్ల ఈతడు గౌళికాశాస్త్రాన్ని రచించినట్లుగా తెలుస్తుంది.

మహిలోన మాలినీమాధవీయమనంగ శృంగార కావ్య మెసంగజేసి
గౌళికాశాస్త్రంబు కడులోక హితముగా నెనయ నేకాశ్వాసమున రచించి
పరిఢవిల్లఁగఁ గందపద్యపు శతకంబు నాల్గుయోగంబుల ననువుపఱచి
మీఱిన వేదాంతసారసంగ్రహశాస్త్ర మమరంగ వచన కావ్యంబొనర్చి

చాటుకృతులను మఱికొన్ని సంఘటించి
మామకాంకిత మొనరించి మంచి పుణ్య
శాలియనఁ గీర్తిగైకొన్న సత్కవీంద్ర
మధురవాక్సాంద్ర! కృష్ణయామాత్యచంద్ర!

గౌళికా శాస్త్రమంటే బల్లి పలుకు శాస్త్రం. ప్రస్తుతం లభ్యమౌతున్న బల్లి పలుకు శాస్త్రం కృష్ణయామాత్యునిదో కాదో తెలియదు. పై పద్యంవల్ల ఈతడు మాలినీమాధవీయం, కంద శతకం, వేదాంతసార సంగ్రహం, చాటు కృతులు రచించినట్లుగా తెలుస్తున్నా అవన్నీ అలబ్ధాలే.

**చంద్రతారావళి**

రావిపాటి త్రిపురాంతకుని రచన. ఇందులోని నాలుగు పద్యాలను జగ్గన ప్రబంధ రత్నాకరంలో పేర్కొన్నాడు. (చూ :- ప్రబంధరత్నావళి; 39-40 పు.) చంద్రా రోహిణీవల్లభా అనేది ఇందులోని మకుటం. చూ: తారావళి.

**చంద్రభానుచరిత్రము**

ఈ కావ్యాన్ని రాయసము మల్లసూరి రచించినట్లుగా బోయినిపల్లి కుమార వెంకటరాయల ద్రౌపదీ కల్యాణం అవతారికాపద్యం వల్ల తెలుస్తుంది.

మీ తాత తాతకు భ్రాతృజసూతిగ
దా రాయసము మల్లసూరి "చంద్ర
భానుచరిత్ర" మొప్పగ జెప్పె. (47 వ పద్యం)

ఈ కావ్యాన్ని గూర్చి ఆచార్య బి. రామరాజుగారు 'చరిత్రకెక్కని చరితార్థులు'లో వివరంగా తెలిపినారు. (పుట 26-32)

**చంద్రశేఖరచరిత్ర**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. రత్నాకరం గోపాలరాజు రచించిన సకల లక్షణసార సంగ్రహమనే ఛందో గ్రంథంలో ఈ కావ్యంలోని పద్యం ఉదాహరించబడింది. సకల లక్షణ సారసంగ్రహ ప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయంలో ఉంది.

**చంద్రాంగదోపాఖ్యానము**

చింతలపల్లి సంజీవకవి (17 శ.) ఈ కృతికర్త. ఈతడు బోరవెల్లి సంస్థానాస్థాన కవీ, రాఘవాభ్యుదయ ప్రబంధ కర్తా ఐన చింతలపల్లి ఛాయాపతికి పిన తండ్రియైన అప్పకవి కొడుకు. సంజీవ కవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీ విలాసంలోని అవతారికా పద్యం (1.54) వల్ల తెలుస్తుంది. సంజీవ కవి మహా చాటువచః ప్రావీణ్యం కలవాడని ఛాయాపతి రాఘవాభ్యుదయంలో పేర్కొనబడింది. (1.108)

**చంద్రాభరణశతకము**

'చంద్రాభరణా' అనే మకుటంతో రచింపబడ్డ ఈ శతకం చక్రపాణి రంగనాథ కృతమని నిడుదవోలువారు అభిప్రాయపడ్డారు. సిద్ధనంజేశుడు రంగనాథ కృతంగా పేర్కొన్న నూరు కందాలు చంద్రాభరణ శతకానికి చెందినవే కావచ్చు. ఈ శతకంలోని రెండు పద్యాలను నిడుదవోలువారు 'లక్షణ గ్రంథములు - వాఙ్మయ పరిశోధన' అన్న వ్యాసంలో పేర్కొన్నారు. (చూ: ఆంధ్రపత్రిక - ఉగాది సంచిక 1954 - 55.)

**చక్రలాంఛనవిధి**

మరింగంటి సింగరాచార్యులు ఈ కృతిని తన పదోయేట రచించినట్లుగా అతని సీతాకల్యాణంలోని అవతారికాపద్యంవల్ల తెలుస్తుంది.

పదియేండ్లనాడును బహుచమత్కృతులచే
'చక్రలాంఛనవిధి' చెప్పినాపు (1.16).

ఈ కృతిని సింగరాచార్యులు "బహుచమత్కృతులచే" చెప్పినాడట.

**చాటుకథాచమత్కృతులు**

నెల్లూరి వీరరాఘవకవి రచించిన కృతి. ఇందులో మొత్తం యాభై కథలున్నాయట (ద.దే.వా. 258).

**చక్రవాళమంజరి**

తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని రచన.

**చతుర్భుజాభిషేకము**

వసుచరిత్ర వ్యాఖ్యాతయైన వేములవాడ సోమనాథకవి (1650) తన 'విద్వన్మనోరంజని' వ్యాఖ్యలో తానీ ప్రబంధాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.

పాండుశివాంఘ్రి పద్మములు సమ్మతి మ్రొక్కి 'చతుర్భుజాభిషే
కం'బను సత్ప్రబంధము జగద్వితంబుగ జెప్పితిన్ మురా
రిం జనగొల్చి యా ధ్రువచరిత్ర రచించితి నీ ప్రబంధముల్
పాండుమురారి హృద్యబహుశార్థచమత్కృతిశబ్దచిత్రముల్

పేశల గంభీర పదా
వేశమనోహరముగాగ వెలసె మరుత్సం
దేశము ముద్రాలాభం
బీశార్పణ బుద్ధిచే మదంతమగుచున్.

**చతుర్విధకందశతకము**

భానుద్విజయకర్త వెలగపూడి కృష్ణయామాత్యునిచే కందపద్యాలలో రచింపబడిన యోగశాస్త్రగ్రంథం. యోగశాస్త్రశతకమని దీనికి నామాంతరం. చూ. మాలినీమాధవీయం.

**చమత్కార రామాయణము**

ఈ రామాణ కర్త ఎవ్వరో తెలియదు. అప్పకవీయంలోనూ, (3-163, 239) ఛందో గ్రంథంలోనూ (R 2322, తిరుపతి) ఈ రామాయణ పద్యాలు రెండు ఉదాహరింపబడ్డాయి. (చూ. అలబ్దకావ్య పద్యముక్తావళి 72 పు)

**చాటుకథాచమత్కృతులు**

నెల్లూరి వీరరాఘవకవి రచించిన కృతి. ఇందులో మొత్తం యాభై కథలున్నాయట. (ద. దే. వా. 258 )

**చాటుపద్యసహస్రము**

వడకండ్ల గురురాజకవి ఈ కృతి రచించినట్లుగా అతని శేషధర్మములలో పేర్కొబడింది. దీని పేరును బట్టి ఇది గురురాజకవి చెప్పిన వేయి చాటు పద్యాల సంపుటి అని ఊహించవచ్చు.

**చాముండికావిలాసము**

చౌడేశ్వరీవిలాసమని దీనికి నామాంతరం ఉంది. ఈ కృతి కర్త నన్నయభట్టని ప్రతీతి.

**చారుదేష్ణచరిత్రము**

ఈ కావ్య కర్త పేరు తెలియదు. ఇందులో సుదేష్ణ చరిత్ర వర్ణ్యాంశం కావచ్చు. అప్పకవీయం, సుకవి మనోరంజనం, వీరభూపాలీయాలతో ఈ కావ్యంలోని రెండు పద్యాలు లభ్యమైనాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి. 77 పు.)

**చిత్రశేషభాగవతము**

ఈ భాగవతకర్త ఎవరో తెలియదు. ఆంధ్ర కౌముదిలో ఈ కావ్యంలోని ఒక పద్యం ఉదాహరింపబడింది. (చూ. అలబ్ధకావ్యపద్య ముక్తావళి - 78 పు.) ఇందులోనే శేషభాగవతం లోనిదిగా మరో పద్యం కనిపిస్తుంది. ఈ రెండు భాగవతాలూ ఒక్కటేనో, వేర్వేరో చెప్పలేము.

**చిత్రాంగదాపరిణయము**

రాజవోలు సుబ్బరాయకవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా అతని జయ విజయాభ్యుదయం అనే కావ్యం అవతారిక వల్ల తెలుస్తుంది (చూ. గరుడాంజ నేయసంవాదం)

**చెంగమలవల్లీపరిణయము**

విజయ రాఘవ నాయకుడీ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాద చరిత్ర అవతారిక తెలుపుతుంది. మధురోక్తి పూరితంగా దీనిని రచించినాడట.

**చెన్నబసవపురాణము**

గోవతి లింగకవి రచించిన చెన్నబసవ పురాణమనే చంపూ ప్రబంధం (అముద్రితం) లోని కింది పద్యం వల్ల ఈ ద్విపదకావ్యం పామనాథునిచే రచింపబడినట్లుగా తెలియవస్తుంది.

ప్రసరించె పామనాథుడు
బసవాదుల మహిమ చెన్నబసవపురాణం
బెసలార ద్విపద కావ్యము
వసుమతి రచియించె భక్తవరులు నుతింవన్

ఇది అముద్రితం. (చూ : చరిత్రకెక్కని చరితార్థులు, పుట. 102).

**చౌడేశ్వరీవిలాసము**

చూ : చాముండీవిలాసము.

**చొక్కవజీరుశతకము**

దీని కర్త తెలియదు. దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు సంకలనం చేసిన చాటుపద్య రత్నాకరంవల్ల ఇందులోని ఏడు పద్యాలు లభ్యమౌతున్నాయి.

**ఛందస్సారసంగ్రహము**

లక్షణ శిరోమణిలో ఈ గ్రంథం సారసంగ్రహమని పేర్కొబడింది. (4.263), రావూరి దొరసామిశర్మగారు ఛందస్సుకు సంబంధించిన గ్రంథం

కనుక దీని పేరు ఛందస్సార సంగ్రహం కావచ్చునని ఊహించినారు. (లక్షణ శిరోమణి 4.263 అధోజ్ఞాపిక.) లక్షణ శిరోమణిలో ఇందులో నుండి కొన్ని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. (4.263, 267, 272.) ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు.

**జయదేవచ్ఛందము**

కవిజనాశ్రయంలోని ఈ కింది పద్యం వల్ల జయదేవచ్ఛందాన్ని గురించి తెలుస్తుంది.

జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుడీ ఛందంబు జెప్పె జనులకు దెలియన్.

కస్తూరి రంగకవి కూడా తన ఆనందరంగరాట్ఛందంలో జయదేవచ్ఛందంలోనిదని ఒక లక్షణపద్యాన్ని ఉదాహరించినాడు.

చాగంటి శేషయ్యగారు జయదేవుణ్ణి పదమూడో శతాబ్దికి చెందినట్లుగాను, బులుసువారు 1100 ప్రాంతానికి పూర్వునిగాను పేర్కొన్నారు.

**జలపాలిమాహాత్మ్యము**

ఏలూరులో ఉన్న జలపాలీశ్వరుని మాహాత్మ్యాన్ని వర్ణించే స్థలపురాణం. ఘటసాని మల్లుభట్టు ఈ కృతికర్త. పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరంలో ఇందులోని ఆరు పద్యాలు సేకరింపబడినాయి.

**జాంబవతీకల్యాణము**

మంచ లక్ష్మీనృసింహకవి రచించిన ఆంధ్ర కౌముది అనే వ్యాకరణ గ్రంథంలో 'కళాధర కృతే జాంబవతీకల్యాణే ద్విపద ప్రబంధే' అని జాంబవతీ కల్యాణంలోని ఒక ద్విపద ఉదాహరింపబడింది. దీనినిబట్టి ఇది ద్విపద ప్రబంధమనీ, కళాధరుడు ఈ కృతి కర్త అనీ తెలుస్తుంది. (చూ. అలబ్ధకావ్య పద్యముక్తావళి, 79 పుట).

**జాంబవతీవిలాసము**

ఇది గణపవరపు వేంకట కవి (17 శ.) చే రచింపబడిన చిత్రకావ్యం. వేంకటకవి ఈ కృతిని రచించినట్లుగా తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం అవతారికలో చెప్పుకున్నాడు.

నవనవముగను జాంబవతీవిలాసమన్
చిత్రకావ్యము విరచింప వశమె (1.51)

**జానకీకల్యాణము**

విజయరాఘవనాయకుడీ యక్షగాన కర్త. ఈతని ప్రహ్లాద నాటకంలో దీని ప్రసక్తి కానవస్తుంది. రఘునాథుడు కూడా జానకీ కల్యాణమనే పేర ఒక యక్షగానాన్ని రచించినట్లు తెలుస్తుంది. ఈ రెండూ ప్రస్తుతం అలభ్యాలే.

**జానకీకల్యాణము**

రఘునాథుడు రచించిన యక్షగానం.

**జానకీపరిణయము**

చేకుమళ్ళ రంగశాయి (17 శ.) తానీ కృతిని రచించినట్లుగా అతని వాణీవిలాస వనమాలికా గ్రంథంలోనూ, రాఘవ శతకంలోనూ చెప్పుకున్నాడు. ఈ యక్షగానం తత్వ ప్రతిపాదకంగా రచించబడినట్లు తెలుస్తుందని జోగా రావుగారు తెలుపుతున్నారు. (య.వా.చ. 17పు.) వాణీవిలాసవనమాలిక అవతారికలో ఈతడు తిరువళ్ళూరు వీర రాఘవ శతకం, కృష్ణదండకం, భాగవతం (ద్విపద) అనే గ్రంథాలను కూడా రచించినట్లు పేర్కొనబడింది. ఈయన కృతుల్లో వాణీవిలాస వనమాలిక, ద్విపద భాగవతం తప్ప తక్కిన కృతులు లభ్యం కాలేదు.

**జినేంద్రపురాణము**

కన్నడంలో ఆదికవియైన పంప మహాకవి (10 శ.) యే ఈ కృతికర్త యని విమర్శకుల అభిప్రాయం. ఇందులోని ఒకే ఒక పద్యం 'ఉదాహరణ పద్యము'లన్న సంకలన గ్రంథంలో సేకరించబడి ఉంది. (చూ. ప్రబంధ రత్నావళి, 42 పు.) ఈ పద్యం మందర పర్వతాన్ని వర్ణించేది. ఈ పద్యం శ్లేషగర్భితంగా ఉంది.

**జైమినిరామాయణము**

'ఆంధ్ర కౌముది' అనే వ్యాకరణం వల్ల ఈ రామాయణం గురించి తెలుస్తుంది. ఉండె, ఒప్పె మొదలైన పదాలు వకారాది పదాలనీ, అవి పర పదాలుగా ఉన్నప్పుడు సంధిలో వాటి వకారం లోపిస్తుందనీ, పద్యాదిలో మాత్రం ఉష్మోచ్చ పరమందున్న వకారం లోపించదనీ వివరించే సందర్భంలో ఈ రామాయణంలోని ఒక పద్యం ఉదాహరించబడింది. (చూ. అలబ్ధకావ్య పద్య ముక్తావళి, 80 పుట.)

**తత్త్వచంద్రోదయము**

ద్విపదలో రచింపబడిన వేదాంత గ్రంథం. రచయిత ముమ్మడి మల్లనార్యుడు (1650). ఈతడు తన శ్రీరామస్తవరాజమనే పద్య కావ్యంలో తానీ ద్విపద గ్రంథాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.

"ఏను బాల్యంబున సకల వేదాంతసిద్ధాంత సారసంగ్రహంబైన తత్త్వార్థంబుల తత్త్వ చంద్రోదయంబను ద్విపద కావ్యంబు రచియించి యాతత్త్వ చంద్రోదయంబునకు జానకీనాథు నాథుగా నియోగించి సంతసిల్లితి" (అవతారిక)

**తారకబ్రహ్మరామశతకము**

మరిగంటి సింగరాచార్యులు ఈ శతకకర్త.

**తారావళి**

చూ: చంద్రతారావళి.

**తారావళులు**

గణపవరపు వేంకటకవి తన పన్నెండవ ఏట తారావళులు చెప్పినట్లుగా అతని ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం అవతారిక వల్ల తెలుస్తుంది. (26 పద్యం.)

**తిరువళ్లూరు వీరరాఘవశతకము**

టేకుమళ్ళ రంగశాయి (17 శ.) తానీ శతకాన్ని రచించినట్లుగా తన వాణీ విలాస వనమాలిక ప్రబంధం అవతారికలో పేర్కొన్నాడు. (చూ: జానకీ పరిణయము.)

**తుల్యానదీమాహాత్మ్యము**

సుభాషిత త్రిశతిని అనువదించిన ఏనుగు (చిన) లక్ష్మణ కవి తాత ఏనుగు లక్ష్మణకవి ఈ కృతిని రచించినట్లుగా మనుమడు లక్ష్మణకవి రచించిన జాహ్నవీ మాహాత్మ్యం అవతారిక వల్ల తెలుస్తుంది.

'రాజశేఖర చరిత్రము' రసోదంచితముగా
　　నిర్మించె నే ప్రౌఢ నేర్పు మెఱయ
'మహిమఁ దుల్యానదీ మాహాత్మ్య'మే పెద్ద
　　రచియించె నర్థగౌరవము గులుక

వటుచమత్కార గుంభనమొప్ప 'ద్రౌపదీ
పరిణయ'ంబే జాణ ప్రౌఢి గూర్చె
'ధ్రువ చరిత్రము' మహా కవిపుంగవులు మెచ్చఁ
గల్పించె నేకవి కౌశలమున
నతని నతులితకవితా కృతాభిషేక
మత్పితామహు గురుపితామహ సమాన
మాననీయ వచశ్శాలి మహితశీలి
లక్ష్మణామాత్యమౌళిఁ దలంతు మదిని.

ఈ కృతి వత్సవాయ కస్తూరి రంగరాజు కుమారుడైన జగన్నాథరాజుకు అంకితమైనట్లుగా లక్ష్మణకవి (మనుమడు) రామవిలాసంలో చెప్పబడింది.

ఈ కావ్యంలోనివని పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శన కర్త లుదాహరించిన పద్యములను ఐదింటిని చాగంటివారు ఆంధ్రకవి తరంగిణిలో ఉదాహరించినారు. (12-168, 169.)

తెలుగువ్యాకరణపద్యములు

మరింగంటి కవులలో నొకరైన కోనేటిదేశికులు ఈ కృతి కర్త. ఆంధ్ర వాఙ్మయ సూచికలోని ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తక భాండాగారం అముద్రిత గ్రంథాల పట్టికలో ఈ గ్రంథం పేర్కొఁబడింది. కాని గ్రంథాలయంలో నేడిది కానరాదు.

త్రిపురవిజయము

పోతరాజు వీరయ్య కవి ఈ కృతిని రచించినట్లుగా ఉదాహరణ పద్యము లన్న సంకలన గ్రంథంవల్ల తెలుస్తుంది. ఈ కావ్యంలోని నాలుగు సీస పద్యాలు ఉదాహరణ పద్యములలో సంకలితమైనాయి (చూ. ప్రబంధ రత్నావళి, 96-97 పుటలు.)

త్రిపురవిజయము

పెదపాటి సోమయ రచించిన ఈ కావ్యంలోని ఒక పద్యం ఉదాహరణ పద్యములు అన్న సంకలన గ్రంథంలో సేకరించబడి ఉంది. (చూ. ప్రబంధ రత్నావళి - 109 పు.)

**త్రిపురసంహార మకుటము**

పాలవర్తి సోమేశ్వరుడీ కృతి కర్త. త్రిపుర సంహారాన్ని వర్ణించే ఒక పద్యం పెదపాటి జగ్గన ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడినట్లుగా ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యంలో పేర్కొబడింది. (9 సం.) ప్రబంధ రత్నాకరంలోని పద్యాలు సేకరింపబడ్డ ప్రబంధరత్నాకరంలో పాలవర్తి సోమేశ్వరునివిగా రెండు పద్యాలు ఉదాహరింపబడ్డాయి. కాని ఆ పద్యాలు త్రిపురసంహారమకుటంలోనివిగా పేర్కొలేదు.

**త్రిపురారాతివిజయము**

వల్లూరి హనుమంత కవి రచించిన ద్విపద కృతి. ఈ కృతి నాగ్నజిత్తీ పరిణయ కావ్యావతారికలో పేర్కొనబడింది. (చూ:- సీతావిజయము).

**త్రిపురారిదండకము**

నెల్లూరి వీరరాఘవకవి ఈ దండక కృతిని రచించినట్లుగా అతని వసుంధరాపరిణయంలో పేర్కొబడింది. (చూ:- కృష్ణటుజంగము.)

**త్రిలోకసంజీవని**

చిత్రకవి అనంతయ్య కుమారుడు చిత్రకవి వెంకటరమణకవి ఈ కృతి కర్త. ఇది లక్షణ గ్రంథం కావచ్చు. ఈ కృతిని వెంకటరమణకవి రచించి నట్లుగా అతని సాంబవిలాసంలోని ఆశ్వాసాంతగద్యవల్ల తెలుస్తుంది.

**త్రిశంకవోపాఖ్యానము**

ఈ కావ్యంలోని ఒకే ఒక పద్యం అ.క.లోనూ, సు.మ.రం.లోనూ కనిపిస్తుంది. ఈ కావ్యకర్త కవి సింగరన్న అని సు.మ.రం.లో పేర్కొబడింది. (చూ:- అలబ్ధకావ్యపద్యముక్తావళి, 73 పు.)

**దక్షాధ్వరము**

ఇది పండితారాధ్యుని రచనగా పాల్కురికి సోమనాథుని పండితా చరిత్రవల్ల తెలుస్తుంది. (వాదప్రకరణం).

**దక్షిణద్వారకాస్థలవర్ణనము**

విజయ రాఘవ నాయకుడు రచించిన ఇరవై మూడు యక్షగా ఒకటి. ఈతని ప్రహ్లాద చరిత్ర యక్షగానం అవతారికలో దీని ప్రస

**దత్తాత్రేయచరిత్రము**

భానుమద్విజయ కావ్యకర్తయైన వెలగపూడి కృష్ణయ వంశీయునిచే రచింపబడ్డ కావ్యం. ఈ కావ్యకర్త పేరు తెలియదు. (చూ. గాంగేయోపాఖ్యానము)

**దశగతులు**

భాస్కర రామాయణాన్ని రచించిన కవుల్లో ఒకరైన హుళక్కి భాస్కరుడు (14 శ.) ఈ కృతిని రచించినట్లుగా ఒకానొక ఛందోగ్రంథంవల్ల తెలుస్తుంది. (చూః డి. 705, అం. వి. 44 ఎ పుట.) ఈ ఛందోగ్రంథంలో దశగతులలోని ఒక పద్యం ఉదాహరింపబడింది. దీనిలో సాహిణి మారని సంబోధనం ఉన్నది. (చూః అలబ్ధకావ్యపద్య ముక్తావళి - 74 పు.) ఇది అతనికే అంకితం కావచ్చు.

ఇది సంస్కృతంలోని దశగతులనే గ్రంథానికి అనువాదమని మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారి అభిప్రాయం (భాస్కరరామాయణ పీఠిక).

**దశరథకుమారచరిత్ర**

ఈ కృతికర్త యెవ్వరో తెలియదు. రత్నాకరం గోపాలరాజు రచించిన 'సకల లక్షణసార సంగ్రహం' అనే ఛందోగ్రంథంలో ఈ కావ్య పద్యాలు కొన్ని ఉదాహరింపబడ్డాయి. కనుక ఈ కావ్యకర్త క్రి. శే. 1670 కి పూర్వుడని భావించవచ్చు. లక్షణసార సంగ్రహం ప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉంది. నెం. 3471 ఇది అముద్రితం )

**దాక్షాయణీపరిణయము**

పోతన మహాకవికి ప్రపౌత్రులైన కేసన, మల్లన కవులు ఈ ప్రబంధాన్ని రచించి గురజాల మల్లన సోమయాజికి అంకితం చేసినట్లుగా తెలుస్తుంది. ఈ కృతి తాళప్రతి ఒకటి తమ దగ్గర ఉన్నదని తెలుపుతూ వీరేశలింగం పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రలో ఈ కావ్యంలోని కొన్ని పద్యాలను ఉదాహరించినారు. కాని ప్రస్తుతం మనకీ కావ్యం అలభ్యం. చారిత్రిక ప్రాధాన్యం ఉన్న కావ్యమట.

**దిలీపచరిత్రము**

కొటికెలపూడి వేంకటకృష్ణ కవి (18 శ.) ఈ కావ్యకర్త అని అతని శ్వేతాచలమాహాత్మ్యంవల్ల బట్టి తెలుస్తుంది.

**దీపకళిక**

మల్లికార్జున పండితారాధ్యుడు ఈ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో పేర్కొన్నాడు.

**దేవమల్లుచరిత్ర**

శృంగారకవి తిరుమలనాథ కవి (18 శ.) తన ద్విపద నాసికేతపురాణం లోని 'లలితోక్తి దేవమల్లు చరిత్ర మాకు, తొలుత రచించి కీర్తులు దెచ్చినావు' అనే అవతారిక వాక్యంలో తాను దేవమల్లు చరిత్రను రచించినట్లుగా కృతిపతిచే చెప్పించినాడు. ఈతడు పరమ భాగవత చరిత్ర, పరమార్థ దీపిక, పద్మినీ పరిణయం, నాసికేతూపాఖ్యానం అనే కృతులను కూడా రచించినట్లుగా అతని నాసికేతూపాఖ్యానంలోని కింది ద్విపదలు తెలుపుతున్నాయి.

కరమొప్ప పరమభాగవతచరిత్ర
పరమార్థదీపిక, పద్మినీపరిణ
యము మొదలైన కావ్యములు రచించి"

పై ద్విపదల్లో పేర్కొన్న కృతులే కాక తిరుమలనాథకవి మరి కొన్నిటిని కూడా రచించినట్లు తెలుస్తున్నా, వాటి వివరాలు తెలియవు.

నుదురుపాటి వెంకన్న రచించిన మరొక దేవమల్లు పురాణం కూడా ఉంది. ఇందులో వజ్రదంతుడనే రాక్షసుడు స్వర్గాన్ని జయించడానికి ఈశ్వరుని గూర్చి తపస్సు చేసి వరాలు సంపాదించి మదించి ఉండగా దేవమల్లుడనేవాడు యుద్ధంలో ఓడించడం, ఆ మల్లుని వంశం ఇందులో వర్ణింపబడ్డాయి. తిరుమలనాథకవి దేవమల్లుపురాణంలో కూడా వర్ణితమైన వస్తువు ఇదే కావచ్చు.

**దేవీవిజయము**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒకే ఒక పద్యం అప్పకవీయ, సుకవి మనోరంజనాల వల్ల తెలియవస్తుంది. (చూ. అలబ్ధకావ్య పద్య ముక్తావళి, 75 పు.)

**దేవేంద్రవిజయము**

మైరావణ చరిత్ర కర్తయైన మాదయకవి ఈ ద్విపద కావ్యాన్ని రచించి ఎఱ్ఱన మంత్రికి అంకితం చేసినట్లుగా, కవిసప్తశతి తెలుపుతుంది. మాదయకవి 15 శతాబ్ది చివరి భాగానికి, 16 శతాబ్ది పూర్వభాగానికి చెంది ఉంటాడు.

ద్రౌపదీ పరిణయము (ద్రౌపదీ స్వయంవరము)

సుభాషిత రత్నావళి రచయిత ఏనుగు లక్ష్మణకవి తాత ఏనుగు లచ్చ కవి ఈ కృతికర్త. అతడు రచించిన కృతులను మనుమడైన లక్ష్మణకవి తన జాహ్నవీ మాహాత్మ్యంలో పేర్కొన్నాడు. దానిని బట్టి ఈతడు రాజశేఖర చరిత్రం, తుల్యానదీ మాహాత్మ్యం, ద్రౌపదీ పరిణయం, ధ్రువచరిత్రం, భీమసేన విజయం అనే కృతులను రచించినట్లు తెలుస్తుంది. వీటిలో భీమసేన విజయప్రతిని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తాము చూచి నట్లుగా చాగంటి శేషయ్యగారు తెలిపినారు. (క.త. 12-170). తక్కినవన్నీ అలభ్యాలే. రాజశేఖర చరిత్రకు భల్లాణరాయ చరిత్రమనే నామాంతరం కావచ్చునని పండితుల అనుమానం. లచ్చకవి ఈ కృతిని తిమ్మ జగపతి భూపాలునికి అంకితమిచ్చినట్లుగా ఏనుగు లక్ష్మణకవి రామవిలాస కావ్యంవల్ల తెలుస్తుంది.

ద్రౌపదీస్వయంవరము

పీరభద్రుడనే కవి ఈ ద్విపద కావ్యాన్ని రచించినట్లుగా ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు 'నన్నయభట్టు వంశపు కవి-గోపాలుని రాయి కవి' అనే వ్యాసంలో తెలిపినారట. (చూ:- ద్విపద వాఙ్మయం 247-248 పు.)

ద్విపద చెన్నబసవపురాణము

గోవతి లింగకవి చెన్నబసవపురాణం పంచమాశ్వాసాం తానికి ముందున్న ఈ కింది పద్యంవల్ల పామనాథుడు రచించిన ఈ ద్విపద చెన్నబసవ పురాణాన్ని గురించి తెలుస్తుంది.

> ప్రసరించె పామనాథుడు
> బసవాదుల మహిమ చెన్నబసవపురాణం
> బెసలార ద్విపద కావ్యము
> వసుమతి రచియించె భక్తవరులు నుతింపన్.

గోవతి లింగకవి చెన్నబసవ పురాణం ప్రతి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి తాళపత్రగ్రంథాల్లో ఉంది. ఆచార్య బి. రామరాజుగారి గోవతి లింగ కవిని గూర్చిన వ్యాసంవల్ల ఈ వివరాలు తెలుస్తున్నాయి. (చూ. చరిత్రకెక్కని చరిత్రకారులు 97 - 104.)

**ద్విపదభాగవతము**

చేకుమళ్ళ రంగశాయి (17 శ) ఈ కృతిని రచించినట్లుగా ఆతని వాణీ విలాస వనమాలికలో పేర్కొనబడింది. ఇందులోని మొదటి నాలుగు స్కంధాలు మాత్రమే లభ్యమౌతున్నాయి. తక్కినవి అలభ్యాలు.

**ద్విపదభాగవతము**

తరిగొండ వెంగమాంబ ద్విపదలో శ్రీ భాగవతాన్ని పన్నెండు స్కంధాలూ రచించినట్లుగా తన శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో స్వయంగా చెప్పుకున్నది.

పలికించుగావున భాగవతపురాణ
మమర నే ద్విపద కావ్యంబుగాను
ద్వాదశ స్కంధముల్ తగ జెప్పి హరికి
సమర్పించి శ్రీ వేంకటాద్రి మహిమ (2 - 22 పద్యం)

కాని ప్రస్తుతం తొలి ఆరు స్కంధాల గ్రంథమే లభిస్తుంది. చివరి ఆరు స్కంధాలు లభ్యం కాలేదు.

**ద్విపదభాగవతము**

ధూర్జటి లింగరాజు ద్విపదలో రచించిన భాగవత ప్రతులు తిరుపతి శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ కోసం ప్రభాకరశాస్త్రిగారు శ్రీకాళహస్తి రాజుగారి ఆస్థానం నుండి సేకరించినట్లుగను, ఇటీవల అవి శిధిలమై క్రమంగా నామావశిష్టాలైనట్లుగను డా॥ కే.జే. కృష్ణమూర్తిగారు తెలుపుతున్నారు. (తరిగొండ వెంగమాంబ కృతులు 214.)

**ద్విపదభారతము**

సీతావిజయం అనే అముద్రితగ్రంథంలోని ఈ కింది అవతారికాభాగం వల్ల లింగకవి (17 శ.) ఈ ద్విపదభారతాన్ని రచించినట్లుగా తెలుస్తుంది.

లింగకవియంద్రు నా పేరు లీల మెరసి
తెనుగునను 'భారతం'బెల్ల ద్విపద జేసి
హరికినంకితమొనరించితధికులైన
కవివరేణ్యులనితడు సత్కవి యనంగ

(ద్విపదవాఙ్మయం, పుట 167, 168)

బట్టేపాటి తిమ్మయ రచించిన ద్విపద భారతం లభ్యమే. కాని లింగ కవి రచించిన భారతం లభ్యం కాదు.

**ద్విపద హరివంశము (ఆంధ్ర హరివంశము)**

తాళ్ళపాక పెదతిరుమలయ్య ద్విపద హరి వంశాన్ని రచించినట్లుగా తాళ్ళపాక చిన్నన్న తన అష్టమహిషీకల్యాణావతారికలో పేర్కొన్నాడు.

**ధనంజయవిజయము**

ఇది శ్రీనాథునిచే రచింపబడిన కృతి. శ్రీనాథుడీ గ్రంథాన్ని రచించి నట్లుగా స్వయంగా చెప్పుకోలేదు. దంతులూరి పాపరాజు తన మూర్తిత్రయో పాఖ్యానంలో శ్రీనాథుడీ కావ్యాన్ని రచించినట్లుగాను, అది గన్నభూపాలుని కంకితం కావింపబడినట్లుగాను పేర్కొన్నాడు.

శ్రీనాథ కవీంద్రుచే ధనంజయ విజ
యంబను సత్కావ్యమంది వెలసె
నృపతి మాత్రుండె నిజపాదనీరజాత
ఘటిత కోటీరవైరి భూకాంతమాన
సాంతర భయాపహారి శ్రీ దంతులూరి
గన్న భూపాలమౌళి దోర్గర్వశాలి. (1–60)

హరవిలాసంలో కిరాతార్జునీయ కథ సంగ్రహంగా రచించడంతో సంతృప్తిపడక శ్రీనాథుడు ధనంజయ విజయాన్ని ప్రత్యేక కావ్యంగా రచించి ఆ కథను విపులంగా వర్ణించి యుండవచ్చని పండితులు భావిస్తున్నారు.

**ధనాభిరామము**

విజయ రాఘవ నాయకునిచే రచింపబడిన ఈ యక్షగాన ప్రసక్తి అతని ప్రహ్లాద చరిత్ర అవతారికలో కనిపిస్తుంది.

**ధనాభిరామము**

ఆసూరి మరింగంటి సింగరాచార్యుల (1600) చే రచింపబడిన ద్విపద కావ్యం. ఈతడీ కావ్యాన్ని పదహారో ఏట రచించినట్లుగా తన సీతాకల్యాణం అవతారికలో పేర్కొన్నాడు.

అలఘు ప్రేమాభిరామ, ధనాభిరామ
కావ్యములు జాతి వార్తలు గడలుకొనగ
ద్విపదలుగ జేసితివి కవినుతులెన్న
పూని షోడశవత్సరంబులనె మొదల (18 పద్యం)

**ధర్మద్విపద**

అప్పకవిచే రచింపబడిన కృతి. 'మహిత సాధ్వీజనౌఘ ధర్మ ద్విపదము' అని అప్పకవీయావతారిక పద్యం (85) లో చెప్పడంవల్ల ఇది స్త్రీ ధర్మాలను వివరించే ధర్మగ్రంథంగా భావించవచ్చు. (చూ: అంబికావాదం).

**ధర్మాంగదచరిత్ర**

రేకపల్లి మహాదేవకవి ఈ కృతిని రచించినట్లుగా అతని చిన్ని వెంకటనరసీయమనే అముద్రిత హాస్య నిందా గర్భిత కావ్యావతారికలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది.

రచియించితివి పతివ్రతల మహత్త్వవ
  ర్ణనగల ధర్మాంగద నృప చరిత్ర
ముచ్చరించితివి విద్వచ్చయంబులు మెచ్చ
  రాణించు బసవపురాణమహిమ
కావించితివి చమత్కారానుసారప్ర
  బంధంబులును జాటు పద్య వితతు
లొనరించితివి సమయోచిత వాగ్గుంభ
  సంభృతార్థానూన శతక సమితి

వెంకటనరసీయ కావ్యప్రతి మ. ప్రా. పు. భాం. లో ఉన్నది (చూ. R 9866.) రుక్మవతీ పరిణయాన్ని రచించిన రేకపల్లి సోమనాథ కవికి ఈ మహా దేవకవికి గల సంబంధం స్పష్టంగా తెలియదు.

ఈతడు ధర్మాంగద చరిత్రేకాక బసవపురాణ మహిమను, మరెన్నో చమత్కార ప్రబంధాలను, చాటుపద్యాలను, శతకాలను రచించినట్లుగ పైపద్యం వల్ల తెలుస్తుంది.

**ధ్రువచరిత్ర**

ఈ కావ్యంలోని ఒక సీసపద్య పాదం ఆ.రం.ఛం. లోనూ, (3.365) ఆంధ్ర ర. (256 పు)లోనూ ఉదాహరింపబడింది. ఆ.రం.ఛం. కర్త కావ్యకర్త పేరు పేర్కొనలేదు. ఈ కావ్యకర్త నరసింగన్న అని గణవరపు వేంకటకవి పేర్కొన్నాడు. ఏనుగు లక్ష్మణకవి (సుభాషితానువాద కవి తాత), సోమనాథ కవి ధ్రువచరిత్రలను రచించినట్లుగా తెలుస్తుంది. ఈ మూడు ధ్రువచరిత్రలూ అలభ్యాలే.

ధ్రువచరిత్ర

సుభాషిత రత్నావళిని ఆంధ్రీకరించిన ఏనుగు లక్ష్మణ కవి తాత ఏనుగు లచ్చకవి (లక్ష్మణకవి) ఈ కృతిని రచించినట్లుగా మనుమడు లక్ష్మణ కవి తన జాహ్నవీమాహాత్మ్యంలో పేర్కొన్నాడు.

'ధ్రువ చరిత్రము' మహాకవి పుంగవులు మెచ్చఁ
గల్పించెనే కవి కౌశలమున.

ఈ కృతి పెద్దాపురప్రభువైన జగ్గరాజుకు అంకితం.

ధ్రువచరిత్ర

వసుచరిత్రకు విద్వజ్జనమనోరంజని అనే వ్యాఖ్యను రచించిన వేముల వాడ సోమనాథకవి (17 శ) ఈ కృతి కర్త. తానీ ప్రబంధాన్నే కాక చతుర్భుజాభిషేకం, మరుత్సందేశం, ముద్రాలాభం, గంగా గౌరీ సంవాదం అనే ప్రబంధాలను కూడా రచించినట్లు వసుచరిత్ర వ్యాఖ్యలో చెప్పుకున్నాడు.

నందనందనచరిత్ర

ఇది శ్రీనాథుని రచనగా లక్షణ గ్రంథాల వల్ల తెలుస్తుంది. గణవరపు వెంకటకవి ప్రయోగ రత్నాకరంలోనూ, కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ఛందంలోనూ ఇందులోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. రాధాకృష్ణుల రాసక్రీడలు ఇందులో ప్రధాన వస్తువు. వంట మైలారెడ్డికి ఈ కృతి అంకితం చేయబడింది. శ్రీనాథుడీ కావ్యాన్ని రచించినాడనడం విశ్వాసార్హం కాదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శృంగార శ్రీనాథంలో తెలిపినారు.

నందనచరిత్ర

గంగరాజు చౌడయ్య కవిచే రచింపబడిన కృతి. ఇందులోని పద్యాలు ప్రబంధ రత్నాకరం, ఉదాహరణ పద్యములు అనే సంకలన గ్రంథాల్లో సేకరింపబడినాయి. మొత్తం ఎనిమిది పద్యాలు లభిస్తున్నాయి. (చూ. ప్రబంధ రత్నావళి - 33 పు.)

నళధారుణీచరితము

కెళ్ళ కప్పయ్య ఈ కృతి కర్త. ఈతడు తన తారాశశాంక విజయ కావ్యం అవతారికలో ఈ కావ్యాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు. తారా శశాంక విజయం ప్రతి ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (చూ. అర్ధనారీశ్వరకలాపము, కాల్ నెం. 3.21.)

**నలయాదవరాఘవపాండవీయము**

ఇది చతురర్థి కావ్యం. దీనిని మరింగంటి సింగరాచార్యులు తన పదిహేడో ఏట రచించినట్లుగ అతని సీతాకల్యాణ కావ్యావతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

నలయాదవరఘుపాండవ
సలలితతురీయార్థ కావ్య సంశ్లేషకృతుల్
ఎలమి దశసప్తహాయన
మలవడు కాలంబునందు నతిమదురోక్తుల్ (1 - 18)

**నవగ్రహ స్తవము**

గౌరన ఈ స్తోత్ర గ్రంథకర్త. ఇందులోని రెండు పద్యాలు పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరంలో ఉదాహరింపబడ్డాయి. (చూ. ప్రబంధరత్నావళి 30-31 పు.) 'మాకుఁబ్రసన్నుడయ్యెడున్' అనే మకుటం వీటిలో కన్పిస్తుంది. ఈ కవి క్రీ. శ. 1384 - 1429 ప్రాంతానికి చెందినవాడు.

**నవనాథచరిత్రము**

శ్రీగిరి కవిచే పద్య రూపంలో రచింపబడ్డ కావ్యం. గౌరన రచించిన ద్విపద నవనాథ చరిత్ర అవతారికలోని క్రింది ద్విపదల వల్ల ఈ కావ్యపు ఉనికి తెలుస్తుంది.

అవిరళయోగ విద్యాధికులైన
నవనాథవరుల పుణ్యప్రవర్తనలు
వరగ శ్రీగిరికవి పద్యబంధముల
విరచించినాడది ద్విపద కావ్యమ్ము
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర.

గౌరన ద్విపద నవనాథచరిత్రకు శ్రీగిరికవి పద్య నవనాథచరిత్ర ఆధారమని తెలుస్తుంది. గౌరనకు పూర్వుడు కనుక శ్రీగిరికవి 1300 - 1400 నడిమికాలానికి చెందినట్లుగా భావించవచ్చు.

**నవనీతచోరము**

విజయరాఘవ నాయకుడీ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాద నాటకంలోని 'భువిని రాసక్రీడ నవనీతచోరంబు హవణిలో వెలయు మహానుభావ'

అనే అవతారికాపద్య పాదంవల్ల తెలుస్తుంది. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు ఇందులో మనోహరంగా చిత్రితములై ఉండవచ్చు.

**నవభారతము**

ఈ ప్రబంధాన్ని రచించిన కవి ఎవ్వరో తెలియదు. కాని ఈ కృతిని విజయనగరరాజైన రాచిరాజు అంకితం గ్రహించినట్లుగా శ్రీకృష్ణ విజయ కావ్యంలోని

'నవభారతాఖ్యాన నవ్యకావ్యమునకు
నాయకుడయ్యె నే నరవరుండు'

అనే అవతారికాపద్యం వల్ల తెలుస్తుంది. (గజపతి రాజులు - తెలుగు సాహిత్య పోషణము 14, 76 పు.)

**నవరామాయణము**

పూసపాటి వంశీయుడైన మొదటి ఆనందరాజు ప్రతి పద్యమనోహరంగా ఈ రామాయణాన్ని రచించినట్లుగా 'ప్రతి పద్య శిరఃకంపము జితనవ రామాయణంబు సరసులు మెచ్చంగ్కృతులు మఱికొన్ని సీతాపతి కయ్యానంద రాజు భక్తి నొసంగెన్' అనే విష్ణు భక్తి సుధాకరంలోని అవతారికా పద్యం వల్లా, "ఆనంద నృపతి చిదానందమూర్తియౌ రామునిపై భక్తి రాజిలంగ, బ్రతి పద్యము మనోహరముగ శోభిల 'నవ రామాయణం'బను రమ్య కృతిసె, రచియించి యర్పించె రామచంద్రునకు" అనే ఆంధ్ర కూర్మ పురాణంలోని వాక్యం (పుట 8) వల్లా తెలుస్తుంది. (సం ఆం. సా. 415) ఈ కృతి శ్రీరామచంద్రునికి అంకితం.

**వాంచారుపరిణయము**

భాస్కర శేషాచలకవి (18 శ.) ఈ యక్షగాన కృతిని రచించినట్లుగా అతని సేతుమాహాత్మ్యమనే కావ్యం అవతారికవల్ల తెలుస్తుంది. సేతుమాహాత్మ్య ప్రతి ఆం.ప్రా వ. గ్రంథాలయంలో ఉన్నది. (ద.దే ఆం. 475-476).

**నాగాభరణము**

ఇది లక్షణగ్రంథం. ఇందులోని ఒక పద్యం వెంకటరమణ కవి లక్షణ శిరోమణిలో ఉదాహరింపబడింది. (1-56). కావ్యంలో అష్టాదశ వర్ణనల్లో కొన్ని లేకున్నా దానికి కొఱత ఏమీ రాదనే భావంగల పద్యం ఇది. అందువల్ల ఇది కావ్యలక్షణం చెప్పే లక్షణ గ్రంథమని భావించవచ్చు. కర్త ఎవరో తెలియదు.

**నాటకలక్షణశాస్త్రము**

ఆసూరి మరింగంటి సింగరాచార్యులు ఈకృతికర్త.

**నారదీయపురాణము**

పిల్లలమర్రి పినవీరభద్రకవి ఈ కృతిని రచించినట్లుగా ఆతని శృంగార శాకుంతలంలో పేర్కొనబడింది.

పల్కినాడవు తేటపడజేసి 'నారదీ
 యము' సత్కవిశ్రేణి యాదరింప (1.22).

**నారసింహవిలాసకథ**

తరిగొండ వెంగమాంబ 'నారసింహవిలాస కథ' అనే కృతిని రచించినట్లుగా ఆమె ద్విపదభాగవత అవతారికలో పేర్కొబడింది.

"అటుగాన నారసింహాంకిత శతక
మ్మట మీద నారసింహ విలాసకథయు
విరచించి.... "

ఇది యక్షగానం.

**నారదీయపురాణము**

పిల్లలమర్రి పినవీరభద్రుడు ఈకృతికర్త. ఇది సంస్కృతంలోని నారద పురాణానికి ఆంధ్రానువాదం. పినవీరభద్రుడు ఈ కృతిని రచించినట్లుగా శృంగార శాకుంతలం, పెనుమళ్ళ సోమనామాత్యుని సీమంతినీ కల్యాణవల్ల తెలుస్తుంది. (చూ: అవతారదర్పణము)

**నాసికేతోపాఖ్యానము**

చెందలూరి చిక్కయ్య ఈ కృతికర్త. ఇందులోని ఆరు సీస పద్యాలు ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంలో సంకలితమైనాయి. (చూ: ప్రబంధరత్నావళి పుట 31-32.)

**నిజలింగచిక్కనికథ**

ఈ కృతికర్త పేరు తెలియదు. ఇందులోని ఒక పద్యం ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో ఉన్నట్లుగా డా॥ కొర్లపాటివారు పేర్కొన్నారు. (చూ: సాహిత్యసంపద, 281 పు.)

**నిరోష్ఠ్యజానకీకల్యాణము**

పోడూరి రామన్న కవి (18 శ.) ఈ కృతిని రచించినట్లు పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయం వల్ల తెలుస్తుంది. పెదరామామాత్యుడు రామన్నకు అగ్రజుడు.

**నిరోష్ఠ్యదాశరథీశతకము**

మండపాక పేరయ ఈ శతక కర్త. (చూ:- ఇందుమతీ పరిణయము- మండపాక పేరయ).

**నిరోష్ఠ్యరామాయణము**

సురపురం కేశవయ్య రచించిన ఈ రామాయణంలోని కొన్ని పద్యాలు మాత్రమే లభించినట్లుగా గోలకొండ కవుల సంచికలో పేర్కొ-బడింది. (పుట. 397) ఈ కవి తెలంగాణా ప్రాంతంలోని ఆత్మకూరు ప్రాంతానికి చెందినవాడు. తన కృతిని ఈతడు ఆత్మకూరు సంస్థాన ప్రభువైన రాజా సోమభూపాలునికి అంకితం చేసినాడట.

**నీతితారావళి**

ఇది కందనామాత్య రచితంగా మడికి సింగన సకలనీతి సమ్మతంవల్ల తెలియవస్తుంది. సకలనీతిసమ్మతంలో ఇందులోని పద్యాలు పన్నెండు ఉదాహరింపబడ్డాయి. ఇది నీతిశాస్త్ర గ్రంథం.

**నీతిభూషణము**

ఇందులోని 25 పద్యాలు మడికి సింగన సకలనీతిసమ్మతంలో సేకరింపబడ్డాయి. దీనిని ఆంధ్ర భోజుడు అనే కవి రచించినట్లుగా ఒక లక్షణ గ్రంథంలో ఉందని బాలబోధ లక్షణంలో దీనిలో నుండి ఎన్నో పద్యాలు ఉదాహరింపబడ్డాయని నిడుదవోలువారు తమ సకలనీతిసమ్మతంపీఠిక (పుట 27) లో పేర్కొన్నారు.

**నీతిసారము**

సకలనీతిసమ్మతంలో దీనిలో నుండి 114 పద్యాలు ఉదాహరింపబడ్డాయి. ఈ కృతికర్త కాకతిరుద్రదేవచక్రవర్తి (క్రీ. శ. 1262 ప్రాంతం).

**నీలకంఠయదేవికీర్తనలు**

సీమంతినీ విజయకావ్యాన్ని రచించిన వీరభద్రకవి తాత ఈ కీర్తనలను రచించినట్లుగా సీమంతినీ విజయ కావ్యావతారికలోని కింది పద్య భాగం వల్ల తెలుస్తుంది.

మరకాణ భూమీశ వరలబ్ధ కవితాదు రంధర వీరభద్రా భిధాన
నిక్కౕంబు మీ తాత నీలకంఠయదేవి కీర్తనల్ రచియించి కీర్తి గాంచె.

వీరభద్రకవి తాత పేరు తెలియదు.

**నీలకంఠచ్ఛందస్సు**

ఈ ఛందో గ్రంథకర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని పద్యాలు అప్ప కవీయంలో ఉదాహరింపబడ్డాయి. కనుక ఈ కృతి కర్త 1650 కి పూర్వుడని భావించవచ్చు.

**నీలకంఠ స్తవము**

మల్లికార్జునపండితుడీ స్తోత్రగ్రంథకర్త.

**నీలగిరినాథశతకము**

ఇది రామభద్రరాజుచే రచింపబడిన శతకం. ఈతడు రేకపల్లి సోమ నాథుని రుక్మవతీ పరిణయాన్ని అంకితంగా గ్రహించిన కాకరపూడి గోపాల రాయని వంశీయుడు. 17 వ శతాబ్దికి చెందినవాడు. ఈతడు నీలగిరినాథ శత కాన్నే కాక పద్మినీపరిణయమనే కావ్యాన్ని కూడా రచించినాడట. ఈ వివ రాలు రేకపల్లి సోమనాథుని రుక్మవతీ పరిణయంలోని అవతారికా పద్యం వల్ల తెలుస్తున్నాయి.

పద్మినీపరిణయ ప్రథిత సత్కృతి జేసెఁ బ్రతిభానుభావ సమ్మతముగాగ
రతి నీలగిరినాథ శతకంబులఁ గావించె సుప్రసాద మహత్వ దీప్రముగను
.....................రామభద్రక్షితీశ
మనుడు భువనదురంధరఖ్యాతి దనరె

**నృసింహదండకము**

ఏనుగు లచ్చకవి ఈ దండకాన్ని రచించినట్లుగా ఈతని రామవిలాస కావ్యంలో పేర్కొౕబడింది. భర్తృహరి సుభాషితాలను అనువదించిన ఏనుగు లక్ష్మణకవికి ఈ లచ్చకవి తాత.

**నృసింహపురాణము**

ఈ కృతి వేములవాడ భీమకవి కృతంగా ఆంధ్రప్రయోగరత్నాకరం లోనూ, ఆనందరంగరాట్ఛందంలోనూ పేర్కొౕబడింది. ఈ కావ్యంలోనివిగా ప్రస్తుతానికి లభ్యమైన పద్యాలు తొమ్మిది మాత్రమే. (చూ:- అలబ్ధ కావ్య పద్యముక్తావళి.)

**నృసింహపురాణము**

ఇది ద్విపద కృతి. 15వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఉండిన ప్రోలుగంటి చెన్నశౌరి ఈ కృతిని రచించి నృసింహస్వామికి అంకితమిచ్చినట్లుగా హరిభట్టు ఉత్తరనారసింహపురాణావతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

చెన్నశౌరి యుదయమునొందెన్
ఆ మంత్రి పుంగవుడష్టభాషాకవివర్యుడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహపురాణమొనరించి భక్తినహోబలభర్తకిచ్చె
బాలభారతమంద్రభాషను వచనకావ్యంబు జేసెను గవీశ్వరులు మెచ్చ
సౌభరిచరితంబు జక్కుల కథజెప్పె లాలితనవరసాలంకృతముగ
మఱియు పెక్కు కృతుల్పటుమతి రచించె
ఖ్యాతి నరసింగరాయలచేత గొనియె
అగ్రహారంబులను వివిధార్థములును
వెలసె గొండమ బెండ్లియై విభవమెసగ (33 పద్యం).

ద్విపద నృసింహ పురాణమే కాక చెన్నశౌరి బాలభారత మనే వచన కావ్యాన్ని, సౌభరిచరితమనే యక్షగానాన్ని, మరెన్నో కృతులను రచించినట్లుగా తెలుస్తుంది. (చంపూ కావ్యమే వచన కావ్యంగా పేర్కొనబడి ఉండవచ్చు.)

**నృసింహపురాణము**

ఇది ద్విపద కృతి. బారిగడ్పుల ధర్మయామాత్యుడు చంపువుగా రచించిన నృసింహ పురాణావతారికలోని ఈ కింది వచనం వల్ల ఈ ద్విపద నృసింహపురాణాన్ని గురించి తెలుస్తుంది.

'మఱియు నద్దేవుని శ్రీపాద సందర్శనానుభవుండనై మేనంబులకాంకురంబులు నిగుడ నానేర్చు విధంబుల సన్నుతించి మదీప్సితంబు విన్నవించిన నన్నుం గరుణార్ద్ర దృష్టిన్నిరీక్షించి దరహసిత వదనుండై యిట్లనియె. నీ యిష్టంబెరుంగుదు మున్ను నీవు ద్విపద రూపంబుగా జేయించి నాకు సమర్పించిన నృసింహపురాణంబు నంగీకరించితినని మరయు విట్లనియె'

పై వచనంలోని 'ద్విపద రూపంబుగా జేయించి' అనుటచే నీ ద్విపద కృతి కర్త ధర్మయామాత్యుడో మరియే కవియో సరిగా చెప్పలేమని ఆచార్య బి. రామరాజుగారు అభిప్రాయపడినారు. (చరిత్ర కెక్కని చరితార్థులు, పుట.7.)

**నృసింహవిలాసము**

లక్ష్మీనృసింహకవి ఈ కృతి కర్త. ఈతడు గద్వాల నివాసి క్రీ. శ. 1650 ప్రాంతాల్లో ఉండినవాడు. ఈతనికి నరసింగయ్య అనే నామాంతరం ఉంది. ఈ వివరాలు గోలకొండకవుల సంచిక వల్ల తెలుస్తున్నాయి.

**పంచకావ్యములు**

ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యం, శృంగార నైషధం, మను చరిత్ర, వసు చరిత్ర- ఈ పంచ కావ్యాలను పోచిరాజు వీరన్న సులభ శైలిలో రచించినట్లుగా ఆతని బిల్హణచరిత్రవల్ల తెలుస్తుంది.

**పంచతంత్రము**

సకల నీతిసమ్మతంలో ఈ గ్రంథంలోని 189 పద్యాలు గ్రహింప బడ్డాయి. ఈ కృతి కర్త ఎవ్వరో తెలియదు. 1250 ప్రాంతాలకు చెంది ఉంటాడు.

**పంచనదీస్థలపురాణము**

ఆంధ్ర కాళిదాస బిరుదాంచితుడైన ఆలూరి కుప్పన కవి ఈ పురాణ కర్త. ఇది సంస్కృత కృతికి తెనుగు అనువాదమని ఆతని ఆచార్య విజయ కావ్యావతారికలోని-

"లీల పంచనదీస్థలీ పురాణము తెనిగించితివారూఢి కీర్తి మెఱయ"

అనే పద్యభాగం వల్ల తెలుస్తుంది. (చూ. ఇందుమతీపరిణయము.)

**పంచబాణవిలాసము**

దీని కర్త ఎవ్వరో తెలియదు. సు. సా. లో ఇందులోని ఒక పద్యం ఉదాహరింపబడింది. (చూ: 102 వ.)

**పంచాస్త్రవిజయము**

ఈ కృతి మల్లకవి కృతమని ఆంధ్ర కౌముది తెలుపుతున్నది. ఇందులోని ఒక పద్య పాదం ఆంధ్ర కౌముదిలో ఉదాహరింపబడింది. (చూ: అలబ్ధ కావ్య పద్యముక్తావళి, 84 పు)

**పండితారాధ్యచరిత్ర**

సోమనాథుని ద్విపద పండితారాధ్య చరిత్రకు శ్రీనాథుని పద్య పరివర్తన మీ కృతి. శృంగార నైషధావతారికలో శ్రీనాథుడీ విషయాన్ని పేర్కొన్నాడు.

జగము నుతింపగ జెప్పితి
ప్రెగడయ్యకు నా యనుంగు పెద్దనకు గృతుల్
నిగమార్థసార సంగ్రహ
మగు నా యారాధ్యచరితమాదిగఁ బెక్కుల్ (14 పద్యం).

పిడుపర్తి సోమన కూడా తన పద్య బసవపురాణం పీఠికలోని ఈ కింది పద్యభాగంలో శ్రీనాథుడీ కృతిని రచించినట్లుగా తెలిపినాడు.

సరవి శ్రీనాథుడా చరిత పద్య ప్రబం
ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి.

**పద్మపురాణము**

అయ్యలరాజు సింగన ఈ కృతి కర్త. ఇందులోని ఒక పద్యం గణపవరపు వేంకట కవి ఆంధ్ర ప్రయోగరత్నాకరం (అముద్రితం) వల్ల తెలుస్తుంది. (చూ. అలబ్ధకావ్యపద్యముక్తావళి, 201. పు.)

**పద్మపురాణసంగ్రహము**

శ్రీనాథమహాకవికి పితామహుడైన కమలనాభామాత్యుడు ఈ కృతిని రచించినట్లుగా శ్రీనాథుని భీమేశ్వర పురాణం అవతారికలోని ఈ కింది పద్యం వల్ల తెలుస్తుంది.

కనకక్ష్మాధరధీరు వారిధితటీ ద్రాక్షారామాధీశ్వరున్
ఘనునిన్ 'బద్మపురాణ సంగ్రహ' కళాకావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁగవితావిద్యాధరుంగొల్తు మా
యనుగుందాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్యచూడామణిన్.

**పద్మావతీకల్యాణము**

నెల్లూరి ముత్తరాజు రచించిన ఈ కృతిలోని ఒకే ఒక పద్యం ప్రబంధరత్నాకరంలో ఉదాహరింపబడింది. (చూ:- ప్రబంధరత్నావళి, 77పు.)

**పద్మావతీచరిత్ర**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని పద్యాలు రత్నాకరం గోపాలరాజు రచించిన సకలలక్షణసారసంగ్రహం అనే ఛందోగ్రంథంలో ఉదాహరింపబడ్డాయి

**పద్మావతీపరిణయము**

బళ్లారి ప్రాంతానికి చెందిన వడకండ్ల గురురాజకవి ఈ నాటకాన్ని రచించినట్లుగా అతని 'శేషధర్మములు' అనే గ్రంథంవల్ల తెలుస్తుంది.

**పద్మావతీవివాహము**

వెలగపూడి కృష్ణయామాత్యుని భానుమద్విజయానికి నామాంతరం.

**పద్మినీకన్యకాభ్యుదయము**

మరింగంటి వేంకటనరసింహాచార్యులు (ద్వితీయ) ఈ ప్రబంధ కర్త. పద్మినీకన్యక అంటే లక్ష్మీదేవి కనుక ఆమెకు సంబంధించిన వృత్తాంతం ఇందులో ఇతివృత్తమై ఉంటుంది. ఈ కవి షోడశప్రబంధనిర్మాణధురీణుడనని తెలుపుకున్నాడు. గోలకొండ కవుల సంచికలో ఈ కవి రచనల్లో ఈ కృతి పేర్కొ-బడింది (పుట 410).

**పద్మినీపరిణయము**

ఈ కావ్యకర్త శృంగారకవి తిరుమలనాథకవి. 18 వ శతాబ్ది మధ్య కాలానికి చెందినవాడు. చూ :- దేవమల్లుపురాణం.

**పద్మినీపరిణయము**

ఇది రేకపల్లి రామభద్రరాజుచే రచింపబడిన కావ్యం. ఈతడు రేకపల్లి సోమనాథుని రుక్మవతీపరిణయాన్ని అంకితం గ్రహించిన కాకర్లపూడి గోపాల రాయని వంశీయుడు. (చూ : నీలగిరినాథశతకము).

**పద్మినీవల్లభము**

బొడ్డపాటి పేరయ ఈ కావ్యకర్త. ఇందులోని ఆరు పద్యాలు ప్రబంధ రత్నాకరంలో సంకలితమైనాయి. (చూ :- ప్రబంధ రత్నావళి, 61-62 పు). ఈ పద్యాలు పురవర్ణనకు సంబంధించినవి.

**పరమభాగవతచరిత్ర**

అలూరి కుప్పనకవి ఈ కృతిని రచించినట్లుగా అతని ఆచార్యవిజయ కావ్యావతారికవల్ల తెలుస్తుంది. శృంగారకవి తిరుమలనాథకవి, గణపవరపు వేంకటకవి. కట్టా వరదరాజు, సిద్ధిరాజు తిమ్మరాజు పరమ భాగవత చరిత్రను రచించిన కవులు. వీరిలో సిద్ధిరాజు తమ్మరాజు కృతి సమగ్రంగానూ, కట్టా వరదరాజు కృతి అసమగ్రంగానూ లభ్యమౌతున్నాయి. తక్కిన కవుల కృతులు అలభ్యాలు, (చూ. ఇందుమతీపరిణయం.)

**పరమభాగవతచరిత్ర**

గణపవరపు వేంకటకవి ఈ కృతిని రచించినట్లుగా ఇతని ప్రబంధ వేంకటేశ్వరవిజయవిలాసం అవతారికాపద్యంవల్ల తెలుస్తుంది.

శోభితరామాయణోభయ పరమ భా
గవతచరిత్రముఖప్రబంధ
బంధుర వచనానుబంధ (1.42)

**పరమభాగవతచరిత్ర**

శ్రీరామాయణాన్ని, శ్రీరంగ మాహాత్మ్యాన్ని రచించిన కట్టా వరదరాజు పరమభాగవతచరిత్రను రచించినట్లుగా ఆయన శ్రీరంగ మాహాత్మ్యం అవతారికలో పేర్కొనబడింది.

మున్ను నా పేర నంకితంబుగ నొనర్చి
తవనిలోఁ బొగడొంద భాగవచరిత
మిపుడొనర్పు ప్రబంధమ్మునిమ్ము నాకు
నంకితంబుగ శ్రీవేంకటాధిపతికి

దీని ప్రతి ఒకటి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉన్నది. 'ఎనిమిదో ఆశ్వాసం రుక్మాంగద చరిత్ర' అని ఉండడం వల్ల ఇది ఎనిమిదాశ్వాసాల గ్రంథం అని తెలుస్తుంది. తొలి ఏడాశ్వాసాల గ్రంథం లభ్యం కాలేదు. ఈ గ్రంథాలయంలోనే వరదరాజ కృతమైన పుండరీక చరితమనే గ్రంథం ఒక్కటి ఉంది. (వెం. 188) గ్రంథాంతంలో పరమభాగవత చరిత్రం బను పుండరీక మహాప్రబంధంబునందు సర్వమ్ము సంపూర్ణము అని ఉండడం

వల్ల ఇది కూడా పరమభాగవత చరిత్రలోని భాగమే అని భావించవచ్చు. వరదరాజు పరమభాగవత చరిత్రలో రెండు ఆశ్వాసాలు లభ్యమైనాయని ఊహించవచ్చు.

### పరమభాగవతచరిత్ర

శృంగారకవి తిరుమలనాథ కవి ఈ కావ్య కర్త. ఈత డీ కావ్యాన్ని రచించినట్లుగా ఈతని నాసికేతపురాణ మనే ద్విపద కావ్యావతారిక వల్ల తెలుస్తుంది (చూ పద్మినీపరిణయము)

### పరమభాగవతచరిత్ర

లక్షణకవి అప్పన ఈ కృతికర్త. ఆ.రం ఛం; అం. ప్ర.ర; సు.మ.రం. గ్రంథాల్లో ఈ కృతి ప్రసక్తి కానవస్తుంది. ప్రస్తుతానికి ఇందులోని మూడు పద్యాలు మాత్రమే లభ్యమైనాయి. (చూ. అలబ్ధకావ్యపద్యముక్తావళి 87 పు.)

### పరమార్థదీపిక

శృంగారకవి తిరుమలనాథకవి ఈ కావ్య కర్త. ఈత డీ గ్రంథాన్ని రచించినట్లుగా తన నాసికేతోపాఖ్యాన మనే ద్విపద కావ్యావతారికలో పేర్కొన్నాడు. (చూ. పద్మినీపరిణయము.)

### పర్వతనారదోపాఖ్యానము

పాలూరి గోవిందయ్య ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఆతని 'శారదశ ప్రాణప్రదీపిక'లోని ఈ క్రింది అవతారికాపద్యంవల్ల తెలుస్తుంది.

మనుపును పర్వతనారద
మునినాముల చరితమును సముత్కట ఫణితిన్
ఘనకార్యంబున నొనరిచి
తనకిచ్చిన ఘనుడవౌగదా ప్రమదమునన్ (1 - 16)

ఈ కావ్యం చెరుకూరి సదాశివునికి అంకితం కావింపబడింది.

### పర్వతపురాణము

పోలమరాజు ఈ కృతికర్త ఇది శ్రీశైలమాహాత్మ్యాన్ని వర్ణించే కావ్యం కావచ్చు. పర్వత పురాణంలోని ఒక్క పద్యం జగ్గకవి ప్రబంధ రత్నాక

రంలో ఉదాహరింపబడింది. (చూ: ప్రబంధ రత్నావళి, 65. పు.) ఈ పద్యంలో సూర్యాస్తమయ వర్ణనం ఉంది.

**పాదుకాసహస్రము**

వేదాంతదేశికులవారి పాదుకాసహస్రానికి అనువాదం కావచ్చు. విజయ రాఘవనాయకుడీ ద్విపద కృతి కర్తయైనట్లుగా ప్రహ్లాద చరిత్ర అవతారిక వల్ల తెలుస్తుంది.

ఘనతరంబగు "పాదుకాసహస్రం" బెల్ల
ద్విపద జేయు కళావతీ తనూజ

**పారిజాతము**

కెళ్ళ కప్పయ్య ఈ కృతి కర్త. ఈతడు తన తారాశశాంక విజయ పీఠికలో ఈ కృతిని రచించినట్లు పేర్కొన్నాడు. తారాశశాంక విజయం అముద్రితం. దీని ప్రతి ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది (కాల్ నెం. టి. 3 21.)

**పారిజాతాపహరణము**

విజయరాఘవనాయకుడీ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాద చరిత్ర అవతారికవల్ల తెలుస్తుంది.

**పారిజాతాపహరణము**

తంజావూరు నాయక రాజులలో పేరెన్నికగన్న రఘునాథ నాయకుడు ఈ ద్విపద ప్రబంధాన్ని రెండు జాములలో ఆశువుగా రచించి తండ్రియైన అచ్యుతప్ప నాయకునిచే కనకాభిషేకాన్ని పొందినట్లుగా నారాయణ దీక్షితుడు, రాజచూడామణి దీక్షితుడు పేర్కొన్నారు. అచ్యుతప్ప నాయకుని ఆస్థానంలో దీనిని వినిపించినట్లుగా విజయరాఘవ నాయకుని రఘునాథనాయకాభ్యుదయం లోని ఈ కింది వాక్యాలవల్ల తెలుస్తుంది.

"వెలిబోండ్లు కొందఱు వినిపించిరపుడు
పొందైన పారిజాతాపహరణంబు".

గోవింద దీక్షితులు తమ సాహిత్యసుధలో పేర్కొన్న రఘునాథ నాయకుని రచనలలో పారిజాతాపహరణప్రబంధం కూడా ఉంది.

శ్రీపారిజాతాపహరణ ప్రబంధం
చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యమ్
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర
మోక్షం చరిత్రం చ నలస్య చిత్రమ్.

**పార్వతీపరిణయము**

ఈ ప్రబంధాన్ని రచించిన కవి చెంగల్వ వెంకటయ్య (1600). ఈతడు రాజగోపాల విలాస ప్రబంధాన్ని రచించిన చెంగల్వ కాళకవి తండ్రి, కాళకవి 1633-73 నడుమ తంజావూరిని పాలించిన విజయరాఘవ నాయకుని ఆస్థానంలో ఉన్నవాడు కనుక అతని తండ్రియైన వేంకటకవి 17 వ శతాబ్ది ప్రారంభంలో ఉండినట్లుగా చెప్పవచ్చు. ఈతడు పార్వతీపరిణయం మొదలైన ప్రబంధాలను రచించినట్లుగా ఈతని కుమారుడు చెంగల్వ కాళకవి తన రాజగోపాలవిలాసప్రబంధంలో (1-29) పేర్కొన్నాడు.

శ్రీవత్స గోత్రుండు శ్రీకరపాకనాటార్వేల బంధుజనాతిశాయి
కాళయమంత్రి పుంగవునకు గంగమాంబకు నుదయించు తపఃఫలంబు
రణరంగ గంధవారణ బిరుదాంకిత స్వకులజ శ్రీకంఠ సచివమౌళి
పార్వతీపరిణయ ప్రముఖప్రబంధ నిబంధ ధురంధర ప్రౌఢ ఫణితి

యైన చెంగల్వ వేంకటయ్యయును రావి
నూతల తిరుమలయ్య తనూజ కృష్ణ
మాంబ మనుగన్న నిధి కాళహస్తి గిరిశ
కలితలలితోక్తి భారవి కాళసుకవి.

పై పద్యంలో చెంగల్వ వెంకటయ్య పార్వతీ పరిణయమేకాక మరికొన్ని ప్రబంధాలను కూడా రచించినట్లు చెప్పబడింది. తక్కిన ప్రబంధాల పేర్లు తెలియరావడం లేదు.

**పిళ్ళనాయనారికథ**

పిడుపర్తి బసవనచే రచింపబడిన ద్విపద కావ్యం. పిడుపర్తి సోమన పద్య బసవ పురాణావతారికలో ఈ ద్విపద కావ్యాన్ని పేర్కొన్నాడు.

పుణ్యకవ్రతము

నాయక రాజుల్లో ప్రసిద్ధినొందిన విజయరాఘవ నాయకుడు ఈ గానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాద నాటక చరిత్రవల్ల తెలుస్తుం ఉత్సవాదుల్లో ప్రదర్శించడానికి వీలుగా శ్రీకృష్ణుని కథ ఇందులో వర్ణిత ఉంటుంది.

పురాణసారము

సకల కథానిధాన కృతి కర్త ఎఱ్ఱయ ఈ కృతికర్త. ఈ కుంటముక్కల పినభైరవ మంత్రికి అంకితం చేయబడింది. ఎఱ్ఱయ సకలకథా నిధానంలో ఈ కృతిని గూర్చి ఈ విధంగా చెప్పుకున్నాడు

రసికులభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టి ప్రోడవు (అవతారిక 1.18).

పురాణసారము

గణపవరపు వేంకటకవి ఈ కృతి కర్త. ఈతడు తన ప్ర.రా. వి వి. అవతారికలో "అఖిల పురాణ సారాంశమిట్లలవియే, యిల విలాసంబు దెలుగుసేయ" (51 పద్యం) అని చెప్పుకోవడం వల్ల ఇది సంస్కృత కృ అనువాదమో లేక ఆయా సంస్కృత పురాణాల్లోని భాగాలకు అనువాద కావచ్చు.

పురాతనచరిత్రము

ఈ కావ్య కర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒక్క పద్యం మాత్ర ఉదాహరణపద్యములన్న సంకలనగ్రంథంవల్ల లభ్యమౌతుంది. (చూ. ప్రబ రత్నావళి 113 పు).

పురుషార్థసారము

యతిప్రాస విలాసమనే లక్షణ గ్రంథంలో ఈ కృతిలోని ఒక ఉదాహరింపబడింది. కృతి కర్త పెద్దన. ఈ పెద్దన ఏ పెద్దనో తెలియదు. యతిప్రాస విలాసం ప్రతి ఆంధ్ర సాహిత్యపరిషత్తు పుస్తక గారంలో ఉన్నది. (నెం. 4059)

**పురుషార్థసారము**

సకలనీతి సమ్మతంలో ఇందులోని 89 పద్యాలు గ్రహించబడ్డాయి. కాకతి గణపతి దేవచక్రవర్తి దీక్షాగురువు, రాజనీతిజ్ఞుడు శివదేవయ్య ఈ కృతి కర్త. పూర్వకవి స్తుతిలో శివదేవయ్య పేరు కానవస్తుంది. ఈతని కాలం 1250-1300.

**పురుషార్థసుధానిధి**

పిల్లలమర్రి వీరయ్య కవి ఈ కృతికర్త. ఇందులోని రెండు సీస పద్యాలు ఉదాహరణపద్యములన్న సంకలన గ్రంథంలో సేకరింపబడ్డాయి. (చూ: ప్రబంధరత్నావళి, 95-96 పుటలు).

**పురుషోత్తమఖండము**

విష్ణుపురాణాన్ని ఆంధ్రీకరించిన కలిదిండి భావనారాయణ ఈ కృతిని రచించినట్లుగా అతని విష్ణుపురాణఅవతారికవల్ల తెలుస్తుంది ఇది పూరీ జగన్నాథస్వామిమాహాత్మ్యాన్ని తెలిపే కావ్యం.

**పూర్ణచంద్రోదయము**

ఈ కృతికర్త పేరు తెలియదు. ఇందులోని ఒక్క పద్యం 'ప్రబంధ సార శిరోమణి'లో పేర్కొనబడింది. పురసరోవర్ణన ఆ పద్యంలోని అంశం. కనుక ఇది ఒక ప్రబంధమని భావించవచ్చు. (పుట. 26.)

**పెదకాళహస్తిమాహాత్మ్యము**

ధూర్జటి లింగరాజకవి (16 శ) ఈ కృతికర్త. ఇది దామెర్ల వెంకటపతి రాయలకు అంకితమీయబడింది. ఇందులోని కొన్ని పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి.

**పెమ్మయ సింగధీమణీ శతకము**

విక్రమార్కచరిత్ర కర్త జక్కన ఈ శతకాన్ని రచించినట్లుగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటు పద్యమణి మంజరిలో పేర్కొన్నారు. ఈ శతకంలోని కొన్ని పద్యాలు మాత్రం లభించినాయి. 'పెమ్మయ సింగధీమణీ' అనేది ఇందులోని మకుటం.

**ప్రజ్ఞావతీరాయబారము**

తుమ్మూరి శరభరాజకవిచే ఈ కావ్యం రచింపబడినట్లుగా అతని శరభ రాజీయమనే వైద్యగ్రంథం అవతారికలోని కిందిపద్యంవల్ల తెలుస్తుంది.

పాకభేదముల నేర్పడ బల్కితి వినుతి
　　సేయ బ్రజ్ఞావతీరాయబారము

శరభరాజీయప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. (చూ:-ఆర్. 539.)

**ప్రణయకలహము**

విజయరాఘవ నాయకునిచే ఈ యక్షగానం రచింపబడినట్లుగా అతని ప్రహ్లాద చరిత్ర అవతారిక వల్ల తెలుస్తుంది. ఈ అవతారికలో రఘునాథ నాయకుని 28 గ్రంథాలు పేర్కొబడ్డాయి. వీటిలో చాలా గ్రంథాలు అలభ్యాలు.

**ప్రద్యుమ్న చరిత్ర**

ముప్పిరాల సుబ్బరాయకవి ఈ కావ్యాన్ని రచించినట్లు అతని కృష్ణాభ్యుదయకావ్యంలో పేర్కొబడింది. (ఆం. క. స. 293 పు.)

**ప్రద్యుమ్నచరిత్ర**

ఇది పొన్నాడ పెద్దిరాజుచే రచింపబడ్డ కావ్యం. ఇందులోని 19 పద్యాలు ప్రబంధ రత్నాకరంలో సేకరింపబడి ఉన్నాయి. (చూ: ప్రబంధ రత్నావళి.) ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో మరో ఆరేడు పద్యాలు ఈ కావ్యంలోనివి లభిస్తున్నట్లుగా కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తెలిపినారు. (సాహిత్య సంపద, 297 - 298 పుటలు.) మొత్తం 26 పద్యాలు లభించినాయన్నమాట.

**ప్రద్యుమ్న విజయము**

పణదవు మాధవునిచే రచింపబడ్డ ఈ కావ్యంలోని పదమూడు పద్యాలు ప్రబంధ రత్నాకరంలో పేర్కొబడ్డాయి. (ప్రబంధ రత్నావళి, పుటలు 75 - 87) ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో మరో రెండు పద్యాలు కూడా కనిపిస్తున్నాయి (చూ: సాహిత్య సంపద, పుటలు 275-276 ) వెరసి ఈ కావ్యంలోని పద్యాలు పదిహేనువరకు లభ్యమైనాయన్నమాట.

**ప్రబంధపారకృష్ణాభ్యుదయము**

ఆంధ్ర కౌముది ఈ కృతిని ప్రోవణాంక కవి కృతంగా పేర్కొంటూ ఒక పద్య భాగాన్ని ఉదాహరించింది (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి, 87 పు.)

**ప్రవరాఖ్యచరితము**

కెళ్ళ కప్పయ్య ఈ కృతికర్త. ఈతడీ కృతిని రచించినట్లుగా అతని తారాశశాంక విజయ కావ్యావతారికవల్ల తెలుస్తుంది. (చూ. అర్ధనారీశ్వరీకలాపము.)

**ప్రేమాభిరామము**

అనూరి మరింగంటి సింగరాచార్యులు (1600.) ఈ కృతికర్త. సింగరాచార్యులీ ద్విపద కావ్యాన్ని తన పదహారో ఏట రచించినట్లుగా ఆతని సీతా కల్యాణంలో (అవతారిక, 18 పద్యం) పేర్కొనబడింది. (చూ: ధనాభిరామము.)

**ప్రేమాభిరామము**

ఇందులోని నాలుగు పద్యాలు ప్రబంధరత్నాకరం ప్రత్యంతరంలో సేకరింపబడినాయి ఇది కామశాస్త్రగ్రంథం కావచ్చు. ఇందులో 'త్రిపురారి ప్రేమాభిరామము' అని పేర్కోబడింది. త్రిపురారి త్రిపురాంతకునికి నామాంతరం. ఈ త్రిపురాంతకుడు అయ్యలరాజు త్రిపురాంతకుడు కావచ్చునేమో అని డా॥ కొర్లపాటివారు అభిప్రాయపడినారు. (చూ: సాహిత్యసంపద, పుట 271 - 271.)

**ఫాల్గుణోత్సవము**

విజయరాఘవ నాయకునిచే ఈ కృతి రచింపబడినట్లుగా ఆతని ప్రహ్లాద చరిత్ర యక్షగానంవల్ల తెలుస్తుంది. ఇది రగడలతో, చౌపదులతో సంతరింపబడ్డ కృతి.

**బలవదరీశతకము**

'బలవదరీ కుహరభాస్వదరీ యదరీ దరీహరీ' అనే మకుటంతో కందుకూరి రుద్రకవి చెప్పిన శతకం. ఈ శతకంలోని నాలుగు పద్యాలు మాత్రమే లభ్యమౌతున్నాయి. చాటుపద్య మణిమంజరిలో మూడు పద్యాలు, పంచానన పత్రికలో ఒకటి పేర్కోబడ్డాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి, 90 - 91 పుటలు.)

**బసవగీతములు**

మల్లికార్జునపండితారాధ్యుని కృతి.

**బహుళాశ్వచరిత్ర**

కాకమాని మూర్తికవి రచించిన ఈ కావ్యంలోని పద్యాలు సర్వలక్షణ సార సంగ్రహంలోనూ, ఆనంద రంగరాట్ఛందంలోనూ ఉదాహరింపబడ్డాయి.

**బాలభారతము**

కాకమాని గంగాధరుడీ కృతికర్త, అగస్త్య కవిచే రచింపబడిన సంస్కృత బాలభారతానికిది అనువాద గ్రంథమో లేక స్వతంత్ర గ్రంథమో

తెలియదు. ఇందులోని పదిహేను పద్యాలు ప్రబంధ రత్నాకరంలో ఉదాహరింపబడ్డాయి. (చూ : ప్రబంధరత్నావళి, 28-30 పుట.)

**బాలభారతము**

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. కామినేని ఎల్లారెడ్డి ఈ కృతిని అంకితం పొందినట్లుగా పట్టమట్ట సోమయాజి సూతసంహితవల్ల తెలుస్తుంది. కాకమాని గంగాధరకవి రచించిన బాలభారతం, ఇది ఒక్కటి కాదు.

**బాలభారతము**

హరిభట్టు నృసింహపురాణావతారికలో "బాలభారతమంధ్ర భాషను వచన కావ్యంబు చేసెను కవీశ్వరులు మెచ్చ" (33 పద్యం) అని పేర్కొనడం వల్ల ఇది వచన కావ్యమని, ప్రోలుగంటి చెన్నశౌరి ఈ కావ్య కర్త అని తెలుస్తుంది. వచన కావ్యమంటే చంపూ కావ్యం కావచ్చు. హరిభట్టు రచించిన వరాహపురాణం అవతారికలో "ఒక్క ప్రబంధంబు ఆంధ్రభాషా భవ్యంబగు వచన కావ్యంబుగా రచియింపంబూనిన సమయంబున" అని చంపూ కావ్యమైన వరాహ పురాణం వచన కావ్యంగా పేర్కొబడింది. దీనిని బట్టి ఆ కాలంలో గద్యపద్యాత్మకమైన కావ్యానికి వచన కావ్యమనే వ్యవహారం ఉండి ఉండవచ్చునని ఊహించవచ్చు. (చూ: నృసింహపురాణము-ద్విపద.)

**బాలభారతము**

ఈ ప్రబంధ కర్త ఎవ్వరో తెలియదు. దీనిని దోమకొండ సంస్థానాధిపతులలో ఒకరైన మొదటి ఎల్లారెడ్డి అంకితం గ్రహించినట్లుగా మాత్రం పట్టమెట్ట సోమయాజి రచించిన బ్రహ్మోత్తర ఖండం వల్లా, మల్లారెడ్డి రచించిన శివధర్మోత్తరంవల్లా తెలుస్తుంది.

అందెనెవ్వడు కిరాతార్జునీయము బాల
భారతంబనెడి ప్రబంధయుగళి
అతడు....ఎల్లారెడ్డి
ధాత్రీంద్రమౌళి.... (బ్రహ్మోత్తరఖండం)

ఎల్లారెడ్డి యందె హెచ్చనంగఁబదార్థ
సృష్టి పాకరీతి వృత్తులలో
బాలభారతప్రబంధకిరాతార్జు
నీయ కృతులు కీర్తి నివ్వటిల్ల (శివధర్మోత్తరం)

**బాలరామాయణము**

గణపవరపు వేంకటకవిచే రచింపబడ్డ ద్విపద కృతి. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసం అవతారికలో తానీ కావ్యాన్ని రచించినట్లుగా వేంకటకవి పేర్కొన్నాడు (26 ప).

**బాహటము**

17 వ శతాబ్దికి చెందిన ఎలకూచి బాలసరస్వతి ఈ కృతిని రచించినట్లుగా ఈతని చంద్రికాపరిణయంలోని

చెలువుగ, దెలుగు సేసితి వామన పురాణ,
బాహటాది మహాప్రబంధ చయము

అనే పద్యం వల్ల తెలుస్తుంది. బాహట గ్రంథాన్ని మహా ప్రబంధమని కవి పేర్కొన్నాడు. కాణాదం పెద్దన సోమయాజి కూడా 'బాహట' కృతిని రచించినట్లుగా ముకుందవిలాసంలో (1-23) చెప్పుకున్నాడు. అదీ కూడా అలబ్ధమే.

**బాహటము**

కాణాదం పెద్దన సోమయాజి 'ముకుంద విలాస' కావ్యావతారికలో బాహట మనే కృతిని రచించినట్లుగా చెప్పుకున్నాడు (1-23). ఎలకూచి బాల సరస్వతి కూడా బాహటగ్రంథాన్ని రచించినట్లు తెలుస్తుంది. ఈ రెండు 'బాహట' కృతులూ అలబ్ధాలే.

**బృందావనంభవము**

వరాతం అప్పన ఈ కావ్యాన్ని రచించినట్లుగా లక్షణ శిరోమణి మొదలైన లక్షణగ్రంథాలవల్ల తెలుస్తుంది.

**బృహన్నారదీయము**

సంస్కృతంలోని బృహన్నారదీయానికి ఇది అనువాదం. వానిరాజు రామయ్య ఈ కృతి కర్త. ఇందులోని మూడు పద్యాలు ఉదాహరణ పద్యము లన్న సంకలనగ్రంథంలో సేకరింపబడినాయి. (చూ: ప్రబంధ రత్నావళి, 87 పు.)

**బ్రహ్మాండపురాణము**

కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందంలోనూ, గణపవరపు వేంకట కవి ఆంధ్ర ప్రయోగ రత్నాకరంలోనూ ఈ పురాణాన్ని పేర్కొన్నారు.

వేంకటకవి ఈ కృతిని కవిమాధవ కృతమని తెలిపినాడు. ఇందులోని మొత్తం నాలుగు పద్యాల అసంపూర్ణపాదాలు లభ్యమైనాయి (చూ: అలబ్ధకావ్య పద్య ముక్తావళి, 93 పు.)

**బ్రహ్మోత్తర ఖండము**

స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండమూలాన్ని అనుసరించిన ద్విపద గ్రంథం. దీన్ని పిడుపర్తి బసవన రచించినట్లుగా అతని పద బసవపురాణ అవతారికనుబట్టి తెలుస్తుంది.

**భక్తకల్పద్రుమశతకము**

కాసుల పురుషోత్తమ కవి (18 శ.) ఈ శతక కర్త అని ఆంధ్ర కవి సప్తశతి తెలుపుతుంది.

**భగవద్గీత**

కర్పూరం కృష్ణమాచార్యులు (1650) ఈ ద్విపద భగవద్గీత కర్త. ఈతడు నల్లగొండ జిల్లా చర్లపల్లి గ్రామ నివాసి. ఈ కృతి చర్లపల్లి కేశవుని అంకితం చేయబడింది. గోలకొండ కవుల సంచికవల్ల ఈ వివరాలు తెలుస్తున్నాయి.

**భరతశాస్త్రము**

ఇది నాట్యశాస్త్రానికి సంబంధించిన గ్రంథం. దామరాజు సోమయ్య ఈ శాస్త్ర గ్రంథకర్త. ఇందులోని ఐదు పద్యాలు జగ్గకవి ప్రబంధ రత్నాకరంలో లభ్యమౌతున్నాయి. (చూ: ప్రబంధ రత్నావళి 103 - 104 పు.) తెలుగులో రచింపబడ్డ నాట్యశాస్త్ర గ్రంథం లభ్యం కాకపోవడం ఆంధ్రుల దురదృష్టం.

**భర్తృహరి శతకములు**

వడకండ్ల గురురాజకవి భర్తృహరి శతకాలను తెలుగులో అనువదించినట్లుగా అతని శేషధర్మము అనే గ్రంథంలో పేర్కొబడింది. ఈ అనువాదానికి ఆయన చేసిన నామకరణమేమిటో నిర్దిష్టంగా తెలియదు.

**భర్తృహరిసుభాషితములు**

18 వ శతాబ్దికి చెందిన పోచిరాజు వీరన్న ఈ కృతిని రచించినట్లుగా అతని శల్యాణచరిత్రవల్ల తెలుస్తుంది.

**భల్లాణచరిత్రము**

ఇది లోకేరావు సోమన (క్రీ.శ. 1600 ప్రాంతం) రచించిన **కావ్యం.** తానీ కావ్యం రచించినట్లుగా తన బలభద్రవిజయ కావ్యంలో పేర్కొన్నాడు.

భల్లాణచరితంబు పద్యకావ్యముగ
యెల్ల పౌరులు మెచ్చ నేఁజేసినాఁడ

కొట్రా బాలకవి, మేధాతిథిభట్టు, ఏనుగు లక్ష్మణకవి కూడా భల్లాణ చరిత్రను రచించినట్లుగా తెలుస్తుంది. కాని ఇవన్నీ అలభ్యాలే.

**భల్లాణచరిత్రము**

బొబ్బిలి సంస్థానాన్ని ఆశ్రయించిన కొట్ర బాలకవి (1730 - 90) ఈ కృతికర్త. ఈతని అసలు పేరు వేంకటేశ్వరకవి. బాల్యంలోనే కవితలు చెప్పి బాలకవిగా ప్రసిద్ధుడై ఉంటాడు విమలాంగీ పరిణయము అనే ప్రబంధం తాళపత్ర ప్రతి ఒకటి కొట్ర బాలకవి కృతంగా అసమగ్రంగా మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. (ఆం.సం.సా. 300 - 301.)

**భల్లాణరాయచరిత్ర**

ఏనుగు లక్ష్మణకవి రచించిన రాజశేఖర చరిత్రకు భల్లాణరాయ చరిత్ర మనే నామాంతరం ఉన్నట్లుగా తెలుస్తుంది. లక్ష్మణకవి రాజశేఖర చరిత్రను రచించినట్లుగా అతని జాహ్నవీ మాహాత్మ్యంలో పేర్కొబడింది (చూ. రాజశేఖరచరిత్ర.)

**భల్లాణరాయచరిత్రము**

కవిమేధాతిథియైన భట్టార్యుడు ఈ ద్విపద ప్రబంధాన్ని రచించినట్లుగా ఆంధ్ర కౌముదిలో పేర్కొబడింది. ఇందులోని ఒకే ద్విపద ఆంధ్ర కౌముది మూలంగా లభ్యమైంది.

కాము మామను రాహు కబళించు మాడ్కి
కోమలి మొగము ముంగురులాక్రమించె

సిందుకటకరాజైన భల్లాణుడనే శివభక్తుని కథ ఈ ప్రబంధంలోని వస్తువు కావచ్చు. కూచిమంచి తిమ్మకవి, కొట్ర బాలకవి, మల్లవరపు వాలేశుడు, ఏనుగు లక్ష్మణకవి, చిత్తరువు గంగాధరుడు మొదలైనవారు కూడా భల్లాణ రాయచరిత్రను రచించినారు.

**భాగవతము**

కుందుర్తి వేంకటాచల కవి (18 శతాబ్ది) భాగవతాన్ని వచన (చంపూ) కావ్యంగా సంతరించినట్లు అతని మిత్రవిందాపరిణయం అవతారికలోని కింది పద్యభాగంవల్ల తెలుస్తుంది.

"వచనకావ్యములుగా రచియించినావు భా
రతభాగవతములు రామకథయు"

ఈతడు భాగవతాన్నే కాక భారత, రామాయణాలను కూడా వచనంలో రచించినట్లుగా పై పద్యభాగం వల్ల తెలుస్తుంది. 'కథాశుకవి' అని కీర్తిగన్న ఈతడు అనేక నాటకాలను, చాటు కృతులను, చతుర్విధ కవితలను, కార్తిక మాహాత్మ్యమనే కావ్యాన్ని రచించినట్లు తెలుస్తుంది. ఈతని రచనలలో మిత్ర విందా పరిణయం, కార్తిక మాహాత్మ్యం తప్ప తక్కిన రచనలన్నీ అలభ్యాలు.

**భాగవతసంగ్రహము**

విజయరాఘవ నాయకుని ఆస్థానాన్ని అలంకరించిన రంగాజమ్మ ఈ కృతిని రచించినట్లుగా ఆమె 'ఉషాపరిణయ' ప్రబంధం అవతారిక వల్ల తెలుస్తుంది.

రాణింప రచించి 'రామాయణము'ను
'భాగవతంబు'ను 'భారతంబు'

ఈమె భాగవతాన్నే కాక రామాయణ, భారతాలను కూడా సంగ్రహంగా రచించినట్లు ఈ పద్యంవల్ల తెలుస్తుంది.

**భాగవతాభ్యుదయము**

ఈ కావ్యం తుమ్మూరి శరభరాజకవిచే రచింపబడింది. ఇందులో భగవద్భక్తుల అభ్యుదయవర్ణన ప్రధానవస్తువు కావచ్చు. (చూ కాళిందీ పరిణయము)

**భారతము**

18వ శతాబ్దికి చెందిన కుందుర్తి వేంకటాచలకవి భారతాన్ని వచనంలో రచించినట్లుగా అతని మిత్రవిందా పరిణయం అవతారిక వల్ల తెలుస్తుంది. (చూ. భాగవతము.)

**భారతీపరిణయము**

కుందుర్తి గోవిందయ్య ఈ కావ్యకర్త. ఈతడు మిత్రవిందా పరిణయాన్ని రచించిన కుందుర్తి వేంకటాచలకవి వంశీయుడు. గోవిందయ్య ఈ

కావ్యాన్ని వీరవెంకటపతిరాయలకు అంకితం చేసి అతని వల్ల కనకాభిషేకం పొందినాడు. వీరవెంకటపతిరాయలు క్రీ.శ. 1680-1700 ప్రాంతాలలో ఉండినవాడు కనుక గోవిందయ్యకూడా ఈ కాలానికే చెందినట్లుగ చెప్పవచ్చు. ఈతనికి సంబంధించిన ఈ వివరాలు కుందుర్తి వేంకటాచలకవి మిత్రవిందా పరిణయం అవతారికలోని కింది పద్యంవల్ల తెలియవస్తున్నాయి.

పటుతరగోస్తనీ మధురపాకసమం చితమున్ రసోర్మి వ
ర్యటమగు భారతీపరిణయంబును కావ్యమొసంగి వీరవేం
కటపతిరాయలందనిపించె మణీ కనకాభిషేకము
త్కటగతి నమ్మహామతి ముఖస్థితి శోభియశోభిరాముడై.

**భార్గవాభ్యుదయము**

పోడూరి కొండకవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా పోడూరి పెదరామామాత్యుడు రచించిన శివరామాభ్యుదయావతారికలోని కింది వాక్యం వల్ల తెలుస్తుంది.

నీ వంశపూర్వ ధీనిధి కొండకవి చెప్పె
భార్గవాభ్యుదయప్రబంధ మెలమి

కొండకవి క్రీ.శ. 1600 కు పూర్వుడని చాగంటివారభిప్రాయపడినారు.

**భావనారాయణశతకము**

తిరుక్కడయూరి కృష్ణదాసు (1800కి పూర్వుడు) చే రచింపబడినట్లుగా భావింపబడుతున్న రామదాసు చరిత్ర అనే యక్షగానంలో ఈ శతకంలోని కొన్ని పద్యాలు ఉదాహరింపబడినాయి. దీని కర్త ఎవ్వరో తెలియదు. (క.స. 39 పు.)

**భావపంచాశతి**

దీని కర్త యెవ్వరో తెలియదు. ఒక్క పద్యంమాత్రం ఒకానొక ఛందో గ్రంథంలో ఉదాహరింపబడింది. (చూ. అలబ్ధకావ్యపద్య ముక్తావళి 95 పు.) లభించిన పద్యాన్ని బట్టి ఇది వేదాంతతత్త్వ గ్రంథమని భావించవచ్చు.

**భాషావివరణము**

ఈ వ్యాకరణ గ్రంథాన్ని ఎలకూచి బాలసరస్వతి రచించినట్లుగా అతని రాఘవయాదవపాండవీయమనే త్ర్యర్థికావ్య అవతారికలోని

"ఆంధ్రచింతామణీ వ్యాఖ్యాన భాషావి
వరణాది బహుతంత్రకరణచతుర"

అనే పద్యంవల్ల తెలుస్తుంది. తెలుగు సాహిత్యకోశంలో ఈ కృతి (1139 పు.) షడ్భాషా వివరణమని పేర్కొబడింది. దీనినిబట్టి షడ్విధ ప్రాకృతాల లక్షణం ఇందులో వివరించబడినట్లుగా భావించవచ్చు.

**భాస్కర (దేవ)చ్ఛందము**

పొత్తపి వేంకటరమణకవి లక్షణ శిరోమణిలో ఈ ఛందంలోని ఒక పద్యం ఉదాహరింపబడింది (4-36). వెంకటరమణకవి దీనిని భాస్కరచ్ఛందమని పేర్కొనినాడు. ఆంధ్ర ప్రయోగ రత్నాకరంలో భాస్కరదేవచ్ఛందమని పేర్కొబడింది. ఈ రెండూ ఒక్కటే కావచ్చు.

**భీమసేన విజయము**

ఏనుగు లక్ష్మణకవి తాత ఏనుగు లచ్చకవి ఈ కావ్యకర్త.

**భృంగి స్తవము**

మల్లికార్జునపండితుని రచన.

**భేతాళపంచవింశతి**

ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంవల్ల పోతరాజు రచితమైన ఈ కావ్యం ఉనికి తెలియవస్తుంది. ఇందులోని మొత్తం తొమ్మిది పద్యాలు ఉదాహరణ పద్యములలో ఉదాహరింపబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి 64-65.)

**భ్రమరగీతలు**

ఇది సంస్కృత భాగవతంలోని భ్రమరగీతలకు తెనుగు ద్విపదానువాదం. విజయరాఘవ నాయకుడే కృతికర్త. ఈ కృతి ప్రసక్తి ఆయన ప్రహ్లాదచరిత్ర అవతారికలో కానవస్తుంది.

**భ్రమరగీతలు**

ఎలకూచి బాలసరస్వతి ఈ కృతిని రచించినట్లుగా అతని ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్య బాలసరస్వతీయటీక అవతారికలోని 'భ్రామరీగీతి ప్రబంధౌఘకర్తను' అనే పద్యభాగంవల్ల తెలుస్తుంది.

**మంగళగిరివిలాసము**

బొడ్డపాటి పేరయ ఈ కృతికర్త. ఇందులోని ఒక పద్యం ప్రబంధ రత్నాకరంలో సేకరింపబడి ఉంది. (చూ. ప్రబంధరత్నావళి, పు. 62).

**మంగాంబికాశతకము**

తాళ్ళపాక అన్నమయ్య ఈ శతకాన్ని రచించినట్లుగా చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో ఈ విధంగా పేర్కొన్నాడు.

''అలిమేలుమంగకు నాళుమార్గముగాను
సలలితంబుగ నొక్క శతకంబు చెప్పె''

అన్నమయ్య మొత్తం పన్నెండు శతకాలు చెప్పినట్లుగా చిన్నన్న పేర్కొన్నా, వాటిలో మనకు లభ్యమయ్యేది ఒక వేంకటేశ్వర శతకం మాత్రమే. మంగాంబికాశతకం నామమాత్రంగా తెలియవస్తుంది. తక్కిన పది శతకాల పేర్లే మనకు తెలియలేదు. ఇది అన్నమయ్య తొలి శతకం కావచ్చు.

**మంజరీ ద్విపదప్రబంధ నాటకము**

ఇది మంజరీ ద్విపదలో రచింపబడిన యక్షగానం. విజయ రాఘవ నాయకుడీ కృతిని రచించినట్లుగా అతని 'ప్రహ్లాద చరిత్ర' అవతారిక వల్ల తెలుస్తుంది

**మంత్ర పాద స్తవము**

నెల్లూరి వీరరాఘవకవి ఈ స్తుతి కృతిని రచించినట్లుగా అతని వసుంధరా పరిణయంలోని క్రింది పద్యభాగంవల్ల తెలుస్తుంది.

మంత్రపాద స్తవంబును మఱియుఁ గృతులు
ఘటన చేసితి వీరరాఘవకవీంద్ర! (చూః కృష్ణభుజంగము.)

**మత్తలీలావిలాసము**

నాచన సోమన ఈ కావ్యాన్ని రచించినట్లుగా జగ్గకవి ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరం వల్ల తెలుస్తుంది. ఇందులో వసంత వర్ణన పరమైన ఒక పద్యం పేర్కొనబడింది. ప్రబంధరత్నాకరం ప్రత్యంతరంలో ఈ కావ్యం దత్తలీలావిలాస మని పేర్కొనబడ్డా ఇది లేఖక దోషమనీ, ఇది మత్తలీలా విలాసమేననీ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారి నిర్ణయం. (చూ. సాహిత్య సంపద 284 పుట.)

**మత్స్యపురాణము**

ఇది లింగమకుంట రామకవి (16 శ.) చే రచింపబడ్డ కృతి. సంస్కృత మత్స్యపురాణానికి ఆంధ్రీకృతి. రామకవి మత్స్యపురాణాన్ని రచించినట్లుగా ఈతని ఆనంద కానన మాహాత్మ్య కావ్యావతారికలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది.

విను ము 'మత్స్యపురాణ' 'వామనపురాణ'
ములను 'వేంకట మాహాత్మ్యము'ను ఫల
ప్రదము 'చతుర్వాటికా మహత్త్వము'ను దెనుగు
జేసి వెలసితివని ప్రసిద్ధి దనర.

ఈతడు మత్స్యపురాణము, వామనపురాణము, వేంకటమాహాత్మ్యము, చతుర్వాటికామాహాత్మ్యము, ఆనంద కానన మాహాత్మ్యము అనే ఐదు కృతులను రచించినట్లుగా తెలియవస్తున్నా వీటిలో మొదటి మూడు కృతులు లభించలేదు. తెనాలి రామకృష్ణుని అల్లుడనని చెప్పుకొనడంవల్ల ఈ కవి 16 వ శతాబ్ది మధ్య కాలానికి చెందినట్లుగా భావించవచ్చు.

**మత్స్యపురాణము**

గద్వాల సంస్థానాధిపతియైన చిన సోమభూపాలుని ఆస్థానంలో ఉండిన కాణాదం పెద్దన సోమయాజిచే ఈ పురాణం రచించబడినట్లుగా ఆతని ముకుందవిలాసావతారికలోని కింది పద్యం తెలుపుతుంది.

శ్రీరమణీయతన్ సురపురీ నగరీనగరీయ దేశభూ
భార ధురీణుడౌ బహిరిరామ నృపాలు సభాంతరంబునన్
మారమణాంకితంబుగను మత్స్యపురాణమొనర్చు(చు)బూనవే
సారసుధారసస్రవవిలసత్కృతి సాంద్రవచశ్చమత్కృతిన్. (1.25.)

పెద్దన గద్వాలకు రాకపూర్వం సురపుర సంస్థానంలో రాజా బహిరి రామనృపాలుని ఆస్థానంలో ఉన్నప్పుడు ఈ గ్రంథం రచింపబడింది. ఈతడు చిన సోమభూపాలుని ఆస్థానంలో ఉండటంవల్ల ఈతడు 18వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన కవిగా భావించవచ్చు.

**మదనకళాభిరామము**

నారాయణదేవునిచే రచింపబడిన కళాభిరామమనే కామశాస్త్ర గ్రంథానికి మదనకళాభిరామమనే నామాంతరం ఉన్నట్లుగా ప్రబంధరత్నాకరం ప్రత్యంతరంవల్ల తెలుస్తుంది. (చూ:- కళాభిరామము.)

**మదనవిజయము**

ఇది వాత్స్యాయన కామసూత్రాల కనువాదరూపమైన కామశాస్త్ర గ్రంథమని మానవల్లివారు తెలుపుతూ, ఇందులోని రెండు పద్యాలను త్రిపురాంతకోదాహరణం పీఠికలో ఉదాహరించినారు. అంతేకాక, తాము చూసిన ప్రతిలో

పూర్వపీఠిక లేదనీ, బూజుపట్టి విడదీసినచో సహస్ర శకలాకారములందుచుండె నని, తద్గ్రంథస్వాములు తమ పైతృకధనమని దానిని తమకు ఈనొల్లకుండి రనీ, రెండవమారు చూపలేదనీ త్రిపురాంతకోదాహరణ పీఠికలో వ్రాసినారు. (మానపల్లికవిరచనలు 95–96 పుట,) ఒక ప్రాచీనకవి తెలుగులో సంత రించిన వాత్స్యాయనకామసూత్రాల అనువాదగ్రంథం మనకు లభించక పోవడం విచారించదగిన విషయం.

**మదనసేనము**

జంటకవులైన నంది మల్లయ, ఘంట సింగనలలో ఒకరైన నంది మల్లయ మదనసేనమనే కావ్యాన్ని రచించినట్లు ప్రబంధరత్నాకరంవల్లా, అ.క., ల.సా.సం., సు.మ.రం. మొదలైన లక్షణగ్రంథాలవల్లా తెలియ వస్తుంది. ఈ కావ్యంలోని పద్యాలు 10 వరకు లభ్యమౌతున్నాయి. (చూ:- అలబ్ధకావ్యపద్యముక్తావళి, సాహిత్యసంపద, పుట 295, 296.)

**మధుసేనము (మధుసేవనము)**

ఈ కావ్యంలోని ఒక్క పద్యం అప్పకవీయంలో ఉదాహరించబడింది. (3-337.) దీని కర్త ఎవ్వరో తెలియదు.

**మన్నారుసాంగత్యము**

విజయరాఘవనాయకుని కృతి. కన్నడంలో ప్రసిద్ధమైన సాంగత్య ప్రక్రియలో రచింపబడింది. తెలుగులోని ద్విపదకంటె ఇందులో ఒక మాత్ర అధికంగా ఉంటుంది. దీనికి సంపంగి మన్నారు సాంగత్యము అనే పేరు కూడా ఉన్నది.

**మయూర స్తవము**

మల్లికార్జునపండితుని రచన.

**మరుత్తరాట్చరిత్ర**

ఇది శ్రీనాథుని గ్రంథాల్లో మొట్టమొదటిది. 'చిన్నారిపొన్నారి చిరుత కూకటినాడు, రచియించితి మరుత్తరాట్చరిత్ర' అని శ్రీనాథుడు ఈ కావ్యాన్ని చిరుత కూకటి వయస్సులో రచించినట్లుగా స్వయంగా చెప్పుకున్నాడు. (భీమఖండం 1-7.) మరుత్తుడనే రాజు చరిత్ర ఇందులోని వస్తువు కావచ్చు. ఇందులోని ఒక పద్యమైనా మనకు లభించలేదు.

**మరుత్సందేశము**

వేములవాడ సోమనాథ కవి ఈ సందేశ కావ్యాన్ని రచించినట్లుగా అతని వసుచరిత్ర వ్యాఖ్యాన అవతారికవల్ల తెలుస్తుంది. ఇది మేఘసందేశం ఒరవడిలో రచించబడిన సందేశకావ్యం. (చూ: చతుర్భుజాభిషేకము.)

**మర్యాదరామన్నచరిత్ర**

వెలగపూడి కృష్ణయామాత్యుడు భానుమద్విజయ ప్రబంధంలో తన పూర్వులు రచించిన గ్రంథాలను పేర్కొంటూ ఈ కృతిని ప్రస్తుతించినాడు ఈ కృతి కర్త ఎవ్వరో తెలియదు (చూ: గాంగేయోపాఖ్యానము.)

**మలయరాజీయము**

మల్లికార్జున పండితారాధ్యుడీ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలో పేర్కొబడింది. (పర్వతప్రకరణము.)

**మలయాద్రినారసింహచ్ఛందము**

ఈ ఛందో గ్రంథకర్త లింగరాజు నృసింహమాల్యాద్రి ఛందస్సు అనే పేర కర్త తెలియని ఛందోగ్రంథం తిరుపతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. ఆ గ్రంథం ఇదేనేమో!

**మలరాజుగుండారాయణోపాఖ్యానము**

ఇది రాళ్ళబండి పట్టాభిరామ కవి (18 శ.) రచించిన కావ్యం. (చూ:- శమంతకోపాఖ్యానం.) నరసరావుపేట సంస్థానానికి చెందిన మలరాజు పెద వెంకటగుండారావును పొగడుతూ రచించిన కావ్యం.

**మలహణచరిత్రము**

15 వ శతాబ్ది చివరి భాగంలో ఉండిన పోశెట్టి లింగన ఈ కృతి కర్త. ఇది ద్విపద కృతి. లింగన ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఇతని నవచోళ చరిత్రమనే ద్విపద కావ్యం వల్ల తెలుస్తుంది. ఈతడు వీర సంగయ్య దేవ చరిత్రం, శంకరదాసమయ్య చరిత్రం, శిష్యప్రబోధం అనే కృతులను కూడా రచించినట్లు ఈతని నవచోళచరిత్ర వల్ల తెలుస్తుంది. నవచోళ చరిత్ర తప్ప ఇతరకావ్యాలేవీ లభ్యం కాలేదు.

**మలహణము**

పండితారాధ్యుడీ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు.

మలహరణంబగు మలహణంబునను
మలహణప్రియుని ద్విమలహరుఁబొగడు (దీక్షాప్రకరణం.)

**మల్లమదేవిపురాణము**

పాల్కురికి సోమనాథుడు మల్లమదేవి పురాణాన్ని నాలుగాశ్వాసాల్లో ద్విపదకావ్యంగా రచించినట్లుగా తెలుస్తుంది.

దీని తాళపత్ర ప్రతిని నందికొట్కూరులో సుబ్బయ్య అనే లింగాయతుని ఇంటిలో తాము స్వయంగా చూచినట్లు శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శర్మగాలు 'నా కర్నూలు మండల సంచారం' అనే వ్యాసంలో వ్రాసినట్లుగా డా॥ జి నాగయ్యగారు తమ ద్విపద వాఙ్మయంలో పేర్కొన్నారు. (పు. 119) కాని ఇది ఇప్పటికీ అలభ్యమే.

**మల్లికార్జునలింగశతకము**

బొడ్డపాటి పేరయ (16 శ.) రచించిన ఈ సీస శతకంలోని మూడు పద్యాలు పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించబడినవి. (ప్రబంధ రత్నావళి; 60 పు. స.ఆం.సా. 9 సం.) ఈ మూడు పద్యాలు త్రిపురాసుర సంహారానికి సంబంధించినవట. 'మల్లికార్జున లింగ! యుమా ప్రసంగ!' అనేది ఈ శతకంలోని మకుటం.

**మల్హణ శతకము**

చూ: మలహణ శతకము.

**మహానాటకము**

మల్లికార్జునపండితుని శైవమతపరమైన రచన.

**మహిమ్నస్తవము**

పండితారాధ్యుడీ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రవల్ల తెలుస్తుంది.

మహిఁజెప్పబడు మహిమ్నస్తవంబునను
మహిమాకరుని మహామహిమ గీర్తించు (దీక్షాప్రకరణం.)

**మహిషాసురమర్దనీ శతకము**

18వ శతాబ్దికి చెందిన పచ్చమెట్ల పాపయ్య ఈ శతకకర్త. మహిషాసుర మర్దనీ శివా! అనేది ఇందులోని మకుటం. దీనిలోని ఒక్క పద్యం మాత్రమే లభించింది. (శ.క.చ. 826)

**మాఘమాహాత్మ్యము**

ఇది పిల్లలమర్రి పినవీరభద్రుడు మంజుల వాగ్వైఖరితో చెప్పిన కావ్య మట. శృంగార శాకుంతలంలోనూ, పెనుమళ్ళ సోమన సీమంతినీ కల్యాణం లోనూ ఈ కృతిని పినవీరన రచించినట్లుగా పేర్కొబడింది. (చూ: అవతార దర్పణము.)

**మానసబోధశతకము**

కాసుల పురుషోత్తమ కవి (18 శ.) ఈ శతకాన్ని రచించినట్లుగా ఆంధ్రకవి సప్తశతిలో పేర్కొబడింది. ఈతడు 1798 ప్రాంతంలో ఉన్న రాజా అంకినీడు బహద్దరుగారి ఆస్థానంలో ఉండినాడట.

**మానసోల్లాసము**

నెల్లూరి శివరామకవి తన కామకళానిధిలో శ్రీనాథుడొక కామశాస్త్రాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు. ఆ గ్రంథం మానసోల్లాసం కావచ్చునేమోనని పండితుల ఊహ. (క.స. 276 )

**మానసోల్లాససారము**

పిల్లలమర్రి పినవీరభద్రునిచే రచింపబడిన కృతి. శృంగార శాకుం తలంలోనూ, పెనుమళ్ళ సోమనామాత్యుని సీమంతినీ కల్యాణంలోనూ ఈ కృతి పేర్కొబడింది. "లలితమౌ మానసోల్లససారంబన్న, కబ్బంబు భాషించె నబ్బు రముగ" అన్న సీమంతినీ కల్యాణంలోని పద్యం వల్ల ఇది కావ్యమని తెలు స్తుంది ఇందులో వర్ణితమైన కథాంశమేమిటో తెలియదు. శ్రీనాథుడు రచించిన గ్రంథాల్లో కూడా ఒక మానసోల్లాసమనే కావ్యం ఉంది. అదికూడా అలభ్యమే.

**మారీచీ పరిణయము**

కృష్ణదేవరాయల కూతురు మోహనాంగి ఈ కృతి కర్త అని లోకంలో వాడుక ఉంది. ఈ కావ్యం పూర్తిగా లభ్యం కాలేదు. ఈ కావ్యం అవతారికా భాగంలోని 99 గద్య పద్యాలు (94 పద్యాలు, 5 గద్యాలు), నాల్గో ఆశ్వాసం లోని 4 గద్య పద్యాలు (2 గద్యాలు, 2 పద్యాలు) మొత్తం 103 గద్య పద్యాలు లభ్యమౌతున్నాయి. ఈ అవతారికా భాగం చారిత్రికంగా ఎంతో ప్రాధాన్యం కలది. ఇందులో కృతి కర్త్రి మోహనాంగి జీవిత విశేషాలతోపాటు ఆమె తండ్రి కృష్ణదేవరాయల జీవిత విశేషాలు కూడా కనిపిస్తాయి. డా॥ సి.వి. రామ చంద్రరావు గారు ఈ కృతిలోని లభ్యమైన పద్యాలను విపులమైన పీఠికతో

పాటు వెలువరించినారు. ఈ పీఠికలో మోహనాంగికి, కృష్ణదేవరాయలకూ సంబంధించిన అనేక చారిత్రికవిశేషాలను విపులంగా చర్చించినారు.

**మార్కండేయచరిత్రము**

పోచిరాజు వీరన్న (18 శతాబ్ది) ఈ కృతిని రచించినట్లుగా ఆతని శల్హణ చరిత్రంలో పేర్కొబడింది. కవి దీనిని తన 26 వ ఏట రచించినాడట.

**మార్కండేయపురాణము**

వామనపురాణ కర్త పోన్నతోట ఓబళకవి (16 శ.) ఈ కృతిని రచించి రాజా జగదేవరాయనికి అంకితం ఇచ్చినట్లుగా ఆతని వామన పురాణం అవతారికవల్ల తెలుస్తుంది ఈతని మార్కండేయ పురాణం అలభ్యమే ఐనా వామన పురాణం మాత్రం లభ్యమే. కాని అముద్రితం.

**మాలినీమాధవీయము**

ఇది భానుమద్విజయ కావ్యకర్తయైన వెలగపూడి కృష్ణయచే రచింపబడింది. కృష్ణయ, ఇదికాక గౌళికా శాస్త్రం, కందపద్య శతకం, వేదాంతసార సంగ్రహశాస్త్రం, కొన్ని చాటు కృతులు రచించినట్లుగా భానుద్విజయంలోని ఈ కింది అవతారికాపద్యం తెలుపుతుంది.

> మహిలోన 'మాలినీ మాధవీయ'మనంగ శృంగారకావ్య మొనరఁగఁజేసి
> 'గౌళికాశాస్త్రంబు' కడులోక హితముగా నెనయ నేకాశ్వాసముగ రచించి
> పరిఢవిల్లగఁ 'గందపద్య శతకంబు' వాల్గుయోగంబుల ననువుపఱచి
> మీఱిన 'వేదాంతసార సంగ్రహశాస్త్ర' మనురంగ వచనకావ్యంబొనర్చి
>
> చాటుకృతులను మరికొన్ని సంఘటించి
> మాఘకాంకిత మొనరించి మంచి పుణ్య
> శాలియన గీర్తి గైకొన్న సత్కవీంద్ర
> మధురవాక్సాంద్ర! కృష్ణయామాత్యచంద్ర! (23 వ పద్యం)

పై పద్యంలో పేర్కొన్న గ్రంథాల్లో ఏవీ లభ్యం కాలేదు. మాలినీ మాధవీయం శృంగార కావ్యమని తెలుస్తుంది.

**మిత్రపద్ధతి**

పొత్తపి వెంకట రమణ కవి లక్షణ శిరోమణిలో భీమన్నగారి 'మిత్ర పద్ధతి' (4-159) అని పేర్కొ-వడంవల్ల దీని కర్త భీమన్న అని తెలుస్తుంది. ఈ భీమన్న ఎవ్వరో తెలియదు. ఉదాహృత పద్యాన్నిబట్టి ఇది నీతి శతకం వంటి గ్రంథమని చెప్పవచ్చు.

**మిత్రవిందాపరిణయము**

కావూరి ఎల్లయ కవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా అతని మరో కృతి బ్రహ్మాండపురాణం అవతారికవల్ల తెలుస్తుంది.

**ముకుందవిలాసము**

ధర్మవరం రామకవి (18 శతాబ్ది) ఈ కృతికర్త. ఈతడు గద్వాల ప్రభువైన సోమభూపాలుని ప్రోత్సాహంతో దీనిని రచించినట్లుగా తెలుస్తుంది. ఈ కావ్యంలోని ఒక పద్యం మాత్రమే లభించినట్లుగా గోలకొండ కవుల సంచికలో పేర్కొ-బడింది. (పుట. 406)

గద్వాల ఆస్థానకవి కాణాదం పెద్దన సోమయాజి కూడా ముకుంద విలాసమనే పేరుతో ప్రౌఢ కావ్యాన్ని రచించినాడు. అది లభ్యమే. ముద్రితం కూడా.

**ముక్తదేవుని కథ**

పోచిరాజు వీరన్న (18 శతాబ్ది) ఈ కృతిని రచించినట్లుగా అతని శిల్హాణ చరిత్ర కావ్యావతారిక వల్ల తెలుస్తుంది. కృష్ణా జిల్లాలోని కొలకలూరు ఈతని నివాసస్థానం.

**ముద్రామాత్యము**

ఇందులోని 39 పద్యాలు మడికి సింగన సకలనీతి సమ్మతంలో గ్రహింపబడ్డాయి. ఇది కేవల నీతి శాస్త్రం కాక ముద్రారాక్షసం మాదిరిగా ఒక మంత్రి నీతిపౌరంధర్యాన్ని వర్ణించే కావ్యమేమో అన్న సందేహాన్ని నిడుదవోలు వారు వెలిబుచ్చినారు. (సకలనీతిసమ్మతం పీఠిక - పుట 86.) క్షేమేంద్రుడనే బిరుదు వహించిన లక్కా-భట్టు దీని కర్త. ఈతడు ముద్రామాత్యాన్నే కాక శతపక్షి సంవాదం, శూద్రక చరితం అనే రెండు కావ్యాలనుకూడా రచించి నాడు. అవి కూడా అలబ్యాలే.

**ముద్రారాక్షసము**

ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయంలోని ఒకానొక ఛందో గ్రంథం (డి. 705) లో ఈ కృతి నుండి ఒక పద్యం ఉదాహరింపబడింది. దీని కర్త ఎవ్వరో తెలియదు. ఇది విశాఖదత్తుని ముద్రారాక్షస నాటకానికి అనువాదం కావచ్చునేమో! (చూ: అ.కా.ప.ము. 208 పుట.)

**ముద్రాలాభము**

వేములవాడ సోమనాథకవి ఈ కృతికర్త. ఇందులోని వస్తు వేమిటో తెలియదు. ఈతడు వసుచరిత్రకు 'విద్వజ్జనరంజని' అనే వ్యాఖ్యానాన్ని, ధ్రువచరిత్ర, మరుత్సందేశం, గంగాగౌరీసంవాదం అనే కావ్యాలను రచించినట్లుగా తెలుస్తుంది. వీటిలో ఒక్క 'విద్వజ్జనరంజని' వ్యాఖ్య మాత్రమే లభ్యమైనది. తక్కిన కృతులకు సంబంధించిన వివరాలు ఈ వ్యాఖ్యవల్ల తెలుస్తున్నాయి. (చూ: చతుర్భుజాభిషేకము.)

**మేఘసందేశము**

కొటికెలపూడి వేంకటకృష్ణ కవి ఈ కావ్య కర్త. ఇది కాళిదాసు మేఘసందేశానికి అనువాదమై ఉంటుంది. వేంకటకృష్ణ కవి ఈ కృతిని రచించినట్లుగా అతని శ్వేతాచలమాహాత్మ్య కావ్యాన్నిబట్టి తెలుస్తుంది.

**మేలుకొలుపుద్విపద**

తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు ఈ కృతికర్త.

**మోహినీవిలాసము**

విజయరాఘవనాయకుడు రచించిన ఈ యక్షగాన ప్రసక్తి ఆతని ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో కనిపిస్తుంది. ఇందులోని 'అల్ల మోహినీ విలాసాఖ్య ద్విపద కృతి, నాటకంబొనరించు నలసమాన' అనే వాక్యం వల్ల ఇది ద్విపదరూపంలో రచింపబడిందని తెలుస్తుంది.

**మౌనిదండకము**

మల్లికార్జునపండితుని శైవమతపరమైన రచన.

**యతిరాజుబిరుదుగద్య**

గణపవరపు వేంకటకవి ఈ కృతికర్త. ఈతడు తన గురువైన యతిరాజుపై చెప్పిన బిరుదుగద్య కావచ్చు.

**యథావాల్మీకిరామాయణము**

గణపవరపు వేంకటకవి ఆం. ప్ర. ర. లో ఈ కృతిని లక్షణ కవి అవ్వన కృతంగా పేర్కొంటూ ఇందులోని ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి 103 పుట.)

**యమకశతకము**

యమకాలంకారంతో రచింపబడిన శతకం. 'వేంకటశైలనాయకా' అనేది ఇందులోని మకుటం. చిత్రకవితా రచనకు పేరుగన్న గణపవరపు వేంకట కవి ఈ శతక కర్త. వేంకటకవి ఈ శతకాన్ని రచించినట్లుగా ఈతని ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాస కావ్యావతారికలోని ఈ కింది పద్యం వల్ల తెలుస్తుంది.

శ్రీకరంబుగఁబది రెండవయేటఁదారావళుల్విడియించి ప్రౌఢిగన్న
మునిమునిమీసంబునె మొనయుటనే యమకశతక మొనర్చి కౌశలము గన్న
ఇరువది యేటను 'శృంగారమంజరి'యు నుదాహరణ జేసి ఘనత గన్న
ఇరువదేనవయేట గృష్ణమల్లమకథ చతుర్భద్రి జెప్పి సంతుష్టిగన్న
మఱియును బాలరామాయణ ద్విపద పొసంగించి బహువిధ చాటు కవిత
నతిశయము గన్న నాదు జిహ్వాంచలంబు
తనివినొందదు కులదేవతావతంస
వేంకటేశ్వరచరణారవిందమహిమ
నవనవోన్మేష లేశవర్ణనలఁగాక. (26 పద్యం)

వేంకటకవి ఈ శతకాన్ని మునిముని మీసాల వయస్సులో రచించినాడట. ఈ శతకంలోని ఒక పద్యం ఈతని ప్రయోగ రత్నాకరంలో ఉదాహరింపబడింది. (26 పుట) ఈ పద్యం అలబ్ధ కావ్యపద్య ముక్తావళిలో సేకరింపబడింది. (పుట 203).

**యయాతిచరిత్రము**

ఈ కావ్యం బోరవెల్లి కృష్ణవ్వ (17 శ.)చే రచింపబడినట్లుగా కుమార్ల వేంకటరాయల ద్రౌపదీకల్యాణంలోని కింది అవతారికా పద్యం వల్ల తెలుస్తుంది

మీ తాత దత్తన్న శబ్దశాస్త్ర ప్రవీణు
డతని సుతుఁడు కృష్ణవ యయాతి
చరిత్ర మిశ్రకావ్యమొనర్చె... (పీఠిక 47 పద్యం)

ఇది మిశ్రకావ్యమట.

**యయాతిచరిత్ర**

క సం. ౪. లోనూ, మరో ఛందోగ్రంథంలోనూ సూరవరాజ కృతమైన యయాతి చరిత్రలోని ఒక పద్య పాదం ఉదాహరింపబడింది. (చూ:- అలబ్ధ కావ్యపద్యముక్తావళి 105 పుట.)

**యయాతిచరిత్ర**

గణపవరపు వేంకటకవి ఈ కృతిని రాయసం దత్తన కృతంగా పేర్కొంటూ ఇందులోని ఒక పద్యాన్ని ఆంధ్ర ప్రయోగ రత్నాకరంలో ఉదాహరించినాడు. (చూ - అలబ్ధకావ్యపద్య ముక్తావళి 104 పు)

**యాదవచరిత్రము**

వసుచరిత్రకు 'విద్వన్మనోరంజని' వ్యాఖ్య రచించిన వేములవాడ సోమనాథ కవి (1650) తన వ్యాఖ్యానంలో ఈ గ్రంథాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.

**యాదవామాత్యఛందము**

ఇందులోని ఒక పద్యం సులక్షణసారంలో ఉదాహరింపబడింది. యాదవామాత్యుడీ ఛందఃకర్త యని గ్రంథనామాన్నిబట్టి ఊహించవచ్చు. లేదా యాదవామాత్యునికీ గ్రంథం అంకితం కావచ్చు. ఈతని గురించిన వివరాలు తెలియవు. ఈ ఛందోగ్రంథానికి లక్షణశిరోమణి అనే నామాంతరం ఉన్నదని రావూరి దొరసామిశర్మగారు తెలుపుతున్నారు. (లక్షణ శిరోమణి, పొత్తపి వెంకటరమణకవి - పీఠిక 10 పుట.) రత్నాకరం గోపాలరాజు రచించిన సకల లక్షణసార సంగ్రహంలో కూడ ఇందులోని కొన్ని పద్యాలు లభ్యమౌతున్నాయి.

**యోగశాస్త్రశతకము**

దీనికి చతుర్విధ కంద శతకమనే నామాంతరం ఉంది వెలిగపూడి కృష్ణయామాత్యుడు ఈ శతక కర్త. చతుర్విధయోగాలనుగూర్చిన విషయాలను కవి ఇందులో కందపద్యాల్లో వివరించినాడట. కృష్ణయామాత్యుడీ శతకాన్ని రచించినట్లు అతని భామమద్విజయ పీఠికవల్ల తెలుస్తుంది.

**రంగకౌముదీనాటకము**

ఎలకూచి బాలసరస్వతి (17 శ.) ఈ యక్షగానాన్ని రచించినట్లుగా అతని రాఘవ యాదవ పాండవీయమనే త్ర్యర్థికావ్యం అవతారికలోని క్రింది

పద్యంవల్ల తెలుస్తుంది.

"కవి సమీహిత రంగకౌముదీ నాటక విధాన ప్రతిష్ఠా ఘనుడ"

ఈతని బాలసరస్వతీయ టీక అవతారికలోని 'కౌముదీ నాటక కావ్య కవిని' అనే వాక్యంలో ఈ నాటకం 'కౌముదీ నాటక'మని పేర్కొనబడింది.

**రంగనాథశతకము**

ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయంలో ఉన్న 'ఉదాహరణ పద్యముల'నే సంకలన గ్రంథంలో ఈ శతకం పేర్కొబడింది. ఇందులోని ఒక పద్యం ప్రబంధరత్నావళిలో ఉదాహరించబడింది. (పుట 114.) ఈ శతక కర్త పేరు తెలియదు. 16 వ శతాబ్దికి చెందినవాడు. ఉదాహృత పద్యంలో మకుటం కానరాదు.

**రంగశాయిశతకము**

ఈ శతక కర్త పేరు తెలియదు. తిరుక్కడయూరి కృష్ణదాసు రచించిన 'రామదాసు చరిత్ర' అనే యక్షగానంలో ఈ శతకంలోని పద్యాలు ఉదాహరింపబడినట్లుగా క స.లో పేర్కొబడింది. (పుట 39.)

**రఘుపుంగవశతకము**

మంచెళ్ళ కృష్ణకవి ఈ శతక కర్త. ఈతడు 1840 కంటే పూర్వుడు. పూరుష ముఖ్యశతకం, రంగ శతకం, వేంకటనాథ శతకం, కృష్ణ శృంగార కథావళి అనే కృతులను రచించినాడట. (క.స. 38 పు)

**రఘురామ శతకము**

కెళ్ళ కవ్వయ్య ఈ కృతి కర్త. ఈతడీ కృతిని రచించినట్లు అతని తారాశశాంక విజయ పీఠికలో పేర్కొబడింది. (చూ:- అర్ధనారీశ్వరీ కలాపము)

**రణరంగవిజయము**

అడిదం సూరకవి వంశానికి మూల పురుషుడైన అడిదం నీలాద్రి కవి (1450) ఈ కృతికర్త. నీలాద్రి కవి తమ ప్రభువైన పూసపాటి తమ్మిరాజు రణవిజయాలను వర్ణిస్తూ రచించిన కావ్యం ఇది. (క.త. 6.231.)

**రతిమన్మథవిలాసము**

విజయ రాఘవ నాయకుడు రచించిన యక్షగానం. దీని ప్రసక్తి ఈతని ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో కనిస్తుంది.

**రత్నావళి**

కవిలోకబ్రహ్మ బిరుదాంచితుడైన పెదపాటి సోమయ ఈ కృతికర్త. ఇందులోని ఒక పద్యం ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో కనిపిస్తుంది. ఇది శ్రీహర్షుని రత్నావళికి అనుకరణమేమో అని డా॥ కొర్లపాటివారి సంభావన. (చూ: సాహిత్యసంపద, పుట 280-28.)

సోమయకవి అరుణాచల పురాణం, కేదారఖండం, శివజ్ఞాన దీపిక, త్రిపుర విజయం అనే కావ్యాలను కూడా రచించినాడు. ఈ కృతులన్నీ అలబ్ధాలే.

**రసమంజరి**

సంస్కృతంలో భానుదత్తుడు రచించిన 'రసమంజరి' అనే అలంకార శాస్త్రానికి నెల్లూరి వీరరాఘవకవి సంతరించిన తెలుగు అనువాద కృతి ఇది. వీరరాఘవ కవి ఈ కృతిని రచించినట్లుగా ఆతని వసుంధరా పరిణయావతారిక లోని కింది పద్యం తెలుపుతుంది.

ఎంచ 'రసమంజరి'ని తెనిగించి నీతి
సర్వలోకేశ శతకంబు సంఘటించి
మంత్రపాద స్తవంబును మఱియు గృతులు
ఘటనజేసితి వీరరాఘవకవీంద్ర!

**రాకాసుధాపూర్ణరస పుష్పగుచ్ఛము**

ఇది రసనిరూపణకు సంబంధించిన అలంకార శాస్త్ర గ్రంథం కావచ్చు. మరింగంటి సింగరాచార్యులు ఈ కృతిని రచించినట్లుగా ఆతని సీతాకల్యాణ కావ్యంలోని అవతారికాపద్యం (1-20) వల్ల తెలుస్తుంది.

**రాఘవపాండవీయము**

వేములవాడ భీమకవి రాఘవ పాండవీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించి నట్లుగా లోకంలో ప్రతీతి ఉందని పింగళి సూరన తన రాఘవపాండవీయంలో ఈ విధంగా పేర్కొన్నాడు.

భీమన తొల్లి చెప్పెనను పెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నే యెఱుఁగ మది యెవ్వరు గానరటుండనిమ్ము
(అవతారిక 11 పద్యం)

భీమకవి నృసింహ పురాణాన్ని, శతకంఠ రామాయాణాన్ని రచించినట్లు తెలుస్తుంది. అవి కూడా అలబ్ధాలే.

**రాఘవపాండవీయవ్యాఖ్య**

చిత్రకవి వెంకరమణకవి ఈ వ్యాఖ్య రాసినట్లుగా అతని సాంబవిలాస కావ్యంలోని 'రాఘవపాండవీయ విష్ణుచిత్తీయ వసుచరిత్ర ప్రముఖ దివ్యాత్యాకార్థ బోధన సమర్థుడ'నసే వాక్యం తెలుపుతుంది. ఈతడు రాఘవపాండవీయానికే కాక విష్ణుచిత్తీయం, వసుచరిత్ర మొదలైన ప్రబంధాలకు కూడా వ్యాఖ్య రాసినట్లు తెలుస్తుంది.

**రాఘవపాండవీయవ్యాఖ్య**

కవి సంజీవని కర్త ముద్దరాజు రామన రాఘవపాండవీయానికి వ్యాఖ్య రాసినట్లు తెలుస్తున్నదనీ, తమకా వ్యాఖ్య లభింవలేదనీ కవితరంగిణిలో చాగంటి శేషయ్యగారు తెలిపినారు. (11-213.)

**రాఘవేంద్రాష్టకము**

వడకండ్ల గురురాజకవి ఈ అష్టక కర్త.

**రాజగోపాలదండకము**

విజయరాఘవనాయకుడు తన ఇష్టదైవమైన రాజగోపాలునిపై రచించిన దండకం.

**రాజగోపాలవిలాసము**

విజయరాఘవనాయకుడు ఈ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ప్రహ్లాదచరిత్రవల్ల తెలుస్తుంది.

**రాజవశేఖరచరిత్ర**

రత్నాకరం గోపాలరాజు (17 శ.) రచించిన సకల లక్షణసార సంగ్రహమనే ఛందోగ్రంథంలో ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. సకల లక్షణసార సంగ్రహం ప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రంథాలయంలో ఉంది. (గ్రంథ సంఖ్య 3471.) ఇందులో ఎన్నో ప్రాచీన కావ్యాల నుండి ఉదాహరణపద్యాలు గ్రహింపబడ్డాయి.

**రాజరాజాభిషేకము**

అంగర నృసింహకవి (17 శ) ఈ ప్రబంధ కర్త. ఈతడు 1700 లకు తరువాతి వాడని వీరేశలింగంపంతులుగారూ, 1500 ప్రాంతం వాడని నిడుదవోలువారూ అభిప్రాయ పడుతున్నారు. వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రలోనూ, నిడుదవోలువారి ప్రబంధమణి భూషణ పీఠికలోనూ ఇందులోని

పద్యాలు మొత్తం పదమూడు ఉదాహరింపబడ్డాయి. (చూ:- అలబ్ధ కావ్యపద్య ముక్తావళి 107-111.) ఈ పద్యాలవల్ల ఈ కృతి కౌప్పుల వల్లభూపతికి అంకితమనీ, ఆతడు కొల్హాపుర నివాసి అనీ తెలుస్తుంది.

**రాజశేఖరచరిత్ర**

భర్తృహరి సుభాషిత రత్నావళిని తెలుగులో అనువదించిన ఏనుగు (చిన) లక్ష్మణ కవి తాతయైన ఏనుగు లచ్చకవి ఈ కృతి కర్త. ఈ కృతికి 'భల్లాణరాయ చరిత్ర' మనే నామాంతరం ఉన్నట్లుగా పండితులు భావిస్తున్నారు. (క. త. 12-166.) లచ్చకవి మనుమడు లక్ష్మణకవి తన జాహ్నవీ మాహాత్మ్యంలో రాజశేఖరచరిత్రను పేర్కొన్నాడు.

**రాజశేఖరవిజయము**

బొడ్డపాటి కొండయ తిరుకాళహస్తి శతకాన్ని, బొడ్డపాటి పేరయ మల్లికార్జున శతకం, సూర్యశతకం, అనంతమహత్త్వం, మంగళగిరి విలాసం, పద్మినీవల్లభం, శంకర విజయం రచించినట్లుగా జగ్గన ప్రబంధ రత్నాకరం వల్ల తెలుస్తుంది. (చూ: ప్రబంధరత్నావళి, పుటలు 23; 60-64) ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో బొడ్డపాటి రాజశేఖర విజయమని మాత్రమే ఉండడంవల్ల ఈ కృతికర్త బొడ్డపాటి కొండయో లేక పేరయో కావచ్చునని డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు అభిప్రాయపడుతున్నారు. (చూ: సాహిత్య సంపద, 286 పు).

**రాజేంద్రచోళచరిత్ర**

ఇది చారిత్రిక పద్యకావ్యం. మైసూరు సామంతరాజ వంశానికి చెందిన సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి (1614-1630) ఈ కృతి కర్త. (చూ. కుమారార్జునీయం.) తమ్మభూపతి సంస్కృతాంధ్ర కర్ణాటక భాషా త్రయ ప్రబంధనిర్మాణధురీణుడు. మూడు భాషల్లో గ్రంథాలు రచించినాడు.

**రాధామాధవము**

విజయరాఘవ నాయకుడు రచించిన యక్షగానాల్లో ఒకటి. ఈతని ప్రహ్లాద చరిత్రలో దీని ప్రసక్తి ఉంది.

**రామకృష్ణ (విజయము) చరితము**

మరింగంటి సింగరాచార్యులుగారు తానీ ద్వ్యర్థి కావ్యాన్ని పదమూడో ఏట రచించినట్లుగా సీతాకల్యాణకావ్యం అవతారికలో చెప్పుకున్నాడు.

రమణ వదనూడునేండ్లను రామకృష్ణ
చరితమెల్ల తదీయ సంశ్లేషమొదవ
నాంధ్రభాషగ విరచించితౌర భువిని
శబ్దశాసనబిరుదాంకశాలి వగుచు. (1.16).

ఈ రచనవల్ల సింగరాచార్యులకు శబ్దశాసన బిరుదం లభించినట్లుగా భావించవచ్చు. దీనికి రామకృష్ణవిజయమనే వ్యవహారంకూడా ఉన్నది.

**రామకృష్ణవిజయము**

చూః రామకృష్ణచరితము.

**రామచంద్రోపాఖ్యానము**

రేవణూరి వేంకటార్యుడు రచించిన శకుంతలా పరిణయ కావ్యంలోని 'రేవణూరి వంశపయః పాథోధి సుధాధామ రామచంద్రోపాఖ్యాన ప్రబంధ సంధాన, విద్వత్ప్రచండ తిరుమల కొండయాభిధబుధాగ్రణీ తనూభవ' అనే ఆశ్వాసాంత గద్యంలోని విశేషణాన్నిబట్టి ఈ కృతికర్త రేవణూరి తిరుమల కొండయార్యుడని తెలుస్తుంది. ఈతడు సంకీర్తనాచార్యుడైన అన్నమాచార్యునికి అల్లుడు. రేవణూరి వెంకటార్యుడు తిరుమల కొండయార్యుని కుమారుడు.

**రామలింగశతకము**

'రాజహంస రథాంగ! శ్రీరామలింగ' అనే మకుటంతో రచింపబడిన శతకం. ఎలుకుర్తి రామరాజు ఈ శతక కర్త. ఇందులోని ఒక సీసపద్యం ప్రబంధ రత్నాకరంలో పేర్కొబడింది. (చూః ప్రబంధ రత్నావళి - 90 పు.) లభ్యమైన ఈ పద్యంలో ఈశ్వరుని అర్ధనారీశ్వరరూపం మనోహరంగా వర్ణింపబడింది.

**రామస్తవరాజము**

అల్లసాని పెద్దన కృతంగా ప్రసిద్ధం.

**రామానుజచరిత్ర**

విశిష్టాద్వైత మత ప్రవర్తకుడైన శ్రీమద్రామానుజుల చరిత్రను వివరించే ప్రబంధం. శేషం వెంకటపతి శశాంక విజయ కావ్యాన్ని అంకితం పొందిన వంగల సీనయ్య ఈ ప్రబంధ కర్త. ఈ విషయం 'శశాంక విజయ కావ్యావతారికలోని 'రామానుజ దివ్యచరిత్ర ప్రబంధ సాహితీ మోహితానల్ప సంతోష విశంకట వేంకట నగాధీశ్వరుండు' అనే వాక్యంవల్ల తెలియవస్తుంది. ఈ కృతి వేంకటేశ్వరునికి అంకితం.

**రామాభ్యుదయము**

మరింగంటి సింగరాచార్యులు (18 శ.) ఈ కృతికర్త.

**రామాయణము**

విక్రమార్క చరిత్రను అంకితం స్వీకరించిన సిద్దన మంత్రిని జక్కన కవి 'శ్రీమద్వాణీవిలాస జిహ్వాగ్రతలా' (1 - 1) కవితాకారా (8.124) రామాయణ సుప్రలాప రసికకలాపా (2 - 261) అని తన విక్రమార్క చరిత్రలో సంబోధించడంవల్ల సిద్దన మంత్రి మంచి కవియని, రామాయణాన్ని రచించినాడనీ చెప్పవచ్చు. సిద్దన తన రామాయణానికి ఏ నామకరణం చేసినాడో తెలియదు. కనుక అంతవరకు దీనిని రామాయణమనే చెప్పు కుందాం. సిద్ధనమంత్రి రామాయణాన్నే కాక అనేక నవ్య కావ్యాలు రచించి నట్లుగా విక్రమార్కచరిత్రలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చగా నొనర్చె (1-50)

ఈ నవ్యకావ్యాలేవో తెలియరాదు.

**రామాయణము**

వారణాసి లక్ష్మీపతి ఈ కృతిని రచించినట్లుగా ఈతని మేనల్లుడు శ్రీపాద వేంకటాచల కవి తన రామకృష్ణోపాఖ్యానమనే ద్వ్యర్థి కావ్య అవతారికలో పేర్కొన్నాడు.

ఆదికవివిరచిత కావ్యమాదికాండ
ముల కథ దెలుంగుబాసచే లలి ప్రబంధ
మాదరముతోడ గూర్చిన నాదు మేన
మామను సదావరిత మేనమామను మది

రామకృష్ణోపాఖ్యానం ప్రతి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండా గారంలో ఉంది.

**రామాయణము**

'ఆంధ్ర కవి పితామహ' బిరుదం పొందిన కొరవి సత్యనారన కవి రామాయణాన్ని రచించినట్లుగా కొరవి గోపరాజు 'సింహాసనద్వాత్రింశిక' అవతారికలోని కిందిపద్యంవల్ల తెలుస్తుంది.

రామాయణ కృతి కృతియై
తా మెఱయుచు సంద్రకవిపితామహుఁడనగా
భూమిని మించిన భీమన
నామంబున బరగ సత్యనారన ఘనుడై (1.49)

సత్యనారన కొరవి గోపరాజుకు పినతాత. క్రీ. శ. 1380 ప్రాంతానికి చెందినవాడు. ఈ రామాయణంలోని ఒక పద్యమైనా మనకు లభించలేదు.

**రామాయణము**

అన్నమాచార్య చరిత్రలో అన్నమాచార్యుల రచనలను పేర్కొంటూ 'విన్నన్న' ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున, నవముగా" (పుట-45, 46) రామాయణాన్ని ద్విపదకావ్యంగా రచించినట్లుగా పేర్కొన్నాడు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణం అనుబంధంలోని హెచ్చుగానున్న ద్విపదలు అన్నమాచార్య ద్విపద రామాయణంలోవి కావచ్చునని నిడుదవోలువారు అభిప్రాయపడినారు. (వరదరాజ రామాయణ పీఠిక; 32 పుట.) రంగనాథ రామాయణంలో పరిశిష్టంగా ఇవ్వబడ్డ ద్విపదల్లోని పలుకుబడి, భావసంపద మొదలైన అంశాలు అన్నమాచార్యుల రామాయణ సంబంధి కీర్తనల్లో పుష్కలంగా ఉండడం వల్ల వీటిలో కొన్నైనా అన్నమయ్య ద్విపద రామాయణంలోని పంక్తులు కావచ్చునని డా॥ వేటూరి ఆనందమూర్తి గారు అభిప్రాయపడ్డారు. (భారతి. ఏప్రిల్ 1963.)

**రామాయణము**

ఆంధ్రకాళిదాస బిరుదాంచితుడైన ఆలూరి కుప్పన కవి ఈ యక్షగానాన్ని రచించినట్లుగా అతని ఆచార్యవిజయకావ్యావతారికలో చెప్పబడింది.

**రామాయణము**

కథాశకవి అని కీర్తిగన్న కుందుర్తి వేంకటాచలకవి (18 శ.) రామాయణాన్ని వచనంలో రచించినట్లు అతని మిత్రవిందా పరిణయం అవతారిక వల్ల తెలుస్తుంది. (చూ: భాగవతము.)

**రామాయణము**

ఎఱ్ఱాప్రెగడ ఈ రామాయణ కర్త. 'వల్మీక భవు వచో వైఖరి రామాయణంబు ప్రాంధ్రప్రబంధంబు జేసె' అని చెదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రలో ఎఱ్ఱన రామాయణాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.

నేటికీ ఈ రామాయణ ప్రతి లభించలేదు. పదిహేనో శతాబ్దికి చెందిన కూచిమంచి తిమ్మకవి లక్షణసార సంగ్రహం ఎఱ్ఱన రామాయణంలోని పద్యాలను ఉదాహరించిన మొదటి లక్షణ గ్రంథం. అప్పకవీయం, మొదలైన అనేక లక్షణ గ్రంథాల్లో ఎఱ్ఱన రామాయణంలోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కొన్నింటిని ఎఱ్ఱన పద్యాలుగా గుర్తించినారు. ఎఱ్ఱన రామాయణంలోనివిగా మన కిప్పుడు తెలియవస్తున్న మొత్తం పద్యాలు యాభై. (చూ. అలబ్ధకావ్య పద్య ముక్తావళి, పుటలు 24-35) ఈ రామాయణం ప్రోలయ వేమారెడ్డికి అంకితం.

**రామాయణము**

ఆరవీటి తిరుమలరాజు ఈ ద్విపద రామాయణ కర్త. ఇది విరూపాక్ష దేవునికి అంకితం కావింపబడింది. (స. అం. సా. 10–199)

**రామాయణము**

బసవకవి ఈ రామాయణాన్ని రచించినట్లుగా కావలి వెంకటరామస్వామి తెలిపినారు. ఇది సంస్కృత మూలానికి ప్రశస్తమైన అనువాదమట.

**రామాయణము**

చిత్రకవి వెంకటరమణకవి (16 శ.) ఈ కృతికర్త.

**రామాయణసంగ్రహము**

చూ: సంగ్రహరామాయణము

**రాసక్రీడలు**

విజయ రాఘవ నాయకుడు ఈ యక్షగాన కర్త. తానీ కృతిని రచించినట్లుగా ఈతడు తన ప్రహ్లాదచరిత్రలో చెప్పుకున్నాడు.

**రుక్మాంగదచరిత్ర**

చెదలువాడ మల్లన (1585) ఈ ద్విపద రుక్మాంగద చరిత్రకర్త. కొండవీటి ప్రభువు బాచమరుసయ్యకు ఈ కృతి అంకితం. ఇందులోని రెండు పాదాలు అప్పకవీయంలో ఉదాహృతాలు (3. 229) మల్లన పద్య రూపంగా కూడా రుక్మాంగద చరిత్ర రచించినాడు. ఇది లభ్యమే. ద్విపద కృతి మాత్రం అలభ్యం.

**రుక్మిణీకల్యాణము**

విజయరాఘవనాయకుడు ఈ యక్షగానకర్త.

**రుక్మిణీకృష్ణ వివాహము**

విజయరాఘవనాయకుడీ యక్షగానకర్త అనీ, దీనిని రఘునాథుని ఆస్థానంలో విరిబోండ్లు వినిపిస్తుండేవారనీ తెలుస్తుంది.

**రుక్మిణీనాటకము**

తరిగొండ వెంగమాంబ ఈ కృతిని రచించినట్లుగా తన ద్విపద భాగవతం అవతారికలో చెప్పుకున్నది.

నిరుపమ శ్రీ రుక్మిణీనాటకంబు
విరచించి భక్తితో....

**రుక్మిణీపరిణయము**

కృతికర్త పేరు తెలియదు. పూసపాటి కృష్ణమరాజుకు అంకితం. శ్రీకృష్ణ విజయ ప్రబంధం ద్వారా ఈ కావ్యం గురించి తెలుస్తుంది. విజయ నగరాన్ని పరిపాలించిన గజపతిరాజు తమ్మిరాజు శ్రీకృష్ణ విజయ ప్రబంధ కర్త (1620.1700)

**రుక్మిణీపరిణయము**

వడకండ్ల గురురాజకవి ఈ కృతిని రచించినట్లుగా ఆతని శేషధర్మము లనే గ్రంథంవల్ల తెలుస్తుంది.

**రుక్మిణీపరిణయము**

ఈ కావ్యకర్త లింగనమఖి శ్రీ కామేశ్వర కవి ఈతడు 17వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందినవాడు. ఈతడు రుక్మిణీ పరిణయం కావ్యాన్ని రచించి నట్లుగా ఈతని సత్యభామా సాంత్వన కావ్యంలోని కింది అవతారికా పద్యంవల్ల తెలుస్తుంది.

అనువుగ రుక్మిణీపరిణయంబున మున్ హవణించి యార్యులౌ
నన దనియించినావు మము నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించు మీ సొగసు పోడిమి మీఱగ సత్యభామ సాం
త్వనమన గప్పురంపు చలువన్ గెలువన్ దిరుకామసత్కవీ.

ఈతని గ్రంథాలలో రుక్మిణీపరిణయం తొలి గ్రంథం. ఈ కావ్యాన్ని మధురరాజైన ముద్దళగిరి ప్రభువునకు అంకితమిచ్చినట్లాతని ఈ క్రింది పద్యం తెలుపుతుంది.

తనదు దక్షిణ నాయకత్వమున కుచిత
ముగను ముద్దశిఖరి శౌరి ముదము మీద
సవతి రుక్మిణీపరిణయంబందుకతన
దా నిపుడు సత్యభామ సాంత్వనముగోరె.

ఈతడు రచించిన ధేనుమాహాత్మ్యం వచన వాఙ్మయంలో తొలి గ్రంథ మని పండితుల అభిప్రాయం.

**రుక్మిణీపరిణయము**

ఈ ప్రబంధాన్ని రచించిన కవి ఎవ్వరో తెలియదు. ఈ కృతిని విజయ నగర గజపతి రాజైన కృష్ణరాజు అంకితం తీసుకున్నట్లుగా శ్రీ కృష్ణ విజయ కావ్యావతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

భాసుర రుక్మిణీపరిణయాఖ్య ప్రబం
 ధమునకు నాయకత్వము వహించె
 (చూ: గజపతిరాజుల తెలుగుసాహిత్యపోషణము 75, 76 పుట)

**రుద్రమహిమ**

పండితారాధ్యుడీ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమన పండితా రాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. (వాదప్రకరణం, దీక్షాప్రకరణం.)

**రేవతీపరిణయము**

మద్దికాయల మల్లయ ఈ కృతి కర్త. ఈ కావ్యంలోని మూడు పద్యాలు జగ్గన ప్రబంధరత్నాకరంలో ఉదాహరింపబడ్డాయి. (చూ:- ప్రబంధ రత్నా వళి 73, 74 పుటలు)

**లక్కాభట్ల ఛందము**

ఉభయకవి లక్కాభట్లు ఛందోగ్రంథం రచించినట్లు లక్షణ శిరోమణి వల్ల (4 - 16) తెలుస్తుంది. అందులో 'లక్కాభట్లు రచింపన్ వెలయు ఛందమ'ని మాత్రమే ఉండడం వల్ల ఆ ఛందోగ్రంథం పేరు స్పష్టంగా చెప్పలేం. ఈతనికి క్షేమేంద్రుడనే బిరుదనామం ఉంది.

**లక్షణతిలకము**

లింగమగుంట రామన్న (16 శ.) ఈ ఛందః కర్త. ఇందులోని ఐదు పద్యాలు పొత్తపి వెంకటరమణకవి లక్షణశిరోమణిలో ఉదాహరింపబడ్డాయి. దీనికి లక్షణసారమనే నామాంతరం ఉంది.

**లక్షణవిలాసము**

పెనుమర్తి వెంకటార్యుడు (16 శ.) ఈ కృతిని రచించినట్లుగా అప్పకవీయంవల్ల తెలుస్తుంది.

**లక్షణశిరోమణి**

యాదవామాత్యచ్ఛంద మనే ఛందో గ్రంథానికి లక్షణ శిరోమణి అనేది నామాంతరం. (చూ. యాదవామాత్యచ్ఛందము)

**లక్షణసారము**

నన్నయ ఈ ఛందో గ్రంథాన్ని రచించినట్లుగా ప్రతీతి ఉంది. కాని దీనికి సరైన ఆధారాలు మాత్రం లేవు.

**లక్షణసారము**

లింగమగుంట రామన్న రచించిన లక్షణతిలకానికి లక్షణసారమనే నామాంతరం ఉంది. (చూ: లక్షణతిలకము.)

**లక్షణాదేవికల్యాణము**

లోకేరావు సోమన (17 శ) ఈ యక్షగానాన్ని రచించినట్లు ఈతని బలభద్రవిజయకావ్యం అవతారికవల్ల తెలుస్తుంది.

**లక్ష్మీనారాయణసంవాదము**

ఈ గ్రంథ రచయిత యెవ్వరో తెలియదు. ఖడ్గ లక్షణ శిరోమణిలో తత్కర్త నవనప్ప ఖడ్గానికి ప్రత్యేకంగా లక్ష్మీనారాయణ సంవాదంలో లక్షణాలు చెప్పబడియున్నట్లుగాను, తాను దానిననుసరించినట్లుగాను పేర్కొన్నాడు. కనుక ఇది ఖడ్గలక్షణాలను తెలిపే గ్రంథం అని భావించవచ్చు.

**లక్ష్మీపరిణయము**

ఈ కావ్య కర్త పేరు తెలియదు. ఇందులోని రెండు పద్యాలు ప్రబంధసార శిరోమణిలో పేర్కొనబడ్డాయి. (పుట 2) ఉద్యాన వర్ణన వీటిలోని వస్తువు. ఈ రెండు పద్యాలు నన్నెచోడుని కుమారసంభవంలో కనిపిస్తున్నాయి.

**లక్షణావివాహము**

ఇది తుమ్మూరి శరభరాజ కవిచే రచింపబడ్డ కావ్యం. ఇందులో వివాహ వర్ణన ప్రధానవస్తువు (చూ: కాళిందీపరిణయము.)

**లింగపురాణము**

కామినేని ఎల్లారెడ్డి ఈ కృతికర్త, ఈతని సోదరుడైన కామినేని మల్లారెడ్డి రచించిన 'శివధర్మోత్తర'మనే కావ్యం వల్ల ఈ కృతిని గురించి తెలుస్తుంది. దీనికి లైంగధర్మమనేది నామాంతరం కావచ్చునేమో! శివధర్మోత్తరంలో ఎల్లారెడ్డి వాసిష్ఠలైంగ ధర్మాన్ని రచించినట్లు పేర్కొన్నాడు. ఇవి రెండు వేర్వేరు గ్రంథాలా ఒకే గ్రంథమా అనే విషయం నిర్ధారితం కాలేదు.

**లైంగధర్మము**

కామినేని ఎల్లారెడ్డి రచించిన లింగపురాణానికి లైంగధర్మమనేది నామాంతరం కావచ్చునని పండితుల ఊహ. (చూ: లింగపురాణము.)

**వంశావళి**

చిత్రకవి అనంతకవి (1580) ఈ కృతిని రచించినట్లుగా అతని కుమారుడు చిత్రకవి వెంకట రమణకవి రచించిన సాంబోపాఖ్యానం వల్ల తెలుస్తుంది. (చూ: ఇందుమతీపరిణయము)

**వచనభాగవతము**

ఈ కృతికర్త కుందుర్తి వెంకటాచలకవి. 18 వ శతాబ్దికి చెందినవాడు. వెంకటాచలకవి భాగవతాన్నే కాక రామాయణ, భారతాలను కూడా వచనంలో రచించినట్లుగా అతని మిత్రవిందా పరిణయ కావ్యావతారికలోని ఈ కింది పద్యంవల్ల తెలుస్తుంది.

వచనకావ్యములుగా రచించినారు భా
రత, భాగవతములు రామకథయు (1 - 39)

**వచనభారతము**

కుందుర్తి వెంకటాచలకవి ఈ కృతికర్త. ఈతడు భారత, భాగవత, రామాయణాలను మూడింటిని వచనంలో రాసినాడు. ఈ మూడూ నేడు అలభ్యాలే. (చూ: భాగవతము).

**వచనరామాయణము**

కుందుర్తి వేంకటాచలకవి ఈ కృతికర్త. ఈతడు భారత, భాగవత, రామాయణాలను మూడింటిని వచనంలో రాసినాడు. (చూ: వచనభాగవతము.)

**వజ్రపంజరశతకము**

ఈ శతకం పట్టాభిరామకవి కృతమని శతకకవుల చరిత్ర తెలుపుతుంది. ఇందులోని పద్యాలు అ.క; సు.మ రం., ఆ రం.ఛం. మొదలైన లక్షణ గ్రంథాల్లో ఉదాహరింపబడ్డాయి. ఈ శతకంలోని పద్యాలు మొత్తం తొమ్మిది లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి. 117 - 119 పుటలు.) శరణాగతవజ్రపంజరా! అనేది ఇందులోని మకుటం.

**వజ్రభుజోపాఖ్యానము**

భానుమద్విజయ కావ్య కర్తయైన వెలగపూడి కృష్ణయ వంశీయునిచే రచింపబడ్డ కావ్యం. ఈ కావ్య కర్త పేరు తెలియదు. (చూ: గాంగేయోపాఖ్యానము.)

**వజ్రాభ్యుదయము**

నెల్లుట్ల నారాయణకవి (1600) ఈ ప్రబంధాన్ని రచించినట్లుగా, దీని జీర్ణప్రతి బమ్మెరలో నెల్లుట్లవారి దగ్గర ఉన్నట్లుగా గోలకొండ కవుల సంచికలో పేర్కొబడింది. ఈతడు పోతన వంశానికి చెందినవాడట. ఈ కావ్యంలోని రెండాశ్వాసాల గ్రంథభాగం ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయంలో ఉన్నదని ఆంధ్రకవి సప్తశతిలో పేర్కొబడింది (111 పుట)

**వరదరాజస్తుతి**

మరింగంటి కవులలో సుప్రసిద్ధుడైన సింగరాచార్యులు ఈ కృతికర్త. సింగరాచార్యులీ కృతిని తన తొమ్మిదో యేట రచించినట్లుగా తన సీతాకల్యాణ కావ్యంలో చెప్పుకున్నాడు.

సిరులతొమ్మిది యేండ్ల 'వరదరాజస్తుతి'
శ్రీరంగశతకంబు చెప్పినావు (1 - 1)

**వల్లీపరిణయము**

నెల్లూరి వీరరాఘవకవి (1680-1740) ఈ కావ్య కర్త. ఈతడు సంస్కృతాంధ్రాల్లో సుమారు అరవై గ్రంథాలు రచించిన కవీశ్వరుడు. ఈతడు రచించిన గ్రంథాలు కొన్ని ఈతని వసుంధరాపరిణయకావ్యంవల్ల తెలుస్తున్నాయి.

**వసంతతిలక[illegible]ము**

[illegible] సంస్కృతంలోని వసంతతిలకభా[illegible]వరపు వేంకటకవి రచించిన తెనుగు అనువాద గ్రంథమని అ[illegible]రాజ వేంకటేశ్వర విజయవిలాస అవతారికలోని కింది పద్యంవల్ల [illegible]ంది.

వాణీవీణా నిక్వణ
పాణింధమపదనిబంధ బంధురఫణితుల్
రాణింప "వసంతతిలక
బాణము" దెనుగించి కీర్తి బడసిన సుకవిన్ (47 ప.)

**వసంతవిలాసము**

అ. క., ల. సా. సం., సు. ఛ. రం., ల. శి. మొదలైన లక్షణ గ్రంథాలవల్ల నాచన సోమన వసంతవిలాస కావ్యాన్ని రచించినట్లుగా తెలుస్తుంది. ఇందులోని నాలుగు పద్యాలు సంపూర్ణంగానూ, ఒక పద్యం ఒక పాదమూ లభిస్తున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి 120, 121 పు.)

**వసుచరిత్రవ్యాఖ్య**

చిత్రకవి వెంకటరమణ కవి (17 శ) వసుచరిత్రకు వ్యాఖ్య రాసినట్లుగా ఆతని సాంబ విలాసం అనే కావ్యంలోని 'రాఘవ పాండవీయ, విష్ణుచిత్తీయ, వసుచరిత్ర ప్రముఖ దీవ్యత్కావ్యార్థ బోధన సమర్థుడ'ననే వాక్యం వల్ల తెలుస్తుంది. ఈతడు చిత్రకవి అనంతయ్య కుమారుడు. (చూ: విష్ణుచిత్తీయ వ్యాఖ్య)

**వాదాంగచూడామణి**

ఈ కృతి మల్లన రచితంగా ఆనందరంగ రాట్ఛందం వల్ల తెలుస్తుంది. బాలబోధ ఛ్ఛందస్సులోనూ, సులక్షణసారంలోనూ ఇందులోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి.

**వాణీవిలాసము**

సుకవి మనోరంజనం, ఆనందరంగరాట్ఛందం, సకల ల[illegible] సంగ్రహం మొదలైన లక్షణ గ్రంథాల్లో ఈ కృతి నంది తిమ్మన [illegible] పేర్కొబడింది. ఇందులోని ఒక్క పద్యం మాత్రమే మనకు లభ్యమౌ[illegible] (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి. 122 పు.)

**వామనచరిత్ర**

ఈ కృతికర్త యెవ్వరో తెలియదు. లక్షణ శిరోమణిలో ఈ కావ్యంలోని ఒక పద్యం ఉదాహరింపబడింది. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి. 123 పుట).

**వామనపురాణము**

లింగమకుంట రామకవిచే రచింపబడ్డ కృతి. ఇది సంస్కృత వామన పురాణానికి అంధ్రీకృతి. (చూ: మత్స్యపురాణము.)

**వామనపురాణము**

ఎలకూచి బాలసరస్వతి (17 శ.) ఈ పురాణాన్ని రచించినట్లుగా అతని 'బాలసరస్వతీయ టీక' అవతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది:

చంద్రావరిణయాది సత్కృతిస్రష్టను
ద్రవిడవామనపురాణ ప్రబంధ
భ్రామరీ గీత ప్రబంధౌఘ కర్తను
దక్షిణ కాశికాతంత్ర చూడ.

చంద్రికాపరిణయం అవతారికలో కూడా ఈ పురాణప్రసక్తి ఉన్నది.

**వాలేశుపదములు**

మల్లికార్జునపండితుడు చెప్పిన శైవమతపరమైన పదాలు.

**వాసవదత్త**

ఇది వక్కలంక వీరభద్రకవిచే రచింపబడిన కావ్యం. ఈతడు కదురు వల్లి భవానీశకవికి మిత్రుడు. ఈ కావ్యం రావు మాధవశౌరికి అంకితం చేయ బడింది. వత్సరాజు- వాసవదత్తల వృత్తాంతం ఇందులో ప్రబంధరీతిలో వర్ణింప బడి ఉంటుంది. ఈ కావ్యానికి, కవికి సంబంధించిన వివరాలు కదురు వల్లి భవానీశకవి రచించిన శృంగారమంజరి అవతారికలోని కింది పద్యం వల్ల తెలుస్తున్నాయి.

అభియాతి మానవప్రవరమౌళి మణిఘృణి రాజినీరాజితరాజితాంఘ్రి
నీరేరుహుండైన శ్రీ రావు మాధవ రాయశౌరికి నతిప్రౌఢరీతి
వాసవదత్తాది భాసురకృతు లనేకములొనరించి తత్కరుణచేత
హారకేయూరాగ్రహార విస్ఫార తురంగముల్ రంగుమీఱంగ నంది
సకల సుకవీశ్వరాంభోజనికర హేళి
యై యలరు వక్కలంకాన్వవాయ కలశ
జలధిశశి వీరభద్రు మత్సఖు నుతించి
తదనుమతిఁ గృతియొనరింతు ముదముతోడ.

**వాసవాభ్యుదయము**

ఆంధ్ర ప్రబంధ రత్నాకరంలో గణపవరపు వేంకటకవి ఈ కృతిని శ్రీనాథకృతంగా పేర్కొంటూ ఇందులోని ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. (చూ: అలభ్య కావ్యపద్య ముక్తావళి 125 పుట.) శ్రీనాథుడు వాసవాభ్యుదయ కావ్యాన్ని రచించినట్లుగా ఆధారాలేమీ కానరావు.

**వాసిష్ఠము**

దోమకొండ సంస్థానాధీశ్వరుల్లో ఒకరైన కామినేని ఇమ్మడి మల్లారెడ్డి (1500 - 1600) ఈ కృతిని రచించినట్లుగా ఆతని తమ్ముడు మల్లారెడ్డి రచించిన శివధర్మోత్తరంలోని

''....ఎల్లభూకాంతుడు 'వాసిష్ఠ
లైంగ ధర్మము' రామలింగమునకు
నంకితంబొనరించె''

అనే అవతారికా పద్యభాగంవల్ల తెలుస్తుంది. వాసిష్ఠలైంగ ధర్మం ఒకే గ్రంథమా లేక రెండు గ్రంథాలా అన్నది తేలని ప్రశ్న అని ఆరుద్రగారు పేర్కొన్నారు. ఈ గ్రంథం లభిస్తేగాని ఈ ప్రశ్న తేలదు

**విక్రమసేనము**

చిమ్మపూడి అమరేశ్వరుడు ఈ కావ్య కర్త. కొరవి గోపరాజు, అనంతామాత్యుడు, రామరాజ భూషణుడు, కూచిమంచి జగ్గకవి మొదలైన కవులచే ఈతడు స్తుతింపబడినాడు. గోపరాజుచే స్తుతింపబడినాడు కనుక ఈతడు 15 శ. కి పూర్వుడని చెప్పవచ్చు. సంకలన గ్రంథాలైన ప్రబంధ రత్నాకరం, ఉదాహరణ పద్యాలలో ఇందులోని పద్యాలు ఉదాహరించబడ్డాయి. వివిధ ఆకరాల వల్ల విక్రమసేనంలోని పద్యాలు మొత్తం 66 లభ్యమౌతున్నాయి. వీటిలో కొన్ని విక్రమసేనంలోవి కావు. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి 126-148 పుటలు.)

**విక్రమార్క చరిత్రము**

కవి భల్లటుడు ఈ కావ్యాన్ని రచించినట్లుగా గోలకొండ కవుల సంచికలో (396 పు.) పేర్కొనబడింది. వీరేశలింగం పంతులుగారు ఇందులోని ఒక పద్యాన్ని తమ కవుల చరిత్రలో ఉదాహరించినారు. (పు 713 1 సం.) ఆంధ్రకౌముదిలో భల్లటకవి విక్రమాదిత్య చరిత్రలోనిదిగా ఒక పద్యపాదం కనిపిస్తుంది. (చూ. అలబ్ధకావ్యపద్యముక్తావళి 149 పు.)

**విజయరాఘవాభ్యుదయము**

విజయరాఘవనాయకుని కుమారుడైన మన్నారుదేవుడు తన తండ్రి చరిత్రను నిబంధించిన ప్రబంధం. మన్నారుదేవుడు క్రీ. శ. 1650-1674 మధ్యకాలానికి చెందినవాడు. ఈతడీ ప్రబంధాన్ని రచించినట్లుగా ఆతని

హేమాబ్జనాయికాస్వయంవరం భరతవాక్యంలోని "విజయరాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధన చాతురీధౌరేయుండును" అనే వాక్యంలో పేర్కొనబడింది.

**విజయరామభూషణము**

విష్ణుభక్తి సుధాకరం అవతారికలోని "భూరివిజయ రామ భూషణ కృతి నందె నగ్రహారములు విప్రాళి కిచ్చె" అనే పద్యభాగాన్ని బట్టి విజయరామ భూషణకృతిని గురించి తెలుస్తుంది. (చూ: ఆం సం సా. పుట 415.)

**విజయవిజయము**

ఈ కృతి చిమ్మపూడి అమరేశ్వర కవికృతంగా ఆంధ్ర ప్రయోగరత్నాకరంవల్ల తెలుస్తుంది. ఇందులోని ఒక్క పద్యం మాత్రమే లభ్యమౌతుంది. (చూ: అలబ్ధకావ్య ముక్తావళి, 202 పు)

**విజయరామ శతకము**

సింహాద్రి నారసింహ శతకకర్తయైన గోగులపాటి కూర్మనాథకవి ఈ శతకకర్త. "విజయరామా రామతీర్థాశ్రయా' అనేది ఇందులోని మకుటం. ఈ కవి విజయనగర సంస్థానంలో పెద విజయరామ గజపతి ఆశ్రయంలో ఉండినవాడు. కూర్మనాథ కవిపై అసూయ కలిగిన కొందరు లేనిపోని కథలు కల్పించి ప్రభువుల నాతడు తిరస్కారభావంతో చూస్తున్నట్లుగా రాజుగారికి తెలిపితే ఆయన తన కంకితంగా ఒక కృతిని రచించవలసిందిగా కూర్మనాథ కవిని కోరినాడట. తన నియమానికి భంగం రాకుండా, ప్రభువుకు అసంతృప్తి కలుగకుండా కూర్మనాథకవి 'విజయరామా రామతీర్థాశ్రయా' అనే మకుటంతో ఈ శతకాన్ని రచించినాడట. ఇందులోని లభ్యమైన మూడు పద్యాలను ఆరుద్రగారు తమ స. ఆం. సా. లో ఉదాహరించినారు. (287-288 పుటలు.)

**విజయసేనము**

తిక్కన విజయసేన మనే కావ్యాన్ని రచించినట్లుగా అప్పకవీయం, ఆంధ్ర ప్రయోగ రత్నాకరం మొదలైన లక్షణ గ్రంథాల వల్లా, ప్రబంధ రత్నాకరం, ఉదాహరణ పద్యాలు అన్న సంకలన గ్రంథాల వల్లా తెలుస్తుంది. వీటి ఆధారంగా ఈ కావ్యంలోని మొత్తం 17 పద్యాలు లభ్యమైనాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి (పుట 151.157.)

**విద్యుత్ప్రభావిలాసము**

తక్కెళ్ళపాటి లింగన ఈ యక్షగానాన్ని రచించినట్లుగా ఆతని ఉత్తర హరిశ్చంద్రకథవల్ల తెలుస్తుంది.

విద్యుత్ప్రభావిలాసమ్ము వేడ్క-
ఘటియించితిని యక్షగాన రీతి

**విభూతిమాహాత్మ్యము**

పోచిరాజు వీరన్న ఈ కృతి కర్త. తానీ కృతిని రచించినట్లుగా వీరన్న తన భల్లాణచరిత్రంలో పేర్కొన్నాడు.

**విరాటము**

సర్వదేవునిచే రచింపబడిన భారత విరాటపర్వ మీ కృతి. ఇందులోని ఒక పద్యం ఉదాహరణపద్యములనే సంకలన గ్రంథంలోనూ, మరొకటి ఛందోగ్రంథంలోనూ లభ్యమౌతుంది. (చూ:- ప్రబంధరత్నావళి - పుట 99, అలబ్ధకావ్యపద్యముక్తావళి 158 పుట.) కన్నడ కవియైన పొన్నకవియే ఈ సర్వదేవుడట.

**వివేకసింధువు**

వేదాంత ప్రతిపాదకమైన సంస్కృత వివేక సింధువుకు ఇది ముకుంద ముని రచించిన తెలుగు వచనానువాదం. దీని నాధారంగా చేసుకొని వివేక సింధువును పద్య కావ్యంగా రచించిన వేగినాటి కొండనార్యుడు తన కృతిలో ఈ వచన వివేకసింధువును గూర్చి తెలిపినాడు.

"సమంచిత భవాబ్ధి తరణంబులైన వేదాంత ప్రకరణంబులు సదానంద సాంద్రుడగు ముకుందమునీంద్రుడు నాంధ్రభాషను రచియించిన వచన కావ్యంబైన వివేకసింధువు నిరవద్య గద్య పద్యాత్మకంబుగా ప్రబంధంబు సేయ సమకట్టి''

**విశ్వామిత్రచరిత్ర**

సుభాషిత రత్నావళిని తెనిగించిన ఏనుగు లక్ష్మణకవి ఈ కృతికర్త. తానీ కృతిని రచించినట్లుగా ఈతని రామవిలాసకావ్యంవల్ల తెలుస్తుంది.

**విశ్వేశ్వరచ్ఛందము**

ఆనందరంగ రాట్ఛందంలోనూ, పొత్తపి వెంకటరమణకవి లక్షణ శిరోమణిలోనూ ఇందులోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. ఈ ఛందఃకర్త విశ్వేశ్వరుడు కావచ్చు. ఈతని కాలం స్పష్టంగా తెలియదు.

**విశ్వేశ్వరశతకము**

నిత్యానంద విశ్వేశ్వరా అనే మకుటం కలిగిన ఈ శతక కర్త విశ్వేశ్వరుడని తెలుపుతూ నిడుదవోలు వారు ఇందులోని ఒక పద్యాన్ని ఉదాహరించినారు. (ఆంధ్రపత్రిక, జయసంవత్సరసంచిక 1954-55 183 పుట.)

**విశ్వేశ్వరోదాహరణము**

సుభాషితరత్నావళిని తెనిగించిన ఏనుగు లక్ష్మణకవి ఈ ఉదాహరణ కర్త.

**విష్ణుకథానిధానము**

బైతరాజు ముమ్మయ ఈ కావ్యకర్త. ఇందులోని 14 పద్యాలు ప్రబంధ రత్నాకరంలో పేర్కొబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి, పుటలు 77-81.) ఇవిగాక మరో మూడు పద్యాలు ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో లభిస్తున్నాయి. (చూ: సాహిత్య సంపద, 311-12 పుటలు.) ఇందులోనివి మొత్తం 17 పద్యాలు లభ్యమైనాయన్నమాట.

**విష్ణుకాంచీమాహాత్మ్యము**

ఆంధ్రకవి రామయ్య ఈ కృతి కర్త. ఇందులోని పదకొండు పద్యాలు ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంలో ఉదాహరింపబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి, పుటలు 87-88.) ఇందులోని కవిస్తుతి పద్యంలో నాచన సోమన స్తుతింపబడడం వల్ల ఆంధ్రకవి రామయ్య 15 శతాబ్దికి చెందినవాడని భావించవచ్చు.

**విష్ణుచిత్తీయవ్యాఖ్య**

చిత్రకవి వెంకటరమణకవి (17శ) ఈ వ్యాఖ్యను రచించినట్లుగా పండితులు భావిస్తున్నారు. ఈతని సాంబవిలాస కావ్యం అశ్వాసాంత గద్యలోని "రాఘవపాండవీయ, విష్ణుచిత్తీయ, వసుచరిత్ర ప్రముఖ దివ్యకావ్యార్థ సమర్థ" అనే విశేషణం దీనికి సమర్థకంగా ఉంది. ఈతడు విష్ణుచిత్తీయానికే కాక రాఘవపాండవీయం, వసుచరిత్ర మొదలగు కావ్యాలకు కూడా వ్యాఖ్యలు రచించినాడని దీనివల్ల తెలుస్తుంది. (చూ: రాఘవపాండవీయవ్యాఖ్య.)

**విష్ణుధర్మోత్తరము**

కూచిరాజు తమ్మన ఈ పురాణ కర్త. తొట్టతొలితగా శేషధర్మములను ఆంధ్రీకరించిన తురిమెళ్ళ రామనకు స్నేహితుడేకాక అతనికి శేషధర్మాల

రచనలో తోడ్పడినాడట ఈ వివరాలను రామన శేషధర్మాల అవతారికతో పేర్కొన్నాడు.

చిత్తమునన్ దలంచి నుతి చేసెద మత్కృతికిన్ సహాయము
ద్యత్తరమైత్రి జేసిన మహామహు సత్కవులెంచ 'విష్ణుధ
ర్మోత్తర' ముఖ్య సత్కృతులనూన చమత్కృతి మీరఁజేయు న
త్యుత్తము భద్రిరాజకులధుర్యునిఁ దమ్మనసూరి వర్యునిన్.

భద్రిరాజు తమ్మన విష్ణుధర్మోత్తరమేకాక మరికొన్ని గ్రంథాలను కూడా రచించినట్లీ పద్యంవల్ల తెలుస్తున్నా ఆ గ్రంథాల పేర్లేమిటో తెలియవు. రామన శేషధర్మాలు అముద్రితం. దీని ప్రతి ఒకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ఉన్నది. (నెం. ఆర్. 620.) భద్రిరాజు వంశీయుడైన మల్లమంత్రి కవిపోషకుడై ఏనుగు లక్ష్మణకవిని ప్రోత్సహించి రామేశ్వర మాహాత్మ్యాన్ని రచింపచేసినాడు.

**విష్ణుపురాణము**

వెణుతురుపల్లి వేంకటకవి ఈ కృతి కర్తయైనట్లుగా ఈదులపల్లి భవానీశకవి రచించిన శృంగారమంజరిలోని కింది అవతారికాపద్యం వల్ల తెలుస్తుంది.

నయమొప్ప పిన్ననాటనుండియు నాంధ్రగిర్వాణభాషల (గృతులొనర్చె)
ప్రౌఢి శ్రీ విష్ణుపురాణాదికములును ధీవినుతంబుగఁ దెనుగు జేసె
నతని వర్ణింతు సేతు కాశ్యంతరాళ
సూరివరనుతచాతుర్య మేరుధైర్య
లలిత వెణుతురుపల్లి కులకలశజలధి
సూర్యు మోహన వేంకటసుకవివర్యు.

ఏనుగు లక్ష్మణకవికి వేంకటకవి మేనమామ కొడుకు. వెణుతురుపల్లి వారికి దిట్టకవి అనే బిరుదు ఉండడంవల్ల, క్రమంగా అది గృహ నామం కావడం వల్ల ఈతడు దిట్టకవి వేంకటకవిగా ప్రసిద్ధుడైనాడు. పై పద్యంలో ఈతడు విష్ణుపురాణాది గ్రంథాలు రచించినట్లుగా చెప్పబడినా అతని గ్రంథా

**విష్ణుపురాణము**

ఇది సంస్కృత విష్ణుపురాణానికి అనువాదం కావచ్చు. పశుపతి నాగనాథుడీ కృతి కర్త. ఇందులోని ఒకే ఒక పద్యం ఉదాహరణ పద్యము లన్న సంకలన గ్రంథంలో (14 శ.) ఉదాహరించబడింది. (చూ: ప్రబంధ రత్నావళి 41 పు.) పశుపతి నాగనాథుడు పశుపతి పండితుని పుత్రుడు. ఈతడే అయినవోలులోని అనపోతనాయకుని శాసనకవి.

**వీరరాఘవశతకము**

చేకుమళ్ళ రంగశాయి తిరువళ్లూరు వీరరాఘవస్వామిపై ఈ శతకం చెప్పినట్లుగా అతని వాణీవిలాసవనమాలిక అవతారికవల్ల తెలుస్తుంది.

**వీరభద్రచరిత్రము**

గార్లపాటి లక్ష్మణకవి (16 శ) వీర రస ప్రధానంగా ఈ కావ్యాన్ని రచించినట్లుగా పోశెట్టి లింగకవి రచించిన నవచోళ చరిత్ర అవతారిక వల్ల తెలుస్తుంది.

వీరభద్రేశుని విజయ సాహసము
వీరరసంబుగ విరచించి తానె
పాటికెక్కిన గార్లపాటి లక్ష్మణుని (1, 79 82)

**వీరభద్ర విజయము**

చక్రపాణి రంగనాథుడీ గ్రంథాన్ని రచించినట్లుగా వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చాటుపద్య మణిమంజరి (ద్వితీయ భాగము, ప్రథమ సంపుటము పుట 80) లో పేర్కొన్నారు.

**వీరమాహేశ్వరము**

శివలీలా విలాస మనే కృతిని రచించిన నిశ్శంక కొమ్మన ఈ కృతి కర్త. శివలీలా విలాసానికే వీరమాహేశ్వరమనే నామాంతర మున్నదేమో! ఐతే ఇది గ్రంథాంతరం కాజాలదు. ఇందులోని మొత్తం పద్నాలుగు పద్యాలు ఉదాహరణ పద్యాలు అన్న సంకలన గ్రంథంలో ఉదాహరించ బడ్డాయి. (చూ: ప్రబంధరత్నావళి 24-26 పుటలు.)

**వీరశృంగారసాంగత్యము**

విజయరాఘవ నాయకుడీ కృతిని రచించినట్లు ఆయన ప్రహ్లాద చరిత్ర యక్షగాన అవతారికలోని 'సారమౌ వీరశృంగార సాంగత్యంబు మెర

యించు రసికుల మేలు బంతి' అనే పద్య పాదం వల్ల తెలుస్తుంది. యక్షగాన రచనా భేదమైన 'సాంగత్య' మనే క్రొత్త ప్రక్రియలో రచింపబడిన రచన. కన్నడ భాషలో సాంగత్య రచన ఉన్నది. దీనిలో ద్విపద కన్న ఒక మాత్ర అధికంగా ఉంటుంది. వీర శృంగార రసాల సమ్మేళనంతో ఈ కృతిలో వర్ణించిన ఇతివృత్త మేమిటో తెలియదు.

**వీరసంగయ్యదేవ చరిత్రము**

ఇది ద్విపద కృతి. పోశెట్టి లింగకవి ఈ కృతి కర్త. 15 వ శతాబ్ది చివరి భాగానికి చెందినవాడు. లింగన ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఆతని నవ చోళచరిత్ర తెలుపుతుంది.

**వేంకటమాహాత్మ్యము**

లింగమకుంట రామకవిచే రచింపబడిన మాహాత్మ్య కావ్యం. ఇందులో వేంకటాచల మాహాత్మ్యం వర్ణ్యాంశం కావచ్చు. (చూ: మత్స్యపురాణము.)

**వేంకటవిలాసము**

ఈ కావ్యకర్త ఎవ్వరో తెలియదు. వసంత వర్ణన పరమైన ఒక్క పద్యం మాత్రం ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో లభిస్తున్నట్లుగా డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు పేర్కొన్నారు. (చూ. సాహిత్యసంపద 284-285 పుటలు.)

**వేడుకోలువిన్నపములు**

'గోపాలునకు వేడుకోలు విన్నపములు దరువులొనర్చు నౌదార్య ధుర్య' అనే ప్రహ్లాద చరిత్ర నాటకంలోని అవతారికా పద్యపాదంలో విజయ రాఘవ నాయకుడు తానీ కృతిని రచించినట్లుగా చెప్పుకున్నాడు. శ్రీకృష్ణుని వేడుకుంటూ చేసిన విన్నపాలు ఇందులోని వస్తువు.

**వేదాంతసారసంగ్రహము**

భానుమద్విజయ కర్త వెలగపూడి కృష్ణయమాత్యుడు రచించిన వేదాంత గ్రంథం. కృతికర్త దీనిని వచనకావ్యంగా పేర్కొన్నాడు. వచన కావ్యమంటే వచనంలో రచింపబడ్డ కావ్యమని తాత్పర్యమా? చంపూ పద్ధతిలో రచింపబడ్డ నృసింహ పురాణాన్ని బారిగడ్పుల ధర్మయామాత్యుడు వచన కావ్యంగా పేరొన్నాడు. "ఒగి నృసింహపురాణం, బగణితమది వచన కావ్యమై భువి బర గంగ రచియింపుమ' - (నృసింహపురాణం అవతారిక చూ: చరిత్రకెక్కని

చరిత్రార్థులు - పుట 7.) అనాడు వచన కావ్యమనే దానికి పారిభాషికమైన అర్థమేదైనా ఉన్నదేమో ఆలోచించాలి. (చూ: మాలతీమాధవీయము.)

**వ్యాసాష్టకము**

పండితారాధ్యుడి అష్టకాన్ని రచించినట్లుగా పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్ర వల్ల తెలుస్తుంది. (వాదప్రకరణం.)

**శంకరదాసమయ్యచరిత్రము**

ఇది ద్విపద కృతి. 15 వ శతాబ్ది చివరి భాగానికి చెందిన పోశెట్టి లింగన ఈ కృతి కర్త. లింగన ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఈతని నవచోళచరిత్రవల్ల తెలుస్తుంది

**శంకరవిజయము**

బొద్దపాటి పేరయ (1560కి పూర్వుడు) రచితమైన ఈ కావ్యంలోని 7 పద్యాలు ప్రబంధ రత్నాకరంలో పేర్కొబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి) ఇవి గాక మరో మూడు పద్యాలు ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరం వల్ల లభిస్తున్నట్లుగా డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు పేర్కొన్నారు. (చూ: సాహిత్యసంపద 301, 302 పు.) ఈ కావ్యంలోనివి మొత్తం 10 పద్యాలు లభ్యమైనాయన్న మాట.

**శంకరగీత**

ఇది శైవమతపరమైన గ్రంథం. మల్లికార్జునపండితుడు ఈ కృతికర్త.

**శంకరపదములు**

మల్లికార్జున పండితుడు వీటి కర్త. ఇవి శివపరాలైన సంబుద్ధులు కావచ్చునని పండితుల అభిప్రాయం. (య.వా చ. 283.)

**శంతనుచరిత్ర**

గణపవరపు వేంకటకవి ఆం.ప్ర.ర. లో ఈ కావ్యాన్ని సోమయాజి అనంతయ్య కృతంగా పేర్కొంటూ ఇందులోని రెండు పద్యాలను ఉదాహరించినాడు. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి, 202, 203 పుటలు.)

**శతకంఠయుద్ధము**

కొమ్మకన్నయ్య ఈ కృతికర్త. ఈతడీ కృతిని రచించినట్లు అతని తారాశశాంకవిజయము పీఠికవల్ల తెలుస్తుంది. (చూ: అర్ధనారీశ్వరీకలాపము.)

**శతకంఠ (శతకంధర) రామాయణము**

ఆంధ్రకౌముది అనే వ్యాకరణగ్రంథంలో 'భీమకవికృతే శతకంఠ రామాయణే' అని పేర్కొని శతకంఠరామాయణంలోని పద్యాలను ఉదాహరించడం వల్ల ఇది భీమకవి కృతంగా తెలియవస్తుంది. దీనికి శతకంధర రామాయణమనే నామాంతరం కూడా ఉన్నట్లుగా తెలుస్తుంది. ఇందులో లభ్యమైన పద్యాలు మూడు మాత్రమే (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి, పుట 164.)

శతకంధరరామాయణం (చూ: శతకంఠ రామాయణము)

**శతపక్షిసంవాదము**

క్షేమేంద్రుడనే బిరుదనామం కల లక్కాభట్టు ఈ కృతిని రచించినట్లుగా కవి వాగ్బంధనం, లక్షణ శిరోమణి, ఆంధ్రప్రయోగ రత్నాకరం మొదలైన లక్షణ గ్రంథాల వల్ల తెలుస్తుంది. ఈ కృతిలోనివిగా మొత్తం నాలుగు పద్యాలు లభిస్తున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి 165.166 పు )

**శతసంహిత**

మరింగంటి కవులలో ప్రసిద్ధుడైన సింగరాచార్యులు 'సీతా కళ్యాణం'లో తాసీ కృతిని పన్నెండేండ్ల వయస్సులో రచించినట్లుగా పేర్కొనినారు.

వరుసతో పన్నెండు వత్సరంబుల వేడ్క
శతసంహితను తెన్గు జేసినావు (1.16)

**శమంతకమణి చరిత్ర**

వణుకూరి గుర్వరాజు ఈ కావ్యకర్త. ఇందులోని ఒక పద్యం సు.మ.రం. లోనూ, అప్పకవీయంలోనూ ఉదాహరింపబడింది. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి 167 పుట.)

**శమంతకోపాఖ్యానము**

రాళ్ళబండి పట్టాభిరామకవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా వైయాకరణము గోపాలజయదేవరాజుగారు ఆంధ్రపత్రిక (పదో సంవత్సరాది సంచిక)లో రాసినారని వంగూరి సుబ్బారావుగారు తెలిపినారు. (శతకకవులచరిత్ర - 256 పు.)

అప్పకవి ఉదాహరించిన మరున్నందన, వజ్రపంజర శతకాలను, గువ్వల చెన్న శతకం, కవిసర్పగారుడం, కవిమూషికమార్జాలం, మలరాజు గొండా

రాయణోపాఖ్యానం మొదలైన గ్రంథాలను కూడా ఈతడు రచించినాడు. (ఆరుద్ర - 226 పు.)

**శరభచరిత్ర**

చక్రపాణి రంగనాథుడీ కృతిని రచించినట్లుగా వేటూరి ప్రభాకరశాస్త్రి గారు చాటు పద్యమణిమంజరి (ద్వితీయ భాగము-ప్రథమ సంపుటము - పుట 80)లో తెలిపినారు.

**శరభలింగ మకుటము**

ఇది శతకం కావచ్చు. పాలపర్తి సోమేశ్వరుడీ కృతికర్త. ఇందులోని ఒక పద్యం జగ్గన ప్రబంధరత్నాకరంలో ఉదాహరింపబడింది. (చూ: ప్రబంధ రత్నావళి 110 పు.)

**శరభాంకలింగశతకము**

గణపవరపు వేంకటకవి ఆంధ్ర ప్రయోగ రత్నాకరంలో నవకవుల శతకమనే పేరుతో 'శరభాంకలింగమా' అనే మకుటంతో నాలుగైదు పద్యాలు ఉదాహరింపబడ్డాయి. ఇదే మకుటంతో ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో శరభాంకుని కర్తగా పేర్కొంటూ ఒక పద్యం సేకరింపబడి ఉంది. కనుక ఇది శరభాంక కృతమేమో! (చూ: సాహిత్యసంపద, 287.288 పు.)

**శాకుంతలము**

సిద్ధనప్రెగ్గడ రచించిన ఈ గ్రంథంలోని పురవర్ణనకు సంబంధించిన ఒక పద్యం 'ఉదాహరణ పద్యములు' అన్న సంకలన గ్రంథంలో ఉదాహరింపబడింది. (చూ: ప్రబంధరత్నావళి, 102 పు.)

**శారదాదర్పణము**

ఈ లక్షణగ్రంథం అప్పకవీయంలో పేర్కొనబడింది.

**శారదావిలాసము**

ఈ లక్షణ గ్రంథం కాచన బసవన కవి సర్పగారుడంలో పేర్కొనబడింది. బసవన తన గ్రంథాన్ని రచించేప్పుడు సంప్రదించిన గ్రంథాలలో ఇది ఒకటి.

**శారభము**

పండితారాధ్యుడు ఈ కృతి కర్త. దీనినీతడు రచించినట్లుగా పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. (వాదప్రకరణం.) ఇందులో వర్ణింపబడిన విషయమేమిటో తెలియదు.

**శాలివాహనసప్తశతి**

ఇది శ్రీనాథుని కృతుల్లో రెండవది. 'నూనూగు మీసాల నూత్న యౌవనమున, శాలివాహన సప్తశతి నొడివితి' అని భీమఖండం (1 - 7) లో శ్రీనాథుడే కావ్యం రచించినట్లుగా స్వయంగా చెప్పుకున్నాడు. గాథాసప్తశతినే శ్రీనాథుడు శాలివాహన సప్తశతి అని పేర్కొన్నాడు. శాతవాహన రాజైన హాలుడు సంకలనం చేసిన ఏడు వందల ప్రాకృతగాథలను శాలివాహన సప్తశతి పేర శ్రీనాథుడు అనువదించి ఉంటాడు. వివిధ ఆధారాలను బట్టి ప్రస్తుతం ఈ కావ్యంలోని పద్యాలు ఐదు మాత్రం లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధ కావ్యపద్యముక్తావళి, పుటలు 63 - 65.)

**శిరోభూషణము**

చింతలపల్లి ఎల్లన ఈ కృతిని రచించినట్లుగా తెలుస్తుందని కవి సప్తశతిలో పేర్కొబడింది. (పుట - 24.)

**శాలిహోత్రము**

ఇది అశ్వ శాస్త్రానికి సంబంధించిన గ్రంథం. దీని కర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని కొన్ని పద్యాలు మడికి సింగన సకల నీతి సమ్మతంలో ఉదాహరింపబడ్డాయి. ఈ కృతికి అశ్వలక్షణ సారమనే నామాంతరం ఉంది. ఇది మనుమంచిభట్టుచే రచింపబడిన అశ్వశాస్త్రమని కొందరి అభిప్రాయం. కాని ఈ అభిప్రాయం సరి కాదని కవితరంగిణీకారులు నిర్ణయించినారు.

**శివకాంచీమాహాత్మ్యము**

దగ్గుపల్లి దుగ్గన ఈ కావ్యకర్త. ఇందులోని రెండు సీసపద్యాలు ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంలో పేర్కొబడ్డాయి. (చూ: ప్రబంధ రత్నావళి 40 పు.) ఈ కృతి చెందలూరి గంగయ మంత్రి పుత్రుడైన దేవయామాత్యునికి అంకితం చేయబడింది.

**శివతత్త్వ రసాయనము**

కాకతీయ ప్రభువైన గణపతి దేవునికి, ప్రతాపరుద్రునికి దీక్షా గురువైన విశ్వేశ్వర శివదేశికుడు ఈ కృతి కర్త. 1200 ప్రాంతానికి చెందినవాడు. ఈ విశ్వేశ్వర దేశికుడు, శివదేవయ్య-ఇద్దరూ ఒక్కరేనని చిలుకూరి నారాయణరావు గారి అభిప్రాయం, శివదేవయ్య రచించిన శివదేవధీమణి శతకంలోని రెండు పద్యాలు మాత్రమే లభ్యమౌతున్నాయి.

**శివదేవధీమణి శతకము**

శివదేవయ్య ఈ శతక కర్త. ఈతడు ఓరుగంటిని పరిపాలించిన గణపతి దేవునికి, రుద్రమదేవికి మంత్రిత్వం నెరపినాడు. ఈ శతకంలోని రెండు పద్యాలు శ. క. చ. లో పేర్కొబడ్డాయి. ఒకానొక ఛందోగ్రంథంలో కూడా ఈ శతక పద్యం ఉదాహరింపబడింది. (చూ:- అలబ్ధకావ్యపద్య ముక్తావళి, పుట 170.)

**శివభక్తి దీపిక**

చక్రపాణి రంగనాథుడు (13 శ) ఈ కృతి కర్త. ఇది నయనగతి రగడతో ఉన్న రచనమట (క. త. 3).

**శివరాత్రి మాహాత్మ్యము**

లోకేరావు సోమన (17 శతాబ్ది) ఈ కృతి రచించినట్లుగా అతని బలభద్ర విజయంలో పేర్కొబడింది. దీనిని కవి వచన కావ్యమని చెప్పినాడు. వచన కావ్యమనగా చంపూకావ్యం.

**శివస్తుతి**

ఇందులోని ఒక పద్యం లక్షణ శిరోమణిలో ఉదాహరించబడింది. (4-147.) ఈ పద్యాన్ని 'భీమన శివస్తుతి కందం' అని పేర్కొనడంవల్ల భీమన ఈ కృతి కర్త అనీ, ఇది కందంలో సంతరింపబడిన రచన అనీ తెలుస్తుంది.

**శిష్యప్రబోధము**

ఇది ద్విపద కృతి. పోశెట్టి లింగన ఈ కృతి కర్త. ఈతడు 15 శతాబ్దికి చివరిభాగానికి చెందినవాడు. ఈతడు తన నవచోళ చరిత్ర అనే కావ్యంలో ఈ కావ్యాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.

**శివజ్ఞానదీపిక**

పెదపాటి సోమయ ఈ కృతి కర్త. ఇందులోని మూడు పద్యాలు మాత్రమే ప్రబంధరత్నాకరంవల్ల లభ్యమౌతున్నాయి. (చూ: ప్రబంధ రత్నాకరం 109-110 పు.)

**శుకరంభాసంవాదము**

లోకేరావు సోమన (17 శ) రచించిన యక్షగానం. ఈతని బలభద్ర విజయకావ్యంలో దీని ప్రసక్తి కానవస్తుంది.

**శుద్ధాంధ్రరామాయణము**

అడిదం బాలభాస్కరకవి ఈ అచ్చ తెనుగు రామాయణ కర్త. ఈతని కుమారుడైన అడిదం సూరన "ఇది శ్రీమదశేష మనీషి హృదయంగమ మృదుపదసీరంధ్ర శుద్ధాంధ్ర రామాయణ ఘటనా వైదుషీదురంధరాడిదము బాలభాస్కరతనూభవ ...... ..." అనే కవిసంశయవిచ్ఛేదగద్యలో అడిదం బాల భాస్కరకవి ఈ రామాయణాన్ని రచించినట్లుగా చెప్పడమే కాక ఇందులోని ఒక పద్య పాదాన్ని ఉదాహరించినాడు కూడా. (చూ: క.సం.వి. 1.22.)

**శూద్రకరాజచరిత్రము**

నిడుదవోలువారు కవిభల్లటుని శూద్రకచరిత్రలోనిదంటూ ఒక పద్యాన్ని తమ తెలుగు కవుల చరిత్రలో పేర్కొన్నారు. కాని ఆ.రం.ఛం.లో ఈ పద్యం బ్రహ్మాండ పురాణంలోనిదిగా పేర్కొబడింది. (1.361.) కవిభల్లటుడు గణమంజరి, విక్రమార్క చరిత్ర రచించినట్లుగా గోలకొండ కవుల సంచిక తెలుపుతున్నది. క్షేమేంద్రుడనే బిరుదనామం కల లక్కాభట్టు కూడా శూద్రకరాజ చరిత్రను రచించినట్లుగా ఒకానొక ఛందోగ్రంథం వల్ల తెలుస్తుంది. (ఛం.గ్రం. డి-705, 41 పుట.)

**శూద్రకరాజచరిత్రము**

క్షేమేంద్రుడనే బిరుదనామం కలిగిన లక్కాభట్టు ఈ కావ్యాన్ని రచించినట్లుగా తిక్కన పేర ప్రసిద్ధమైన కవి వాగ్బంధనమనే ఛందోగ్రంథం వల్ల తెలుస్తుంది ఈతడు శతపక్షి సంవాదం, ముద్రామాత్యం అనే గ్రంథాలు కూడా రచించినాడట ఇవన్నీ అలభ్యాలే.

**శృంగారమంజరి**

గణపవరపు వేంకటకవిచే రచింపబడిన కృతి. "ఇరువది యేటను శృంగార మంజరియు నుదాహరణ జేసి ఘనతగన్న" అని వెంకటకవి తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలో (26 పద్యం) చెప్పుకొనిన దానిని బట్టి ఈ కృతి అతని ఇరవదవయేట రచింపబడినట్లుగా తెలుస్తుంది ఇందులోని విషయమేమిటో తెలియదు. శృంగారరస ప్రధానంగా రచింపబడిన కావ్యమో లేక అలంకార శాస్త్ర గ్రంథమో కావచ్చు. ఈదురువల్లి భవానీ

శంకరుడు, బాలకృష్ణకవి - వీరిద్దరు అలంకార శాస్త్రమైన శృంగార మంజరిని రచించినారు.

**శృంగారరత్నాకరము**

ప్రబంధ రత్నాకరంలో కళావిలాసంలోని 'తొడవులు పెట్టి' అనే పద్యం తరువాత 'లలనలు గొందఱు' అనే పద్యం ఉంది. దీనికి ఆకరం లేదు. దీని ముందు పద్యానికి కళావిలాసం ఆకరంగా చూపబడింది. కనుక మానవల్లివారు ఈ పద్యాన్ని కూడా కళావిలాసంలోనిదిగా భావించినారు. కాని 'లలనలు గొందఱు' అనే పద్యం బాలబోధ ఛందస్సు లేక సర్వలక్షణసారం అనే లక్షణ గ్రంథంలో భాస్కర ప్రెగ్గడ రసాలంకారంలోనిపద్యంగా ఉదాహరించబడింది. దీనినిబట్టి ఇది కళావిలాసంలోని పద్యం కాదని తెలుస్తుంది. కాని ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో ఈ పద్యం భాస్కరుని శృంగార రత్నాకరంలోనిదిగా పేర్కొబడింది. ఈ భాస్కరుడు భాస్కర ప్రెగ్గడ కావచ్చు. ఈతడు శృంగారరత్నాకరమనే పేరుతో అలంకారగ్రంథాన్ని రచించిఉంటాడని భావించవచ్చు.

**శృంగారషష్ఠం**

రాచమల్లు కవులు రచించిన కవుల షష్ఠమనే గ్రంథానికి శృంగారషష్ఠమనే నామాంతరం ఉంది. (చూ: కవులషష్ఠము.)

**శృంగారసుధార్ణవము**

తుఘ్నూరి శరభరాజకవిచే రచింపబడ్డ కావ్యం. శయ్యా చమత్కార విశేషాలతో రచితమైన కావ్యమట. శృంగార రస ప్రధాన కావ్యమని ఊహించవచ్చు. (చూ: కాళిందీవరిణయము.)

**శేషధర్మములు**

వెణుతురుపల్లి (దిట్టకవి) విశ్వనాథకవి (17 శ) ఈ కృతికర్త. విశ్వనాథకవి దీనిని పెద్దాపుర సంస్థాన స్థాపకుడైన వత్సవాయ తిమ్మభూపతికి అంకితం చేసినాడు. శేషధర్మములు అవతారిక మాత్రమే ముద్రితమైనది. తక్కిన భాగం ప్రస్తుతం అలభ్యం.

**శేషధర్మములు**

తిమిడిపల్లి వేంకటశేషకవి శేష ధర్మములను రచించినట్లుగా మిక్కిలి మల్లికార్జునుడు రచించిన కృష్ణార్జునీయమనే కృతి అవతారికవల్ల తెలుస్తుంది.

ఈ కృతి లింగమపర్తిపురంలో నెలకొని ఉన్న రామదేవునికి అంకితమట. కృష్ణార్జునీయప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. (నె. R. 775.)

**శేషభాగవతము**

ఈ భాగవత కర్త ఎవ్వరో తెలియదు. ఆంధ్రకౌముదిలో ఈ కావ్యం లోని ఒక పద్యం ఉదాహరించబడింది. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి 173 పుట.) ఇందులోనే చిత్రశేష భాగవతంలోనిదిగా మరో పద్యం కనిపిస్తుంది. ఈ రెండు భాగవతాలు ఒక్కటేనో, వేర్వేరో చెప్పలేము.

**శేషశైలేశ లీల**

కాణాదం పెద్దనసోమయాజి కవిచే చిత్రకవితారీతిలో రచింపబడ్డ ప్రబంధం. కచటతప అనే ఐదు వర్ణాక్షరాలకు చెందిన ఇరవై ఐదు అక్షరాలను వదలి కేవలం ఎనిమిది అంతఃస్థోష్మవర్ణాలతో - అంటే - యరలవ శషసహ లతో మాత్రమే పద్య రచన సాగటం ఇందులోని విచిత్రత. ఈ విషయాన్ని పెద్దన సోమయాజి ముకుంద విలాసం అవతారికలో ఈవిధంగా చెప్పుకున్నాడు.

కాదివర్ణంబులిరువదియైదు విడిచి
చేసితివపంచవర్గీయ చిత్రకృతిని
శేషశైలేశ లీలాఖ్యచే నెసంగ
యాదిమిత వర్ణనియతి శక్యంబె జగతి. (24 పద్యం)

కావ్యనామంలో కూడా ఈ విచిత్రత కానవస్తుంది. (చూ: మత్స్య. పురాణము:

**శ్రీకృష్ణతులాభారము**

మరింగంటి వేంకట నృసింహాచార్యులచే రచింపబడిన ద్విపద కావ్యం గోలకొండ కవుల సంచిక ఈ కావ్యపు ఉనికిని తెలియజేస్తుంది. (పుట 410)

**శ్రీకృష్ణవిలాసము**

వెన్నెలకంటి వేంకటాచలకవి ఈ కావ్యకర్త అని పేర్కొంటూ గురజాడ శ్రీరామమూర్తిగారు తమ కవిజీవితములలో ఇందులోనివిగా 14 పద్యాలను ఉదాహరించినారు. మానవల్లివారు మరో రెండు పద్యాలను కుమార సంభవ

ప్రథమభాగానుబంధంలో పేర్కొన్నారు. (చూ. అలబ్ధ కావ్యపద్య ముక్తావళి 174-179 పుటలు).

**శ్రీకృష్ణ (లీలా) విలాసము**

కటికనేని రామయ్య ఈ ప్రబంధ కర్త. ఇందులోని రెండు పద్యాలు ఈతని కువలయానంద ప్రకాశికలో లభిస్తున్నట్లుగా ఆరుద్రగారు తమ స. ఆం. సా. లో పేర్కొంటూ ఆ రెండు పద్యాలను ఉదాహరించినారు. (స. ఆం. సా. 12 - 297 పు.)

**శ్రీకృష్ణ శతానందీయము**

మరింగంటి సింగరాచార్యుల కృతి.

**శ్రీగిరినాథవిక్రమము**

శ్రీశైల మల్లికార్జునునిపై చక్రపాణి రంగనాథుడు చెప్పిన ఐదువందల సీసపద్యాలు గల కృతి ఇది. (చూ: చాటుపద్యమణిమంజరి, ద్వితీయ భాగం ప్రథమ సంపుటం 80-81 పుటలు.) గురురాజ చరిత్ర అనే కన్నడ గ్రంథంలో రంగనాథుడీ కృతితోపాటు మరెన్నో కృతులను రచించినట్లుగా చెప్పబడింది.

**శ్రీగిరీశశతకము**

ఈ శతక కర్త శ్రీగిరికవి (క్రీ.శ. 1315). ఇందులోని రెండు పద్యాలు సకల నీతి సమ్మతంలో గ్రహింపబడ్డాయి. శ్రీగిరికవి నవనాథ చరిత్రను (పద్యకృతి), శ్రీరంగ మాహాత్మ్యాన్ని రచించినాడు. ఈతని కృతులన్నీ అలభ్యాలే.

**శ్రీధరచ్ఛందస్సు**

గ్రంథనామాన్ని బట్టి ఈ ఛందఃకర్త శ్రీధరుడని భావించవచ్చు. గౌరన మొదలైన లాక్షణికులీ ఛందస్సును ఉదహరించినారు పొత్తపి వేంకట రమణ కవి ఉదాహరించిన పద్యం (ల.శి.4.116)లో పిన్నభూవరుని సోమ! అనే సంబోధన ఉండడంవల్ల ఇది పిన్న సోమభూపతికి అంకితం అయినట్లుగా తెలుస్తుంది.

**శ్రీనగాధీశశతకము**

కాకుమూరి అప్పకవి ఈ శతక కర్త. ఈతడు అప్పకవీయంలో చెప్పిన 'శ్రీనగాధీశ సుశ్లేషనిందాస్తుతి భావగర్భిత సీసపద్య శతము' (అవతారిక 85 పద్యం) అనే వాక్యంవల్ల ఇది సీస పద్య శతకమనీ, ఇందులోని పద్యాలు

శ్రీశైల మల్లికార్జున నిమీద శ్లేష నిందాస్తుతి గర్భంగా రచింపబడ్డాయని తెలుస్తుంది. ఈ శతకానికి అప్పకవి పెట్టిన పేరేమిటో స్పష్టంగా తెలియదు. శ్రీనగాధీశ శతకమనే పేరు శతక కవుల చరిత్రకారులు వంగూరి సుబ్బారావు ఊహించినది మాత్రమే.

**శ్రీరంగమాహాత్మ్యము**

చెన్నమల్లు శీగిరన్న (శ్రీగిరికవి) ఈ కృతి కర్త. ఇందులోని నాలుగు పద్యాలు ఉదాహరణ పద్యములనే సంకలన గ్రంథంలో లభ్యమౌతున్నాయి. (ప్రబంధ రత్నావళి పు. 97-98.) ఈతడు రచించిన పద్య నవనాథ చరిత్ర, (పద్య కృతి) శ్రీగిరి శతకం కూడా అలభ్యాలే.

**శ్రీరంగశతకము**

మరింగంటి సింగరాచార్యులీ శతకాన్ని రచించినట్లుగా తన సీతా కల్యాణ అవతారికలో చెప్పుకున్నాడు.

సిరుల తొమ్మిదియేండ్ల వరదరాజస్తుతి
శ్రీరంగశతకంబు చెప్పినావు (1-16)

**శ్రీరామపట్టాభిషేకము**

శ్రీనాథుని వెంకటరామయ్య రచించిన అశ్వారాయచరిత్రకే శ్రీరామ పట్టాభిషేకమనే నామాంతరం ఉంది. (చూ: అశ్వారాయచరిత్ర.)

**శ్రీరామవిజయము**

వెణుతురుపల్లి విశ్వనాథకవి ఈ యక్షగాన కృతికర్త. ఈతనికి దిట్టకవి విశ్వనాథకవి అనే వ్యవహారనామం కూడా ఉంది. ఈ యక్షగానాన్ని రచించి నట్లుగా కవి తన శేషధర్మములు అవతారికలో చెప్పుకున్నాడు. (చూ: గౌరీ వివాహము.)

**శ్రీరామశతకము**

వత్సవాయ బలభద్రరాజకవి ఈ శతక కర్త. ఈతడు పెద్దాపుర సంస్థానాన్ని క్రీ.శ. 1607 నుండి 1646 వరకు పరిపాలించిన వత్సవాయ రాయప మహీపాలుని కుమారుడు. 'అమిత ఖ్యాతికి మూలమైన కృతి దానందెన్ గిరాతార్జునీయము శ్రీరాముల పేరఁ బద్యశతకంబారూఢి నిర్మించె' అనే ఏనుగు లక్ష్మణకవి రామవిలాస కావ్యావతారికలోని వాక్యం వల్ల బలభద్రరాజకవి ఈ శతకాన్ని రచించినట్లుగా తెలుస్తుంది.

**శ్రీశైలమాహాత్మ్యము**

తెనాలి రామకృష్ణుని పెదతమ్ముడు శ్రీగిరి ఈ కృతిని రచించినట్లుగా తెనాలి రామభద్రకవి ఇందుమతీ కల్యాణావతారికలోని పద్యంవల్ల తెలుస్తుంది.

మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్య కృతి యొనర్చె

తెనాలి రామభద్రుడు తెనాలి రామకృష్ణ కవి పెదతమ్ముడు శ్రీగిరి కవికి మనుమడు.

**షడర్థనిర్ణయము**

కవిరాక్షసుడు రచించిన నిఘంటువట.

**షడ్భాషావివరణము**

ఎలకూచి బాలసరస్వతి రచన. షడ్విధ ప్రాకృతాలకు సంబంధించిన అంశాలు ఇందులో వివరించబడిఉంటాయి.

**షష్ఠస్కంధము**

మలయమారుతం సర్వన్న ఈ కృతి కర్త. ఇది భాగవతంలోని షష్ఠ స్కంధానికి తెలుగుసేత. ఇందులోని ఒక పద్యం ప్రబంధ రత్నాకరంలో లభిస్తుంది (చూ: ప్రబంధరత్నావళి 99 పు.) పోతన షష్ఠస్కంధం శిథిలం కావడంవల్ల సర్వన దీనిని రచించి ఉండవచ్చు.

**షోడశరాజచరిత్ర**

ప్రబంధ రత్నాకరంలో ఒక పద్యమూ, ప్రబంధ రత్నాకరం ప్రత్యంతరంలో మరో పద్యమూ మొత్తం రెండు పద్యాలు షోడశరాజ చరిత్రలోనివి లభిస్తున్నాయి. అమడూరి నరసింహభట్టు ఈ కృతి కర్త.

**సంక్షేపభాగవతము**

ఈ కృతి కర్త 'కవి చింతామణి' కర్తయైన వెల్లంకి తాతంభట్టు. తాతంభట్టు సంక్షేప భాగవతాన్ని రచించినట్లుగా చాటుపద్యమణి మంజరిలోని యీ క్రింది పద్యం తెలుపుతుంది.

ఏ కవి నిర్మించె నీ శబ్దశాస్త్ర పద్ధతియెల్ల సుకవి చింతామణీ యన
ఏ కవి చెప్పె ననేక పుణ్యానల్ప బంధుర సంక్షేపభాగవతము
.... .... .... .... ....
అతడు వెల్లంకి తాత .... .... ....

**సంగ్రహభాగవతము**

తంజావూరిని పాలించిన విజయరాఘవనాయకుని ఆస్థానంలో ఉండి అతనిచే కనకాభిషేకం చేయించుకున్న పసుపులేటి రంగాజమ్మ (1633-73) ఈ కావ్యకర్త్రి. ఈమె తన ఉషాపరిణయ కావ్యం అవతారికలో ఈ విధంగా చెప్పుకుంది.

............'రామాయణంబును'
'భాగవతంబును' 'భారతంబు'
సంగ్రహంబున రచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మి దనర. (6 పద్యం)

దీనినిబట్టి రంగాజమ్మ రామాయణ, భారత, భాగవతాలను మూడింటిని సంగ్రహంగా రచించినదని తెలుస్తుంది. కాని ఈ మూడూ నేడు అలభ్యాలే.

**సంగ్రహభారతము**

విజయరాఘవనాయకుని ఆస్థానాన్ని అలంకరించిన పసుపులేటి రంగాజమ్మ ఈ కావ్యకర్త్రి. (చూ: సంగ్రహభాగవతము.)

**సంగ్రహరామాయణము**

పసుపులేటి రంగాజమ్మ ఈ కావ్యకర్త్రి. (చూ: సంగ్రహభాగవతము).

"రాణింప రచియించి రామాయణంబును
భాగవతంబును భారతంబు
సంగ్రహంబుగ రచించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మి దనర"

ఉషాపరిణయం గ్రంథాంత గద్యలో కూడా తనను 'మహనీయ రామాయణ భారత భాగవత కథాసంగ్రహ విచక్షణగా పేర్కొన్నది.

**సంగ్రహభారతము**

రంగాజమ్మ సంగ్రహభారతాన్ని రచించినట్లుగా ఉషాపరిణయ కావ్యావతారికలోని పద్యంవల్ల గ్రంథాంత గద్యవల్లా తెలుస్తుంది. (చూ: సంగ్రహ భాగవతము.)

**సంగ్రహరామాయణము**

రంగాజమ్మ సంగ్రహ రామాయణాన్ని రచించినట్లుగా ఈమె ఉషా పరిణయ కావ్యావతారికలోని పద్యం వల్లా, గ్రంథాంత గద్యవల్లా తెలుస్తుంది. (చూ: సంగ్రహభాగవతము)

**సంపంగిమన్నారుసాంగత్యము**

చూ : మన్నారుసాంగత్యము,

**సంపత్కుమారీయము**

దీనికి వేంకటవిలాసమనే నామాంతరం ఉంది. శీలం వెంకటరాఘవకవి ఈ కృతికర్త. ఈతడు తన కాశ్రయుడైన కోసల వెంకటస్వామి కోరిక ప్రకారం ఈ గ్రంథాన్ని రచించి అతనికి అంకితం కావించినాడు.

**సంవరణచరిత్రము**

చెదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రలో 'వరుస జెప్పించుకొనియె సంవరణ చరిత మెలమి మాకయ లక్ష్మిపతీశ్వరుండు' (అవతారిక) అనే పద్య భాగం వల్ల ఈ కృతిని గురించి తెలియవస్తుంది. ఈ కృతికర్త మల్లన కావచ్చు. ఇది విప్రనారాయణ చరిత్రను అంకితం తీసుకున్న తిరుమలరాజా తమ్ముడైన లక్ష్మిపతిరాజుకు అంకితం చేయబడింది.

**సంసారమాయాస్తవము**

పండితారాధ్యుడీ కృతిని రచించినట్లుగా పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రవల్ల తెలుస్తుంది. (వాదప్రకరణం)

**సకలజన (సకలజీవన) సంజీవనము**

ఇది చిత్రకవి అనంతకవి (1580) కృతి అని అతని కుమారుడు చిత్రకవి వెంకటరమణకవి రచించిన సాంబవిలాస కావ్య అవతారిక తెలుపుతుంది. ఇది లక్షణ గ్రంథం కావచ్చునని ఆరుద్రగారి అనుమానం. (స. అం సా. 208 పు) (చూ: ఇందుమతీ పరిణయం.)

**సకలపురాణసారము**

కూచిరాజు ఎఱ్ఱయచే రచింపబడిన ఈ కృతిలోని ఒకే ఒక పద్యం ప్రబంధ రత్నాకరంలో ఉదాహరింపబడింది. (చూ: ప్రబంధ రత్నావళి 16 పు) ఈతడు రచించిన సకలకథానిధానం పీఠికలో కూడా "అఖిలపురాణేతిహాస కావ్య స్మృతిచయము రచించిన చారుమతివి" - అని ఉండటంవల్ల ఎఱ్ఱయ సకలపురాణసారాన్ని రచించినట్లుగా తెలుస్తుంది

**సకలాలంకారసంగ్రహము**

అలంకార శాస్త్ర విషయాలను తెలిపే లక్షణ గ్రంథం ఇది. మరింగంటి సింగరాచార్యులు ఈ లక్షణ గ్రంథకర్త. సింగరాచార్యులు ఈ లక్షణ

గ్రంథాన్ని పద్దెనిమిదోయేట రచించినట్లుగా తన సీతాకల్యాణ కావ్యావతారికలో చెప్పుకున్నాడు.

'ఒనర పద్దెనిమిది వత్సరమ్ముల నాడు
సకల అలంకార సంగ్రహమ్ము' (1-20.)

**సత్యభామావిజయము**

ఘట్టు ప్రభువు (16 శ) ద్విపద కృతిని రచించినట్లుగా ఆంధ్ర కవి సప్తశతి తెలుపుతుంది. (పుట 65 )

**సత్యభామావివాహము**

విజయరాఘవనాయకుడు రచించిన ఈ యక్షగాన ప్రసక్తి ఇతని ప్రహ్లాద చరిత్ర అవతారికలో కానవస్తుంది.

**సత్యావధూప్రణయ ప్రబంధము**

లక్షణ శిరోమణి కర్త ఈ కావ్యాన్ని అల్లసాని పెద్దన కృతంగా పేర్కొంటూ ఇందులోని ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. కృష్ణదేవరాయలు సంస్కృతంలో రచించిన సత్యావధూ ప్రీణనకావ్యానికి ఇది తెనుగు అనువాద గ్రంథమేమో!

**సభాభిరామము**

తామరపల్లి శరణమంత్రి (16శ.) ఈ కృతిని రచించినట్లుగా అతని పుత్రుడు తిమ్మయ శేషధర్మములనే గ్రంథంలో పేర్కొన్నాడు ఇది వచన కావ్యమట.

**సముద్రమథననాటకము**

'బుధులు మెచ్చ సముద్రమథన నాటకరాజమొనరించు భువనమోహన చరిత్ర' అని విజయరాఘవ నాయకుడు తానీ యక్షగానాన్ని రచించినట్లుగా ప్రహ్లాద చరిత్రలో పేర్కొన్నాడు.

**సముద్రమథనము**

కెళ్ళ కృష్ణయ్య ఈ కృతి కర్త. దీని ప్రసక్తి అతని తారాశాంక విజయ కావ్యావతారికలో కనిపిస్తుంది. (చూ: అర్ధనారీశ్వరీ కల్యాణము.)

**సీతాస్వయంవరము**

సభాపతయ్య రచన. సంగీతకృతులలో రచితమైన నాటకమట.

**సీతా విజయము**

లింగనకవి రచించిన శతకంఠ రామాయణానికి శతముఖ రామాయణమనీ, సీతా విజయమనీ పేర్లు ఉన్నాయి. ఈ గ్రంథం లభ్యమే కాని సీతా విజయమనే పేర వల్లూరి హనుమంతకవి రచించిన మరో ద్విపద కావ్యమున్నట్లుగా నాగ్నజితీపరిణయకావ్యావతారిక వల్ల తెలుస్తుంది.

సీతావిజయము త్రిపురా
రాతివిజయమని కతలను రచియించి బుధ
ప్రీతిగను ద్విపదకల్పన
మాతరమా మెచ్చగ హనుమంతుని కవితల్.

హనుమంతకవి సీతావిజయమునే కాక త్రిపురారాతివిజయమనే ద్విపద కృతిని కూడా రచించినాడట. ఈ రెండూ అలభ్యాలే.

**సుందోపసుందోపాఖ్యానము**

ఈ ప్రబంధం బండి వెంకటస్వామిచే రచింపబడినట్లుగా అతని రంభానలకూబర సంవాదమనే ప్రబంధంలోని ఈ గ్రంథాంత గద్య వల్ల తెలుస్తుంది. "ఇది.... శ్రీమద్బండి వంశపయః పారావార సుధాకర, చెంగల్వరాయ పుత్ర సుచరిత్ర సుందోపసుందోపాఖ్యాన ప్రబంధ రచనా చాతుర్య ధుర్య, బుధజన విధేయ వేంకటస్వామి నామధేయ ప్రణీతంబైన రంభానలకూబర విలాసంబను మహాప్రబంధంబునందు పంచమాశ్వాసము." ఈతని రంభానలకూబర విలాసం ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. (ఆర్. నెం 53.)

**సుదంతాపరిణయము**

ప్రయాగ కామేశ్వర కవిచే ఈ కృతి రచింపబడినట్లుగా అతని గోపాల లీలా సుధాలహరి అనే కావ్యావతారికలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది.

మునుపు సుదంతాపరిణయ
మనుకృతి భద్రాద్రిరాముడగు రామునికి
చ్చినగతి నీ కృతి తనకిం
పున నిమ్మని రామతీర్థపుర రాముడనెన్.

ఈతని గోపాలలీలా సుధాలహరి ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది (చూ. ఆర్. నెం. 407)

**సుదంతాపరిణయము (సుదంతా వివాహము)**

రాజవోలు సుబ్బరాయకవి (17 శ.) ద్విపద కావ్యాన్ని రచించినట్లుగా అతని జయవిజయాభ్యుదయ కావ్యావతారిక వల్ల తెలుస్తుంది. (చూ: గరుడాంజనేయ సంవాదం.) మృదువాక్య సంగతితో ఈ కావ్యం చెప్పినట్లుగా కవి తెలిపినాడు.

**సుదర్శనరగడ**

తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని రచన.

**సునందచరిత్ర**

శ్రీనాథుడు నందనందన చరిత్రను రచించినట్లుగా ఆంధ్ర కవి సప్తశతి పేర్కొన్నది. కాని లక్షణ గ్రంథాల్లో సునందన చరిత్ర అనీ, నందన చరిత్ర అనీ పేర్కొబడింది. శ్రీనాథుని ఈ గ్రంథం సునందన చరిత్రో లేక నందన చరిత్రో స్పష్టంగా చెప్పలేం ఇందులోని పద్యాలు మూడు అసంపూర్ణంగా లభిస్తున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి, 181 పుట.)

**సునందనోపాఖ్యానము**

ఆంధ్ర ప్రబంధ రత్నాకరంలోనూ, ఆనందరంగరాట్ఛందంలోనూ ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహరింపబడ్డాయి. మాళక్కి భాస్కరుడీ కావ్యాన్ని రచించినట్లుగా ఆం.ప్ర.ర. పేర్కొన్నది. ఇందులోని పద్యాలు ఆరు మాత్రమే (వీటిలో కొన్ని అసంపూర్ణాలు) లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్య ముక్తావళి 182 పు)

**సుభాషితరత్నావళి**

భర్తృహరి రచించిన సుభాషిత త్రిశతికి వడకండ్ల గురురాజకవి సంత రించిన ఆంధ్రానువాదం. గురురాజకవి యీ కృతిని రచించినట్లుగా అతని శేష ధర్మములనే గ్రంథంవల్ల తెలుస్తుంది.

**సుమంతోదయం**

భానుమద్విజయ కర్తయైన వెలగపూడి కృష్ణయ వంశీయునిచే రచింప బడిన కావ్యం. ఈ కావ్యకర్త పేరు తెలియదు. (చూ: గాంగేయోపాఖ్యానము.)

**సుమతిశతకము**

వేములవాడ భీమకవి ఒక సుమతి శతకాన్ని రచించినట్లుగా కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహాన్ని బట్టి తెలుస్తుంది.

**సూతకశిక్ష**

జాతాశౌచ సందర్భాలలో పాటించవలసిన నియమాలను తెలియజేసే కృతి. మరింగంటి జగన్నాథాచార్యులు ఈ కృతి కర్త. అనేక ధర్మశాస్త్రాలను పరిశీలించి ఈ గ్రంథాన్ని రచించినారట. (మరింగంటికవుల సాహిత్య సేవ 425-426 పుటలు.)

**సూర్యశతకము**

ఇది 'సూర్యా! పద్మినీ వల్లభా!' అనే మకుటంతో రచింపబడిన శతకం. బొడ్డపాటి పేరయ్య ఈ శతక కర్త. ఇందులోని ఒక పద్యం ప్రబంధ రత్నాకరంలో సేకరించబడింది. (చూ: ప్రబంధరత్నావళి 64 పు.)

**సేతుమాహాత్మ్యము**

భానుమద్విజయ కావ్య కర్తయైన వెలగపూడి కృష్ణయ వంశీయునిచే రచింపబడ్డ కావ్యం. ఈ కావ్య కర్త పేరు తెలియదు. (చూ:- గాంగేయోపాఖ్యానము.)

**సౌందరేశ చరిత్ర**

మైసూరు సామంతరాజ వంశానికి చెందిన సుగుటూరి ముమ్మడి తమ్మ భూపతి (17 శ) ఈ కృతిని రచించినట్లుగా తెలుస్తుంది. (క. స. 171 పు.) చూ: రాజేంద్రచోళ చరిత్ర.

సౌందర్యలహరి

పోచిరాజు వీరన్న ఈ కృతిని రచించినట్లుగా అతని భల్లాణ చరిత్ర వల్ల తెలుస్తుంది. ఇది శ్రీ శంకరుల రచనకు అనువాదగ్రంథం కావచ్చు.

సౌగంధికాపహరణము

రాయసం గణపయకవిచే రచింపబడ్డ ఈ కావ్యంలోని ఒక పద్యం మాత్రమే 'ఉదాహరణపద్యము'లన్న సంకలనగ్రంథంవల్ల తెలియవస్తుంది. (చూ: ప్రబంధరత్నావళి, 30 పుట.)

సౌపర్ణకాఖ్యానము

ఈ కావ్యం బోరవెల్లి నరసింహకవిచే రచింపబడినట్లుగా బోయినపల్లి కుమారవెంకటరాయల ద్రౌపదీకల్యాణంలోని కిందిపద్యం వల్ల తెలుస్తుంది.

చేసితివీవు దక్షిణకాశ్యలంపురి
నృహరి దయోదయా మహితకలిత
కృతి యతనికంకితముగఁ బండితుల మతుల
నెనయ 'సౌపర్ణకాఖ్యాన'మనగ నొకటి. (47 పద్యం.)

బోరవెల్లి నారసింహకవి కుమార వెంకటరాయలకు గురుస్థానీయుడు. (చూ: చంద్రభానుచరిత్రం.)

సౌభరిచరిత్రము

ప్రోలుగంటి చెన్నశౌరి (15 శ) ఈ యక్షగాన కృతిని రచించినట్లుగా హరిభట్టు ఉత్తరనారసింహపురాణావతారికలో పేర్కొన్నాడు.

సౌభరిచరితంబు జక్కులకథ జెప్పె
లాలితనవరసాలంకృతముగ (33 పద్యం)

స్కాందపురాణము

కుందుర్తి వేంకటాచల కవి రచించిన కార్తికమాహాత్మ్యం అవతారికలో తత్కృతిపతి తాతయైన నల్లారెడ్డి (నల్లపరెడ్డి) స్కాందపురాణాన్ని రచించినట్లుగా పేర్కొబడింది.

శ్రీవేంకటాచలాధిప
దేవునికిన్ మంటపములు, దివ్యోత్సవముల్
గావించె, స్కాందమాంధ్రము
గా వర్తిలఁ గృతియొనర్చి ఘనత వహించెన్.

స్కాందపురాణాన్ని తెలుగులో అనువదించిన ఒకే ఒక కవి నల్లారెడ్డి.

## స్తంభోద్భవము

నెల్లూరి వీరరాఘవ కవి ఈ కృతిని రచించినట్లుగా అతని వసుంధరా పరిణయం అవతారికలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

"అలర స్తంభోద్భవంబాదిగా....
గద్యకావ్యంబుగా ఘటన సేసి"

ఈ స్తంభోద్భవకృతి గద్య కావ్యమని ఈ పద్యం వల్ల తెలుస్తుంది. స్తంభం నుండి ఆవిర్భవించిన నృసింహస్వామి వృత్తాంతం ఇందులోని ప్రధాన వస్తువు కావచ్చు. (చూ: కృష్ణభుజంగము.)

## స్మరతత్త్వసారము

ఈ కృతికర్త ఎవ్వరో తెలియదు. ఇందులోని ఒక పద్యం ఆంధ్ర విశ్వ విద్యాలయ గ్రంథాలయంలోని ఒక ఛందోగ్రంథం (డి.నెం.205) లో ఉదాహ రించబడింది. (చూ: అ.కా.ప ము. 184 పు.)

## స్వరమంజరి

ఇది ద్విపదలో రచింపబడిన వేదాంత గ్రంథం. గౌరయామాత్యుడీ గ్రంథాన్ని రచించినట్లుగా అతని మనుమడు కొండయ వ్రాసిన పల్నాటి వీర చరిత్ర కోళ్ళపోరు అవతారికను బట్టి తెలుస్తుంది.

తత్త్వసారంబెల్ల దలపోసి కూర్చి
తేటతెల్లముగాను దెలుగువారలకు
'స్వరమంజరి' యనంగ జగములో వెలయ
కౌండిన్యగోత్రుడా గౌరయామాత్యు.

ఈ గౌరన, ద్విపద హరిశ్చంద్రోపాఖ్యాన కర్తయగు గౌరన ఒక్కరు కారు.

**హరలీల**

మల్లికార్జునపండితుని శైవమతపరమైన రచన.

**హరవిలాసము**

కస్తూరి రంగకవి ఈ కృతిని భీమన కవి కృతంగా తెలుపుతూ ఇందు లోని రెండు పద్యాలను తన ఆ. రం. ఛం. లో ఉదాహరించినాడు. ఈ భీమన వేములవాడ భీమనో కాదో స్పష్టంగా తెలియదు.

**హరికథాసారము**

పెద్దన ఈ ప్రబంధాన్ని రచించినట్లుగా ఆ. రం. ఛం, ఆం. ప్ర. ర. స. ల. సం. మొదలైన లక్షణ గ్రంథాల వల్ల తెలుస్తుంది. ఈ ప్రబంధంలోని పద్యాలు మొత్తం పదిహేను లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధ కావ్య పద్య ముక్తావళి 189 పుట.)

**హరికథాసుధారసము**

ఆంధ్ర కాళిదాస బిరుదాంచితుడైన ఆలూరి కుప్పన ఈ కృతిని రచించి నట్లుగా ఆతని ఆచార్య విజయావతారికలోని పద్యం తెలియజేస్తుంది. (చూ: ఇందుమతీపరిణయము, ఆలూరి కుప్పన.)

**హరిదత్తోపాఖ్యానము**

నంధూరి మల్లయ ఈ కావ్య కర్త. ఇందులోని ఒక పద్యం జగ్గన ప్రబంధరత్నాకరంలో పేర్కొబడింది. (చూ: ప్రబంధరత్నావళి; 73 పు.)

**హరిభక్తోపాఖ్యానము**

చేకూరి సిద్ధయకవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా ఈతని శ్రీరంగ మాహాత్మ్యగద్యం వల్ల తెలుస్తుంది.

**హరిలీలావిలాసము**

తెనాలి రామలింగకవి హరిలీలా విలాసమనే కావ్యాన్ని రచించినట్లుగా ప్రబంధ రత్నాకరం వల్ల తెలుస్తుంది. ప్రబంధ రత్నాకరంలో ఈ కావ్యం

లోని 21 పద్యాలు సేకరించబడ్డాయి. (చూ: ప్రబంధరత్నావళి, 91 పుట.) ప్రబంధరత్నాకరం ప్రత్యంతరంలో మరో ఆరు పద్యాలు లభ్యమౌతున్నట్లుగా డా॥ కొర్లపాటివారు ఉదాహరించినారు. (సాహిత్యసంపద, పుటలు 301, 302.) ఇప్పటికి మొత్తంపై ఈ కావ్యంలోని 26పద్యాలు లభ్యమైనాయి.

**హరివంశము**

ఇది ద్విపదలో రచించబడిన కృతి. అన్నమాచార్యుని పుత్రుడైన పెదతిరుమలాచార్యుడు కృతి కర్త. తాళ్ళపాక చిన్నన్న తన అష్టమహిషీ కల్యాణంలో ఈతని రచనలను పేర్కొంటూ

వేదాంతవిద్యాప్రవీణుడై యాంధ్ర
వేదాంత మొనరించి ద్విపదరూపమున
హరివంశకావ్య మాయతరసస్ఫూర్తి
హరివంశ మిగురొత్త ననుపొందజేసి

అని హరివంశాన్ని రసమయంగా ద్విపదరూపంలో రచించినట్లు పేర్కొన్నాడు.

**హరివంశము**

గూణికల్లు వెంకటరమణకవి (17 శ) ఈ కృతిని రచించినట్లుగా ఆతని విక్రమార్కచరిత్రలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

మునుపు 'హరివంశ'మంతయుఁ దెనుగుజేసి
యంకితమొనర్చితివి, విక్రమార్కచరిత
మిక ప్రబంధ మొనర్చి మాకిమ్ము.

ఈతని విక్రమార్క చరిత్ర అముద్రితం. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో దీని ప్రతి లభ్యం. (డి. 431.)

**హరివాసరవ్రతమహత్త్వము**

మరింగంటి సింగరాచార్యుల పుత్రుడైన వేంకట నరసింహాచార్యులు (ప్రథమ) ఈ కృతిని రచించినట్లుగా ఆతని జాంబవతీ కుమార శృంగార విలాసంలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది.

సరసతన గురువణి శ్రీ
హరివాసరవ్రత మహత్త్వమను బంధమనో
హరఘటనా గుంఠనము
వ్ప రచించెన్ రసికులెల్ల భళిభళి యనగా (1-45.)

ఇందులో ఏకాదశీమాహాత్మ్యవర్ణన వస్తువు.

హరి(హర)విలాసము

లక్షణగ్రంథాలమూలంగా నాచన సోమన హరి (హర) విలాసం రచించినట్లుగా తెలుస్తుంది. ఆంధ్రప్రయోగరత్నాకరంలో ఇది హర విలాస మని పేర్కొనబడింది . ఆనందరంగ రాట్ఛందంలో ఒకచోట హరి విలాస మనీ, మరోచోట హర విలాసమనీ కనిపిస్తుంది. ఐతే ఈ కావ్యంలోని "కొలిప్తి గాగ హర్యవతారలీలలెల్ల, తెలివిగ వచియించెద" అన్న పద్యంవల్ల ఇది హరి విలాసకావ్యమని తెలుస్తుంది కొన్ని పద్యాలలో హరుని ప్రసక్తికూడా కని పిస్తుంది. ఇందులోనివి మొత్తం పన్నెండు పద్యాలు లభ్యమౌతున్నాయి. (చూ: అలబ్ధకావ్యపద్యముక్తావళి, 197వపుట.)

హరిశ్చంద్రకథ

గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యాన ప్రభావంతో చంపూ రూపంలో వెలసిన కావ్యం. చంద్రమౌళికవి (15 శ.) ఈ కృతికర్త. ఇందులోని ఒక పద్యం ఉదాహరణ పద్యములన్న సంకలన గ్రంథంలో కనిపిస్తుంది. (చూ: ప్రబంధరత్నావళి, పుట. 31 )

హరిశ్చంద్రచరిత్ర

వెణుతురుపల్లి (డిట్టకవి) విశ్వనాథకవి ఈ కృతికర్త. ఇది నిరోష్ఠ్య రీతిలో సాగిన ప్రబంధం. దీని ప్రసక్తి అతని శేషధర్మముల అవతారికలో కనిపిస్తుంది. (చూ: గౌరీవివాహము.)

హరిశ్చంద్రచరిత్ర

దేవరాజభట్టు ఈ కృతి కర్త. ఇందులోని రెండు పద్యాలు ప్రబంధ రత్నావళిలో ఉదాహరించబడ్డాయి. (41 పు ) దీనికి హరిశ్చంద్రో పాఖ్యానమనే వ్యవహారంకూడా ఉన్నది.

**హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్య**

చిత్రకవి అనంతకవి రామరాజ భూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానానికి వ్యాఖ్య రచించినట్లుగా అతని కుమారుడు చిత్రకవి వేంకటకవి సాంబవిలాస కావ్యంలో పేర్కొన్నాడు.

> "అల హరిశ్చంద్ర నలాధీశసత్కథాశ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధి గాగ
> కవిహితుండౌచు వ్యాఖ్యానంబు నొనరించి మఱియు నిందుమతీ
> పరిణయంబు
> మొదలైన సత్కావ్యములు చేసి రహిగాంచె"

**హరిశ్చంద్రోపాఖ్యానము**

చూ : హరిశ్చంద్రచరిత్ర (దేవరాజభట్టు).

**హరిశ్చంద్రోపాఖ్యానము**

శంకరకవి ఈ కావ్యకర్త. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహంలో ఈ కావ్యప్రసక్తి కనిపిస్తుంది.

**హరిహరశ్లేషోదాహరణం**

ఇది చిత్రకవి అనంతయ్య (1580.) కృతంగా అతని కుమారుడైన వెంకటరమణకవి రచించిన సాంబవిలాసంవల్ల తెలుస్తుంది. ఇది శ్లేషగర్భితమైన ఉదాహరణకృతి కావచ్చు. (చూ: ఇందుమతీవిలాసము.)



# కృతుల పేర్లు తెలియని కవులు

**అప్పరాజు, చేమకూర**

ఈతడు కవి యని ముప్పై ఇద్దరు మంత్రుల సీసమాలికా పద్యం వల్ల తెలుస్తుంది. కాని కృతుల వివరాలు తెలియవు.

**అహోబలకవి, కుందుర్తి (17 శ)**

మిత్రవిందాపరిణయాది కృతికర్తయైన కుందుర్తి వెంకటాచలకవికి ముత్తాత. అహోబల కవి గజపతి, అశ్వపతుల సభలో పండిత శ్రేణిని జయించినట్లుగా వెంకటాచలకవి తన మిత్రవిందాపరిణయ కావ్యం అవతారికలో పేర్కొన్నాడు.

ఘనుడు మీ ముత్తాత కవ్యహోబల మంత్రి
గజపతిసభ సుతుల్ గాంచి మించె

**ఇమ్మడి కాళహస్తికవి, రేవూరి**

వసుచరిత్రను సంస్కృతంలోనికి అనువదించిన రేవూరి కాళహస్తికవికి మనుమడు. అష్టభాషల్లో ఆశువుగా ప్రబంధాలు రచించగల చాతుర్యం కలవాడు. చిత్రకవితా రచనలో దిట్ట ఈతని తమ్ముడు రేవూరి అనంతయ్య రచనలు దొరుకుతున్నాయి కాని ఈతని కృతులు మాత్రం తెలియరావు.

**ఇమ్మడి రామకృష్ణుడు, తెనాలి (16 శ.)**

ఈయన సంస్కృతాంధ్రాలలో గొప్పకీర్తిని పొందినట్లుగా ఈతని కుమారుడు తెనాలి రామభద్రకవి ఇందుమతీ పరిణయం అవతారికలో పేర్కొన్నాడు.

కడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణార్యు
దనఁ గీర్తి గనె సంస్కృతాంధ్రములను. (22 ప.)

**కమలామాత్యుడు, నేబతి**

రాజనీతిరత్నాకరకర్త నేబతి కృష్ణమంత్రికి తండ్రి. కృష్ణమంత్రి రాజనీతి రత్నాకరంలో తన తండ్రిని 'వరకవిత్వ లీల నాదిమసుకవులఁ బోలినాడు' అని ప్రశంసించడంవల్ల కమలామాత్యుడు కవి అని తెలుస్తుంది. ఈతని రచనలేమిటో తెలియవు. రాజనీతిరత్నాకరం అముద్రితం.

**కృష్ణాజి (17 శ.) (కృష్ణమాంబ)**

విజయరాఘవ నాయకుని ఆస్థానంలో ప్రసిద్ధి పొందిన కవయిత్రి. సంస్కృతాంధ్రాల్లో ఈమెకు గల కవితాచాతుర్యాన్ని చెంగల్వ కాళకవి ప్రశంసించినాడు.

**కుప్పమ్మ (13 శ.)**

అయ్యలరాజు రామభద్రుని సకల కథాసార సంగ్రహంలో ఈమె ప్రసక్తి కనిపిస్తుంది.

**కేతన, నండూరి (14 శ.)**

మంచన కేయూర బాహుచరిత్ర కృతిపతియైన నండూరి గుండయ మంత్రికి అన్న. ఈతడు కవి అని కేయూరబాహు చరిత్రలోని కింది పద్యంవల్ల తెలుస్తుంది

నూతన దర్పకుండన మనోహరమైన సురూపమొంది వి
ఖ్యాత కవిత్వ సంపదఁ బొగడ్తకు నెక్కి యశేషబాంధవ
వ్రాత హితాత్ముఁడై గణకవర్గ కళా మహిమన్ బ్రగల్భుడై
కేతనమంత్రి దిగ్భరిత కీర్తి వహించె నమాత్యకోటిలోన్

విఖ్యాత కవిత్వ సంపదతో పొగడ్తకెక్కిన కేతనమంత్రి రచించిన కావ్యాలను గురించి తెలియరాదు. కువలయాశ్వ చరిత్రను రచించిన కేతన కవి ఈతడేనేమో నిర్ణయంగా చెప్పలేం.

**కొండరాజు, అయ్యలరాజు**

అయ్యలరాజు నారాయణరాజు తన వంశీయుల్లో సత్కవితా రచనాఢ్యులైన కవీంద్రులను సన్నుతిస్తూ హంస వింశతి అవతారికలో అయ్యలరాజు కొండరాజును పేర్కొన్నాడు.

అయ్యలరాజు తిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామ భ
ద్రయ్యను బాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగు కొండధీరునిం
బయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజవంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. (1-11)

దీనినిబట్టి అయ్యలరాజువంశం కవివంశమని చెప్పవచ్చు.

గణనాథకవి (గణేశకవి)

దోమకొండ (బిక్కనవోలు) సంస్థానాధీశుడైన కామిరెడ్డి (16 శ.) కి, పద్మపురాణాది కృతి కర్తయైన మల్లారెడ్డికి సమకాలికుడు. కుతుబ్షాహీ రాజుల ఆస్థానాన్ని అలంకరించిన కవీశ్వరుడు. సంస్కృతాంధ్ర భాషల్లో చక్కని కావ్యాలు రచింపగల విచక్షణుడు. కామినేని మల్లారెడ్డి తన పద్మ పురాణంలో గణనాథకవిని ఈ విధంగా ప్రశంసించినాడు.

ధీనిధి సాహితీయుతుఁ బ్రకీతయశుం గుతుపావనీశ్వరా
స్థాన మహాకవీంద్రు నిజదర్శన కౌతుకవైభవాగతున్
శ్రీ నరసింహపండితవరేణ్యకుమారు గణేశధీరు స
న్మానముతో నెదుర్కొని నమస్కృతి జేసి వసింపజేయుచున్

(అవతారిక 25)

నీవు జగత్ప్రసిద్ధుడవు నిండుమతిం బదవాక్య మాన వి
ద్యావిదు తా రసజ్ఞమణు తానని మెచ్చగ సంస్కృతాంధ్ర భా
షావర కావ్యకల్పనవిచక్షణతన్ గణనాథసత్కవీ
దేవగవీ పయోఝర సదృగ్వచనా ప్తయశోహరచ్ఛశీ

(అవతారిక. 27)

గిరిరాజకవి

ప్రసిద్ధ వాగ్గేయకారుడైన త్యాగరాజుకు తాత. ఈయన తెలుగులో భక్తి, వేదాంత కీర్తనలెన్నో రచించినాడట.

గురవయ్య, రావూరు

వీరనారాయణ శతకకర్త రావూరు సంజీవయ్యకవికి తండ్రి. ఈతడు కొండవీటిలో ఉండడంవల్ల కాబోలు ఈతణ్ని కొండవీటి పెదరావు గురవయ్య అని పిలిచేవారట. ఈతడు 18 వ శతాబ్దికి చెందినవాడు.

గోపన, పొట్టూరి

ఈతడు రచించిన ఒక పద్యం అప్పకవీయంలో నామాఖండయతికి ఉదాహరణంగా ఈయబడింది. (3.224) ఈ పద్యం అతని ఏ కావ్యంలోనిదో తెలియదు. ఈతడు 1670కి పూర్వుడు.

**తిమ్మకవి, ఏనుగు**

శతృహరిసుభాషితత్రిశతిని ఆంధ్రీకరించిన ఏనుగు లక్ష్మణకవి తండ్రి. ఈతడనేక రాజాస్థానాల్లో గౌరవాలు పొందిన కవీశ్వరుడు. దివ్యభారతి బిరుదాంచితుడు. సరస కవితా ప్రవీణుడు. ఈతని కుమారుడు ఏనుగు లక్ష్మణకవి తన రామవిలాసకావ్యంలో ఈ వివరాలు పేర్కొన్నాడు.

సకలపార్థివాస్థానపూజితు భాగ్యవంతు
సరసకవితాప్రవీణు మజ్జనకుఁ దలతు
దివ్యభారతి ఏనుగు తిమ్మసుకవి (1-18)

**తిమ్మయ్య, అయ్యలరాజు**

అయ్యలరాజు నారాయణకవి వంశీయుడు. హంస వింశతి అవతారికలో ఈ కవీంద్రుని ప్రసక్తి ఉన్నది. చూ: అయ్యలరాజు కొండరాజు.

**దేవలి పంతడు**

ఈతడు గుంటూరు మండలంలోని చేబ్రోలులో ఉన్న కుమారస్వామికి అఖండ దీవదానం చేసి ఒక శిలాశాసనం వేయించినాడు. ఆ శాసనంలోని కింది పద్యంవల్ల ఈతడు దేశి, మార్గ కవితలు రెండింటిలోనూ ఆద్యకవులవలె కవిత చెప్పినట్లుగా తెలుస్తుంది.

తలఁపు సదర్థభావనముఁ దద్గతసూక్తులఁ గూడ వర్ణనల్
గొలుసుగొనంగఁ బ్రావడులు గోరినభంగిన వచ్చి ముట్టఁ గో
మలగతి దేసి మార్గములు ముట్టువడన్ ఘటనంబు నా
ద్యులక్రియఁ జెప్పనేర్చె నృపధూర్జటి భీమయ పండడిమ్మహిన్

ఈతడు క్రీ శ. 1145 ప్రాంతంలో ఉండినట్లు చాగంటివారి నిర్ణయం. ఈతని తండ్రి భీమయ.

**దత్తన, తరిగొప్పుల (15, 16 శ.)**

చంద్రభాను చరిత్రను ద్విపదగా చెప్పిన తరిగొప్పుల మల్లనకు అన్న. దత్తన రాతలు ద్వీపాంతర నృపులను కూడా ఆకర్షించేవని మల్లన తనకృతిలో ప్రశంసించినాడు. ద్వీపాంతరనృపులను కూడా ఆకర్షించిన ఆ కృతులేవో?

**దేచిరాజు, రావరది**

ఈతడు రచించిన ఒక పద్యం ప్రబంధ రత్నావళిలో ఉదాహరింపబడింది. ఈ పద్యం అతని ఏ కృతిలోనిదో తెలియదు. ఇందులో పురవర్ణన ఉంది.

**నరసింగన్న, తాళ్ళపాక (15 శ.)**

పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యుని కుమారుడు. తెనాలి రామకృష్ణకవి తాళ్ళపాక కవులను ఈ విధంగా ప్రశంసించినాడు:

చిన్నన్న ద్విపద కెఱుగును
చెన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుగున్
మిన్నంది మొఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్

దీనినిబట్టి నరసింగన్న పద్య గద్య శ్రేణిని మిన్నంది మ్రోగిన కవీశ్వరుడని తెలుస్తున్నా ఆతని కృతులవైనం మాత్రం తెలియదు. కవికర్ణరసాయనకర్త సంకుసాల నృసింహకవియే నరసింగన్న కావచ్చునని వేటూరివారు అభిప్రాయపడినారు.

**నరసింహం, కోయనపల్లి**

కోన నారాయణకవి తన వజ్రాభ్యుదయంలో ఈతని కవిత భాగీరథీ రయమధురతాతరమని ప్రశంసించినాడు. ఆ మధుర కవితా కృతులు నామ మాత్రానికైనా తెలియరావు.

**నారాయణభట్టు**

"పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు" అనే భారతపద్యం (ఆది. 1-24) వల్ల నన్నయకు మహాభారత రచనలో నారాయణభట్టు తోడ్పడినట్లుగ తెలుస్తుంది. "యః సంస్కృత, కర్ణాట, పైశాచి కాంధ్రభాషాసు కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన" అనే నందంపూడి శాసనంలోని వాక్యం నారాయణభట్టు సంస్కృత, కర్ణాట, పైశాచిక భాషలతోపాటుగా తెలుగుభాషలో కూడా కవిరాజశేఖరుడుగా ప్రసిద్ధుడైనట్లు తెలుపుతుంది. ఇట్టి కవిరాజశేఖరుని సుకవితావిభవాన్ని తెలిపే కృతుల వివరాలు తెలియవు.

**నృసింహకవి, లయగ్రాహి (17,18 శ.)**

కౌసలేయ చరిత్రను రచించిన లయగ్రాహి గరుడాచల కవికి తండ్రి. గరుడాచలకవి తన కౌసలేయచరిత్ర అవతారికలో నృసింహకవిని గురించి ఈ విధంగా పేర్కొన్నాడు.

సీతాపతితనయుల వి
ఖ్యాతుల సంజీవి, వేంకటాఖ్యుల సుకవి
వ్రాతస్తుతకవితాఘను
మా తండ్రి నృసింహకవిని మాటికిఁ దలతున్.

గరుడాచల కవి కౌసలేయ చరిత్ర అముద్రితం. చూ: చరిత్రకెక్కని చరితార్థులు, 56 పుట.

**నరసింహకవి, తరణివాయి (18 శ.)**

ఈతడు లక్షణశిరోమణికర్త పౌత్రపి వెంకట రమణకవికి గురువు. వేంకటరమణకవి లక్షణశిరోమణి అవతారికలోనూ, ఆశ్వాసాదిపద్యాలలోనూ ఈ విధంగా ప్రశంసించినాడు.

ధరఁగలుగు సకలవిద్యా
పరిగణితు నతసుకవిసార్వభౌముని నస్మ
ద్గురుఁ దరణివాయి కులగురు
నరసింహ కవీంద్రు నెమ్మనమ్మునఁ దలఁతున్ (1.6)

తరణివాయాన్వయాబ్ధి సుధాంశుఁడనఁగ
వెలయు మద్గురుఁ జాతుర్యవివిధకరణ
శబ్దతర్కాది నిఖిల శాస్త్రప్రవీణుఁ
గవిజనబ్రహ్మ నరసింహకవిఁదలంతు. (2.3, 3.3, 4.3)

వీటిని బట్టి నరసింహకవి కవిజన బ్రహ్మయని, సుకవి సార్వభౌముడని తెలుస్తుంది. కాని ఈతడు రచించిన కృతుల వివరాలు తెలియరావు.

**పెదరాఘవకవి, వెలిదండ్ల**

ఈతడు సుదంతా పరిణయకర్త వెలిదండ్ల అళగిరి కవికి తండ్రి. వేంకటపతికి సోదరుడు. విజయరంగ చొక్కనాథునికి పరమాప్తుడైన పారిషదుడట. అళగిరి ఈతణ్ని "మధురాంధ్రకవన గుంఫనకళా చతురు' డని ప్రశంసించినాడు. కాని ఈతని కృతులు తెలియరావు.

**పెద్దయామాత్యుడు (13 శ.)**

జక్కన తాత. నెల్లూరు పాలించిన రెండో తిక్కరాజు ఆస్థానాన్ని అలంకరించినవాడు జక్కన విక్రమార్క చరిత్రలో ఈతని విద్వత్కవితా వైభవాన్ని ఈ విధంగా కొనియాడినాడు.

ఆంధ్రకవిత్వంబునందు ప్రబంధంబు
మేలుగాఁ దద్జ్ఞులు మెచ్చఁ జెప్ప
వృత్తకందముఁ గందవృత్తంబునుం జతు
ష్కందంబు మొదలుగాఁ గలుగు గర్భ
కావ్యవర్గము జెప్పఁగాఁ బ్రబంధంబులు
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ.

గా;.....................................

అనుచు నెల్లూరి తిరుకాళ మనుజవిభుని
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమగాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమడవు నీవు............(1.20)

తద్జ్ఞులు మెచ్చే విధంగా చెప్పిన ఈతని ప్రబంధాల పేర్లైనా మనకు తెలియవు.

**పర్వతరాజు, అయ్యలరాజు**

అయ్యలరాజు నారాయణ వంశీయుడైన కవి. హంసవింశతి అవతారికా పద్యం (11)లో ఈ కవి ప్రసక్తి కనిపిస్తుంది. రచనల వివరాలు తెలియవు. చూ: అయ్యలరాజు కొండరాజు.

**ప్రకాశభారతీయోగి**

అనవేమారెడ్డి ఆస్థానంలో ఉన్న తెలుగు కవి. దాక్షారామ భీమేశ్వ రాలయంలో అనవేమ భూపాలుడు కట్టించిన గొప్ప కట్టడాలను గురించి ఈ కవి సీస పద్యాలతో శాసన కావ్యం రచించినాడు. ఇతర కావ్యాల వివరాలు తెలియవు. (చూ: రెడ్డిరాజులు - ఆంధ్ర వాఙ్మయ సేవ; హైదరాబాదు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.)

**బయ్యన (భైరవుడు)**

భోజరాజీయాది కృతికర్తయైన అనంతామాత్యుని ముత్తాత. అనంతుడు భోజరాజీయం అవతారికలో బయ్యన తిక్కనచే భవ్యభారతి అనే బిరుదం పొందినాడనీ, భాసురకవితాచతురుడనీ, కవిరత్నమనీ ప్రశంసించినాడు.

"…. తిక్కనకవినాయకుఁడాదట మెచ్చి భవ్యభారతి యనఁ బేరుగన్న కవిరత్నము బయ్యనమంత్రి యల్పుడే" (1.8)

తిక్కనచే భవ్య భారతియని ప్రశంసింపబడ్డ కవిరత్నమైన బయ్యన కావ్యరత్నాలేవో తెలియవు.

**భవదూరుడు**

ఎడ(పెద)పాటి ఎఱ్ఱన మల్హణ చరిత్ర అవతారిక (1-9)లో పూర్వ కవిస్తుతి సందర్భంలో ఈతనిని స్తుతించినాడు. ఈతని రచనలు తెలియవు. ఎఱ్ఱన 17 వ శతాబ్దికి చెందినవాడు కనుక భవదూరుడు 17 వ శతాబ్దికి పూర్వు డని భావించవచ్చు. అయ్యంకి బాలసరస్వతి, దుర్గా రామకవి రచించిన నాగర ఖండంలోకూడా పూర్వకవి స్తుతిలో భవదూరుని ప్రసక్తి కనిపిస్తుంది.

**మల్లకవి, వారణాసి**

రామచంద్రోదయ కావ్య కర్త వారణాసి వేంకటేశ్వర కవికి చిన్నా యన. వారణాసి లక్ష్మణకవికి కుమారుడు. ఈతడు ఉభయ భాషా కవిత్వ విశేషఘనుడని-రామచంద్రోదయకావ్యావతారికలో ప్రశంసింపబడినాడు.

**మధురవాణి**

రఘునాథ భూపాలునిచే స్వర్ణాభిషేక గౌరవాన్ని పొందిన కవయిత్రి. ఈమె సంస్కృతంలో రచించిన రామాయణసార కావ్యం లభిస్తుంది. తెలు గులో కూడా ఈమె గొప్ప కవయిత్రి అని ఆమె రామాయణసారకావ్యంలోని సర్గాంతశ్లోకంవల్ల తెలుస్తుంది.

మాధుర్యైకధురంధరాంధ్రకవితాసమ్మాన్యయా
దీవ్యోద్యన్మతిపఖ్యయా మధురవాణ్యంబాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారనామని మహాకావ్యేఽతిభవ్యే.....

ఈమె రచించిన తెలుగుకావ్యాల పేర్లైనా మనకు తెలియవు.

**మాధవకవి, లయగ్రాహి**

లయగ్రాహి గరుడాచలకవి కౌసలేయ చరిత్ర అవతారికలోని కింది. పద్యంలో ఈ కవి ప్రసక్తి కనిపిస్తుంది.

మాధవ భక్తియుక్తుఁడసమాన కవిత్వగురుండు కృష్ణరా
యాధిపదత్త సద్గజవరాది మహాబహుమానశాలి గం
గాధర కీర్తిసాంద్రుడు జగత్కవిచంద్రుడు మత్కులేంద్రుడౌ
మాధవుడన్మదాదులకు మాన్యుడు గాడె తలంచి చూచినన్

పై పద్యంవల్ల మాధవకవి అసమాన కవిత్వగురుడనీ, జగత్కవిచంద్రుడనీ కృష్ణరాయలచే సద్గజవరాది బహుమానాలు అందినాడనీ ప్రశంసింపబడినాడు. ఇన్ని వివరాలు తెలిసినా ఈతని కృతుల వివరాలు తెలియకపోవడం విచారించదగ్గ విషయం.

**రామభద్రాంబ (17 శ.)**

రఘునాథ నాయకుని ఆస్థానంలో విలసిల్లిన కవయిత్రి. చెంగల్వ కాళకవి తన రాజగోపాల విలాస కావ్యంలో ఈమె తెలుగులో కవయిత్రి అని విజయరాఘవుని ముఖతః ప్రశంసించినాడు. ఈమె సంస్కృతంలో రచించిన రఘునాథాభ్యుదయం లభిస్తున్నా తెలుగు రచనల వివరాలేవీ తెలియవు. ఈమె చెంగల్వ కాళకవి శిష్యురాలు.

**రంగకవి, కొటికెలపూడి**

కొటికెలపూడి సూరకవి పుత్రుడు. వీరరాఘవాచార్యుల తండ్రి. రాఘవాచార్యులు భారతం ఉద్యోగపర్వం అవతారికలో ఈ కవి ప్రసక్తి కనిపిస్తుంది. చూ: కొటికెలపూడి సూరకవి.

**లక్ష్మీపతికవి, పైడిపాటి**

ఈతడు 'వరసమ్యక్కవితా చమత్కృతమతి'గా పేరు పొందిన కవీశ్వరుడు. కృతులు తెలియవు.

**లక్ష్మణకవి, వారణాసి.**

వారణాసి వేంకటేశ్వరకవి కృతమైన రామచంద్రోపాఖ్యానం అవతారికలో కవి వంశావతారాన్ని వర్ణిస్తూ తమ వంశానికి మూల పురుషుడైన లక్ష్మణకవిని సంస్కృతాంధ్ర కవిత్వ విశారదుడని ప్రశంసించినాడు. ఈతని ఆంధ్రకృతుల వివరాలేవీ తెలియవు.

వారణాసివారిది కవి పండిత వంశం. సాహిత్యరత్నాకర కర్త ధర్మసూరి వారణాసివంశీయుడే.

**లింగన, చెదలువాడ (16 శ.)**

విప్రనారాయణ చరిత్ర రచించిన చెదలువాడ మల్లనకు తండ్రి. మల్లన విప్రనారాయణ చరిత్ర అవతారికలో తన తండ్రి లింగన కవి అనీ, రాజులు మెచ్చేటట్లుగా అనేక కావ్యాలు రచించినాడనీ పేర్కొన్నాడు.

రాజాల్మెచ్చగఁజెప్పి కావ్యములు హేరాళంబుగా నద్రిక
న్యాజానిన్ భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినమున్ బంచాక్షరీమంత్రమున్
తేజోవంతుడు లింగనార్యుడు గుణోత్కృష్టుండు మీ
తండ్రియున్ (1 - 20)

**వీరరాఘవుడు, తెనాలి (16 శ.)**

ఇందుమతీపరిణయకర్త తెనాలి వీరభద్ర కవికి అన్న. తెనాలి శ్రీగిరి కవికి మనుమడు. సర్వకవితా మహత్త్వంలో ఈతడు తన తాత తండ్రులందరినీ మించినట్లుగా రామభద్రకవి ఇందుమతీ పరిణయావతారికలో పేర్కొన్నాడు.

వారలను మించె మీ యన్న వీరరాఘ
వాఖ్య కవి సర్వకవితామహత్త్వమునను
నిన్నసూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జకవి రామభద్ర సుకవి! (22 వ.)

**వెంకటజగన్నాథాచార్యులు, మరింగంటి**

నేబతి కృష్ణయామాత్యుని రాజనీతి రత్నాకరం అవతారికలోని కింది పద్యంలో ఈతని ప్రసక్తి కనిపిస్తుంది.

గురుమూర్ధన్యు శతావధానబిరుదాంకున్ ద్రావిడామ్నాయత
త్త్వరసజ్ఞున్ పటుసంస్కృతాంధ్రకవితా దక్షున్ హయాధీశకం
ధర సంలబ్ధ సువర్ణ వృష్టియుతు కర్ణాటక్షమాభృత్సభాం
తరపూజ్యున్ మరిగంటి వేంకటజగన్నాథార్యుఁ గీర్తించెదన్ (1.18)

పై పద్యంవల్ల ఈతడు శతావధాన బిరుదాంచితుడనీ, ద్రావిడామ్నాయాల్లో పండితుడనీ, సంస్కృతాంధ్ర రచనాదక్షుడనీ, కర్ణాటరాజు సభలో పూజితుడనీ తెలుస్తుంది. రచనాదక్షుడైన ఈతని రచనల వివరం తెలియదు.

**వెంకటపతి, వెలిదండ్ల**

ఈతడు కవిసార్వభౌమబిరుదాంచితుడు. తిరువేంగళాచార్యుని పుత్రుడు. సుదంతా పరిణయ కావ్యకర్త వెలిదండ్ల అళగిరికవికి పెదతండ్రి. వెంకటపతి అనేక శుద్ధాంధ్ర కృతులను రచించి అచ్చతెనుగు వెంగనగా ప్రసిద్ధిపొందినట్లు అళగిరికవి సుదంతాపరిణయం అవతారికలో పేర్కొన్నాడు.

అంద్రగజాదర్చిత గో
విందపదుండచ్చతెనుగు వెంగన వెలసెన్

ఆమేరు రామేశ్వరావని విఖ్యాత
మేనేత శుద్ధాంధ్రకృతిసహస్ర

అతడు చెలువొందుఁ దిరువెంగళార్య గర్భ
జలధి కమలాది దుష్క విస్మయవిదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి
బంధుపరితోషి వేంకటపతి మనీషి

ఈయన రచించిన ఒక్క శుద్ధాంధ్రకృతిపేరైనా మనకు తెలియదు.

**వేంకటేశ్వరకవి, వారణాసి**

ఈతడు 'సమస్తదేశ విలసద్భాషా కవిత్వాది విద్యాసంపాదితరత్న హేమ వసనక్ష్మారామ భూషాముఖ శ్రీ సత్కారు'దని వారణాసి లక్ష్మణ కవి రామచంద్రోదయ కావ్యావతారికలో ప్రశంసింపబడినాడు.

**శ్రీ రంగశాయి, కొటికెలపూడి**

కొటికెలపూడి వీరరాఘవచార్యుల తాత. ఈతని ప్రసక్తి కొటికెలపూడి వీరరాఘవాచార్యుల ఉద్యోగపర్వం అవతారికలో కనిపిస్తుంది. ఈతడు ఇభ రామభూపతి ఆస్థానంలో ఉండి జయశ్రీలతో వెలిగిన కవీశ్వరుడు.

ఇభరామభూపిభు సభ జయశ్రీలఁ జె
లంగె మా తాత శ్రీరంగశాయి (ఉద్యోగపర్వం, అవతారిక)

**సర్వకవి, లింగమకుంట**

ఆనందకానన మాహాత్మ్యాది కావ్యకర్తయైన లింగమకుంట రామకవికి తాత. తన తాత సర్వకవి కవిసార్వభౌముదని రామకవి ఆనంద కానన మాహాత్మ్యంలో పేర్కొన్నాడు కాని అతని కృతులను పేర్కొలేదు. ఐతే ఉదాహరణ పద్యములు అన్న సంకలన గ్రంథంలో సర్వదేవకవి రచించిన ఆది పురాణం నుండి, విరాట పర్వంనుండి పద్యాలు ఉదాహరింపబడ్డాయి. ఈ సర్వదేవకవి, లింగమకుంట సర్వకవి ఒక్కరేనేమోనని విమర్శకుల అనుమానం. ఈ అనుమానం తొలగిపోయేవరకు లింగమకుంట సర్వకవి సర్వదేవునికన్నా భిన్నుడనే భావిద్దాం.

**సర్వకవి**

మేడవరపు సుబ్రహ్మణ్యస్వామి గణేశచరిత్రకావ్యం (అముద్రితం) లో పూర్వకవిస్మృతిలో సర్వకవి ప్రసక్తి కానవస్తుంది.

మును వాల్మీకుని వ్యాసుని
ఘనుడగు శ్రీ కాళిదాసకవి నన్నయభ
ట్టును మేడవరపు హేమా
ద్రిని సర్వకవిందలంతుఁ దేజమెలర్పన్

ఆనందకానన మాహాత్మ్యాది కావ్య రచయిత లింగమకుంట రామన తాత పేరు సర్వకవి. ఆది పురాణాన్ని రచించిన మరో సర్వకవి కూడా ఉన్నాడు. కాని ఈతడు ఈ ఇద్దరిలో ఒకడో లేక భిన్నుడో చెప్పలేము.

**హేమాద్రి, మేడవరపు**

మేడవరపు సుబ్రహ్మణ్యస్వామి తన గణేశ చరిత్రలో ఈ కవిని స్మరించినాడు. చూ:- సర్వకవి.

**సాధుభట్టరార్యుడు, ముడుంబ**

నేబతి కృష్ణయామాత్యుని రాజనీతి రత్నాకరంలో ఈతడు అష్ట భాషా కవిత్వవిద్యాధురీణుడుగా ప్రశంసింపబడినాడు. కాని కృతుల వివరాలు తెలియవు.

**సిద్ధనమంత్రి**

ఈతడు జక్కన విక్రమార్క చరిత్ర కృతిపతి. కవులు మెచ్చే విధంగా నవ్యకావ్యాలు రచించిన సత్కవి అని జక్కన విక్రమార్క చరిత్రలో ఈ విధంగా ప్రశంసించినాడు.

నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చగా నొనర్చె (అవతారిక. 50)

నవరసాల్లో రచింపబడ్డ ఆ నవ్యకావ్యాలేవో మనకు తెలియరావు. విక్రమార్క చరిత్ర ఆశ్వాసాద్యంత పద్యాలలోని శ్రీ మద్వాణీ విలాస జిహ్వాగ్రతలా, కవితాకారా, రామాయణ సుప్రలాప రసిక కలాపా' (2 . 261) అనే సంబోధనలవల్ల సిద్ధనమంత్రి గొప్ప కవి అనటంలో సందేహం లేదు. చివరి సంబోధనవల్ల ఈతడు రామాయణాన్ని రచించినట్లుగా ఊహించవచ్చు.

**సీతారామయ్య, నుదురుపాటి**

ఆంధ్రభాషార్ణవకర్త నుదురుపాటి వెంకనార్యునికి తండ్రి. తన తండ్రి సీతారామయ్య ఎన్నో ప్రబంధాలు రచించినాడని, మహోద్దండకవి బిరుదాంచితుడనీ వెంకనార్యుడు పేర్కొన్నాడు. కాని అతని ప్రబంధాల పేర్లు మనకు తెలియరాలేదు.

**సీనయ్య, వంగల**

శేషం వెంకటపతి శశాంక విజయం అవతారికలో ఈతణ్ణి 'సరసపద్య గద్య రచనా భోజుడనీ, అలంకారిక సమ్మతోజ్జ్వల కవిత్వాగాధు' డనీ కొనియాడినాడు. ఈతడు సంగీత విద్యా విశారదుడు కూడా. ఈతని పద్యాలు కొన్ని లభ్యమౌతున్నా కావ్యాల వివరాలు తెలియవు.

**సూరకవి, కొటికెలపూడి**

కొటికెలపూడివారిది కవిపండితవంశం. గద్వాలప్రభువుల ఆస్థానంలో ఉండి యథా శ్లోక తాత్పర్య భారతం, నవీనం ద్రోణ పర్వం రచించిన కొటికెలపూడి వీరరాఘవాచార్యులు భారతం ఉద్యోగపర్వం అవతారికలో తన వంశావతారాన్ని చెప్పుకున్న కింది పద్యంలో ఈ సూరకవి ప్రసక్తి కనిపిస్తుంది.

వరమొందె నతఁ డేడుతరము లాత్మీయసం
    తతి విద్యలు ఫలింప తపనుచేత
నా 'సూరకవి' యె రాయలదేవు సభ పూజ
    దాల్చె నతఁడు మా తాత తండ్రి
యిభరామభూవిభు సభ జయశ్రీలఁ జె
    లంగె మా తాత శ్రీరంగశాయి
యతనికి ప్రతిబింబమై యట్లు మా తండ్రి
    రంగకవీంద్రుండు ప్రౌఢి చెందె

దీనివల్ల సూరకవి కొటికెలపూడి రాఘవాచార్యుని ముత్తాత అనీ, రాయలవారి సభలో సన్మానితుడనీ తెలుస్తుంది. కాని ఈతని రచనల వివరాలేమీ తెలియవు.

**సూరన (13 శ.)**

ఈతడు కవిత్రయంలో ఒకడైన ఎఱ్ఱనకు తండ్రి. ఎఱ్ఱన నృసింహ పురాణంలో తన తండ్రి సూరనను ఈ విధంగా స్మరించినాడు.

ప్రాజ్ఞ ప్రస్తుత భవ్యభోగ విభవస్ఫారాత్ముఁడారాధ్య స
ర్వజ్ఞుండప్రతిమాద్భుతోభయకవిత్వప్రౌఢశబ్దార్థయో
గాజ్ఞా సిద్ధఘనుండు మజ్జనకు డుద్యత్కీర్తి శ్రీ సూర్యుఁడే
విజ్ఞానాత్మకవాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్ (I-25).

ఉభయ భాషల్లో అప్రతిమంగా, అద్భుతంగా కవిత చెప్పగల సూర నార్యుడు రచించిన కావ్యాలేమిటో తెలియవు.

**సూరన, వారణాసి**

వారణాసి లక్ష్మణకవి రామచంద్రోపాఖ్యానంలో ఈ కవి ప్రసక్తి కనిపిస్తుంది.

* * *

## అనుబంధం I

# అలబ్ధకావ్యకర్తలు—కావ్యాలు

| | |
|---|---|
| అగస్త్యుడు | అగస్త్యవ్యాకరణము |
| అథర్వణుడు | అథర్వణచ్ఛందము |
| అధోక్షజుడు | అధోక్షజఫక్కిక |
| అనంతకవి, చిత్రకవి | ఇందుమతీ పరిణయము |
| | త్రిలోకసంజీవని |
| | వంశావళి |
| | విష్ణుచిత్తీయవ్యాఖ్య |
| | సకలజీవసంజీవనము |
| | హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్య |
| | హరిహరశ్లేషోదాహరణము |
| అనంతయ్య, సోమయాజి | శంతనుచరిత్ర |
| అనంతార్యుడు, ఏనుగు | గౌరీపరిణయము |
| అన్నమయ్య, కానుకొలను | అమరుకము |
| అన్నమాచార్యులు, తాళ్ళపాక | మంగాంబికాశతకము |
| | రామాయణము (ద్వి) |
| అప్పకవి, కాకునూరి | అంబికావాదము |
| | అనంతవ్రతకథ |
| | కవికల్పకము |
| | ధర్మద్విపద |
| | (సాధ్వీజన ధర్మము) |
| | శ్రీనగాధీశశతకము |
| అప్పన, పరాతం | కృష్ణవిలాసము |
| | బృందాసంభవము |

| | |
|---|---|
| అమరేశ్వరుడు, చిమ్మపూడి | విక్రమసేనము |
| అయ్యన, కంచెర్ల | కాశీఖండము |
| ఆంధ్రభోజుడు | నీతిభూషణము |
| ఆనందరాజు | నవరామాయణము |
| ఎఱ్ఱన | ఎఱ్ఱన రామాయణము |
| ఎఱ్ఱయ | పురాణసారము |
| ఎఱ్ఱయ, కూచిరాజు | సకలపురాణసారము |
| ఎఱ్ఱాప్రెగడ, పెదపాటి | కుమారనైషధము |
| ఎల్లన, చింతలపల్లి | శిరోభూషణము |
| ఎల్లయ కవి, రావూరి | మిత్రవిందాపరిణయము |
| ఎల్లారెడ్డి, కామినేని | లింగపురాణము, వాసిష్ఠము |
| ఓబళకవి, పొన్నతోట | మార్కండేయపురాణము |
| | వామనపురాణము |
| కందనామాత్యుడు | నీతితారావళి |
| కప్పయ్య, కెళ్ళ | పారిజాతము |
| | అర్ధనారీశ్వరకలాపము |
| | సలధారుణీచరితము |
| | పారిజాతము |
| | శ్రవరాఖ్యచరితము |
| | రఘురామ శతకము |
| | శతకంఠయుద్ధము |
| | సముద్రమథనము |
| కమలనాభామాత్యుడు | పద్మపురాణసంగ్రహము |
| కవిశల్లటుడు | కవిశల్లటపక్కిక |
| | విక్రమార్కచరిత్రము |
| కవిమాధవుడు | బ్రహ్మాండపురాణము |
| కవిరాక్షసుడు | ఆదినారాయణచరిత్రము |
| కసవరాజు, తేళ్ళపూడి | కళావతీశతకము |
| కళాధరుడు | జాంబవతీకల్యాణము |

| | |
|---|---|
| కామేశ్వరకవి, ప్రయాగ | సుదంతాపరిణయము |
| కామేశ్వరకవి, లింగనమఖి | రుక్మిణీపరిణయము |
| కుప్పన, ఆలూరి | ఇందుమతీపరిణయము |
| | పంచనదీస్థలపురాణము |
| | పరమభాగవతచరిత్ర |
| | రామాయణము (యక్ష) |
| | హరికథాసుధారసము |
| కుమారధూర్జటి | సావిత్రీ చరిత్ర |
| కూర్మనాథకవి, గోగులపాటి | రామతీర్థాశ్రయశతకము |
| కృష్ణకవి, మంచెళ్ళ | రఘుపుంగవశతకము |
| కృష్ణదాసు, తిరుక్కడయూరి | భావనారాయణశతకము |
| కృష్ణప్ప, బోరవెల్లి | యయాతిచరిత్ర |
| కృష్ణమాచార్యులు, కర్పూరం | భగవద్గీత (ద్విపద) |
| కృష్ణయ, వెలగపూడి | మర్యాదరామన్నచరిత్రము |
| | గాంగేయోపాఖ్యానము |
| | చతుర్విధయోగశాస్త్రము |
| | దత్తాత్రేయచరిత్రము |
| | మాలినీమాధవీయము |
| | యోగశాస్త్రశతకము |
| | వజ్రబుజోపాఖ్యానము |
| | వేదాంతసారసంగ్రహము |
| | సుమంతోదయము |
| | సేతుమాహాత్మ్యము |
| కేతన, నండూరి | కువలయాశ్వచరిత్ర |
| కేతన ప్రెగ్గడ (భాస్కరుని కేతన) | కాదంబరి |
| కేశవయ్య, సురపురం | నిరోష్ఠ్యరామాయణము |
| కేసన (మల్లన) | దాక్షాయణీపరిణయము |
| కొండకవి, పోడూరి | భార్గవాభ్యుదయము |
| కొండయ, బొడ్డపాటి | కాళహస్తిలింగశతకము |

| | |
|---|---|
| కొమ్మన, నిశ్శంక | వీరమాహేశ్వరము |
| కోనేటిరాయలు | తెలుగువ్యాకరణపద్యములు |
| క్షేమేంద్రుడు | (చూ : లక్కాభట్టు) |
| గంగరాజు, చిరుమూరి | కుశలవోపాఖ్యానము |
| గంగాధరుడు, కాకమాని | బాలభారతము |
| గణపయకవి, రాయసం | సౌగంధికాపహరణము |
| గురురాజకవి, వడకండ్ల | అనిరుద్ధచరిత్రము |
| | గుణాలంకారమాలిక |
| | చాటుపద్యసహస్రము |
| | పద్మావతీపరిణయము |
| | భర్తృహరిశతకము |
| | రుక్మిణీపరిణయము |
| గుర్వరాజు, వణుకూరి | శమంతకమణిచరిత్ర |
| గోకర్ణుడు | సుభాషితరత్నావళి |
| గోపాలకవి, చింతలపల్లి | గోకర్ణచ్ఛందము, ఆర్యాశతకము |
| గోవిందకవి, పోలూరి | ఇందుమతీ కల్యాణము |
| గోపరాజు, పెనుమత్స | అంతర్వేదిమాహాత్మ్యము |
| గోవిందయ, కుందుర్తి | భారతీపరిణయము |
| గౌరన | నవగ్రహస్తవము |
| గౌరయామాత్యుడు | స్వరమంజరి |
| ఘట్టుప్రభువు | సత్యభామావిజయము |
| చంద్రమౌళికవి | హరిశ్చంద్రకథ |
| చిక్కయ, చెందలూరి | నాసికేతోపాఖ్యానము |
| చెన్నశౌరి, ప్రోలుగంటి | నృసింహపురాణము (ద్విపద) |
| | బాలభారతము |
| | సౌభరిచరితము |
| చౌడయ్య, గంగరాజు | నందనచరిత్ర |
| | సాముద్రికశాస్త్రము |
| జక్కన | పెమ్మయసింగధీమణీ శతకము |
| జగదేవరాయలు, ఇమ్మడి | అధ్యాత్మరామాయణము |

| | |
|---|---|
| జగన్నాథకవి | రాజనీతి |
| జగన్నాథాచార్యులు, మరింగంటి | సూతకశిక్ష |
| జగ్గన, పెదపాటి | కేదారఖండము |
| జయదేవుడు | జయదేవచ్ఛందము |
| తాతంభట్టు, వెల్లంకి | సంక్షేపభాగవతము |
| తిక్కన | విజయసేనము |
| తిప్పరాజు, కుడిచెర్ల | కాంచీమాహాత్మ్యము |
| తిమ్మన, నంది | వాణీవిలాసము |
| తిమ్మన, భద్రిరాజు | విష్ణుధర్మోత్తరము |
| తిరుమలనాథకవి, శృంగారకవి | దేవమల్లు పురాణము |
| | పద్మినీ పరిణయము |
| | పరమభాగవతచరిత్ర |
| | పరమార్థదీపిక |
| తిరుమలరాజు, ఆరవీటి | రామాయణము |
| తిరుమలకొండయ, రేవణూరి | రామచంద్రోపాఖ్యానము |
| తిరుమలనాథకవి, శృంగారకవి | పరమభాగవతచరిత్ర |
| | పరమార్థదీపిక |
| | పద్మినీపరిణయము |
| తిరుమలభట్టారకుడు | కాలామృతము |
| త్యాగరాజు | సీతారామవిజయము |
| త్రిపురాంతకుడు, రావిపాటి | అంబికాశతకము |
| | తారావళి |
| | ప్రేమాభిరామము |
| | మదనవిజయము |
| దత్తన, రాయసం | యయాతిచరిత్ర |
| దుగ్గన, దగ్గుపల్లి | కాంచీపురమాహాత్మ్యము |
| దేవరాజభట్టు | శివకాంచీమాహాత్మ్యము |
| | హరిశ్చంద్ర చరిత్ర |
| దోనయామాత్యుడు | సర్వలోకాశ్రయము |
| ధర్మయామాత్యుడు, బారిగడుప్పల | నృసింహపురాణము |

| | |
|---|---|
| నంది మల్లయ, ఘంట సింగన | కవులషష్ఠము |
| | మదనసేనము |
| నన్నయభట్టు | లక్షణ సారము |
| | చాముండికా విలాసము |
| | (చౌడేశ్వరీ విలాసము) |
| | ఇంద్ర విజయము |
| నన్నయ, మోచెర్ల | కాశీఖండము |
| నన్నెచోడుడు | కళావిలాసము |
| నరసింగన్న | ధ్రువచరిత్ర |
| నరసింహకవి, బోరవెల్లి | సౌపర్ణకాఖ్యానము |
| నరసింహభట్టు, అమ్మదూరి | షోడశరాజ చరిత్ర |
| నల్లారెడ్డి, (నల్లపరెడ్డి) | స్కాందపురాణము |
| నాగనాథుడు, పశుపతి | విష్ణుపురాణము |
| నాచన సోమన | మత్తలీలావిలాసము |
| నారాయణ కవి, నెల్లుట్ల | వజ్రాభ్యుదయము |
| నారాయణదేవుడు | కళాభిరామము |
| | (మదన కళాభిరామము) |
| నీలాద్రికవి, అడిదం | రణరంగవిజయము |
| నృసింహకవి, అంగర | రాజరాజాభిషేకము |
| నృసింహకవి, చరిగొండ | శశిబిందుచరిత్ర |
| పండితారాధ్యుడు | సంసారమాయాస్తవము |
| | భారతము |
| | వ్యాసాష్టకము |
| | రుద్రమహిమ |
| | గణాడంబరము |
| | మహిమస్తవము |
| | మలహాణము |
| | దక్షాధ్వరము |
| | మలయరాజీయము |
| పంపకవి | జినేంద్రపురాణము |

| | |
|---|---|
| పట్టాభిరామకవి | వజ్రపంజరశతకము |
| పట్టాభిరామకవి, రాళ్ళబండి | శమంతకోపాఖ్యానము |
| | మలరాజు గుండారాయణోపాఖ్యానము |
| పావయ్య, పచ్చమెట్ల | మహిషాసురమర్దనీ శతకము |
| పామనాథుడు | చెన్నబసవపురాణము (ద్వి) |
| పినవీరభద్రుడు, పిల్లలమర్రి | నారదీయము |
| | అవతారదర్పణము |
| | మాఘమాహాత్మ్యము |
| | మానసోల్లాసపారము |
| పురుషోత్తమకవి, కాసుల | భక్తకల్పద్రుమశతకము |
| | మానసబోధశతకము |
| పెదతిరుమలాచార్యుడు, తాళ్ళపాక | హరివంశము (ద్వి) |
| | ఆంధ్ర వేదాంతము |
| పెదరామామాత్యుడు, పోడూరి | కౌసల్యాపరిణయము |
| పెద్దన | పురుషార్థసారము |
| పెద్దన, అల్లసాని | హరికథాసారము |
| | అద్వైతసిద్ధాంతము |
| | సత్యావధూప్రిణయప్రబంధము |
| పెద్దన సోమయాజి, కాణాదం | శేషశైలేశలీల |
| | మత్స్య పురాణము |
| | బాహటము |
| పెద్దిరాజు, పొన్నాడ | ప్రద్యుమ్న చరిత్ర |
| పెమ్మన, భావన | అనిరుద్ధచరిత్రము |
| పేరయ కవి, బొడ్డపాటి | అనంతమహత్త్వము |
| | పద్మినీవల్లభము |
| | మంగళగిరివిలాసము |
| | మల్లికార్జునలింగశతకము |
| | శంకరవిజయము |
| | సూర్యశతకము |

| | |
|---|---|
| పేరయకవి, మండపాక | ఇందుమతీపరిణయము |
| | కుముద్వతీపరిణయము |
| | నిరోష్ఠ్యదాశరథీశతకము |
| పోతయ్య, ప్రెగ్గడపల్లి | గోదావరీశతకము |
| పోతరాజు | బేతాళపంచవింశతి |
| పోలమరాజు | పర్వతపురాణము |
| ప్రతాపరుద్రదేవుడు | నీతిసారము |
| ప్రోవణాంకకవి | ప్రబంధసారకృష్ణాభ్యుదయము |
| ఫణిభవు మాధవుడు | ప్రద్యుమ్న విజయము |
| బలభద్రరాజకవి, వత్సవాయ | శ్రీరామ శతకము |
| బసవకవి | రామాయణము |
| బసవన, పిడుపర్తి | బ్రహ్మోత్తరఖండము |
| | పిళ్ళనాయనారి కథ |
| బసవయ్య, అంగర | ఇందుమతీకల్యాణము |
| బసవయ్య, తులసి | సావిత్రికథ |
| బావన్న, పోడూరి | ఉషాభ్యుదయము |
| బాలకవి, కొట్ర | భల్లాణచరిత్రము |
| బాలభాస్కరకవి, అడిదం | శుద్ధాంధ్రరామాయణము |
| బాలసరస్వతి, ఎలకూచి | కార్తికేయాభ్యుదయము |
| | బాహటము |
| | భ్రమరగీతలు |
| | షడ్భాషావివరణము |
| | రంగకౌముదీనాటకము |
| | వామనపురాణము |
| భక్తవత్సలకవి, గుణ్ణంకొండ | కాటమరాజుకథ |
| భట్టరాజు, కస్తూరి | కొట్టియశంకరేశ్వరశతకము |
| | గౌరీకల్యాణము |
| భట్టార్యుడు | భల్లాణరాయచరిత్రము |
| భవానీశంకరుడు | శృంగారమంజరి |
| భావనారాయణ, కలిదిండి | పురుషోత్తమ ఖండము |

| | |
|---|---|
| భావన పెమ్మన | అనిరుద్ధ చరిత్ర |
| భాస్కరుడు | కందశతకము |
| | శృంగారరత్నాకరము |
| భాస్కరుడు, హుళక్కి | సునందనోపాఖ్యానము |
| | దశగతులు |
| భీమకవి. వేములవాడ | రాఘవపాండవీయము |
| | నృసింహపురాణము |
| భీమన | శివస్తుతి |
| భీమనకవి | శతకంఠరామాయణము |
| భీమన్న | మిత్రవద్ధతి |
| మన్నారుదేవుడు | విజయరాఘవాభ్యుదయము |
| మల్లన, చెదలువాడ | సంవరణచరిత్రము |
| | రుక్మాంగదచరిత్ర |
| మల్లన | వాదాంగచూడామణి |
| మల్లనకవి | పంచాస్త్రవిజయము |
| మల్లనార్యుడు, ముమ్మడి | తత్త్వచంద్రోదయము |
| మల్లసూరి, రాయసము | చంద్రభానుచరిత్రము |
| మల్లయ, నండూరి | హరదత్తోపాఖ్యానము |
| మల్లయ, నంది | మదనసేనము |
| మల్లయ, మద్దికాయల | రేవతీపరిణయము |
| మల్లయ, మలయమారుతం | కూర్మపురాణము |
| మల్లికార్జునపండితుడు | శంకరపదములు |
| | శంకరగీత |
| | దీపకళిక |
| | నీలకంఠ స్తవము |
| మల్లుభట్టు, ఘటసాని | జలపాలిమాహాత్మ్యము |
| మహాదేవకవి, రేకపల్లి | ధర్మాంగదచరిత్ర |
| | బసవపురాణమహిమ |
| మాదయకవి | దేవేంద్రవిజయము |
| మాధవుడు, పణిదపు | ప్రద్యుమ్నవిజయము |

| | |
|---|---|
| ముకుందముని | వివేకసింధువు |
| ముత్తరాజు, నెల్లూరి | పద్మావతీకల్యాణము |
| ముద్దమరాజు, రెడ్డిపల్లె | అష్టమహిషీకల్యాణము |
| ముమ్మడి తమ్మభూపతి, సుగుటూరి | కుమారార్జునీయము |
| | రాజేంద్రచోళచరిత్ర |
| | సౌందరేశచరిత్ర |
| ముమ్మన, జయతరాజు | విష్ణుకథావిధానము |
| మూర్తికవి, శాకమూని | బహుళాశ్వచరిత్ర |
| మోహనాంగి | మారీచీపరిణయము |
| రంగకవి, కస్తూరి | హరవిలాసము |
| రంగనాథుడు, చక్రపాణి | గిరిజాధినాయకశతకము |
| | చంద్రాభరణశతకము |
| | వీరభద్రవిజయము |
| | శరభచరిత్ర |
| | శివభక్తిదీపిక |
| | శ్రీగిరినాథవిక్రమము |
| రంగశాయి, చేకుమళ్ళ | కృష్ణ దండకము |
| | జానకీపరిణయము |
| | తిరువళ్ళూరు వీరరాఘవశతకము |
| | ద్విపదభాగవతము |
| రంగాజమ్మ, పసుపులేటి | సంగ్రహభాగవతము |
| | సంగ్రహభారతము |
| | సంగ్రహరామాయణము |
| రఘునాథనాయకుడు | అచ్యుతాభ్యుదయము |
| | గజేంద్రమోక్షము |
| | పారిజాతాపహరణము |
| | రుక్మిణీవివాహము |
| రాచమల్లు కవులు | శృంగారషష్ఠము |
| రామకవి, ధర్మవరం | ముకుందవిలాసము |

| | |
|---|---|
| రామకవి, లింగమగుంట | మత్స్యపురాణము |
| | వామనపురాణము |
| | వేంకటమాహాత్మ్యము |
| రామన, ముద్దరాజు | రాఘవపాండవీయవ్యాఖ్య |
| రామన్న, లింగమకుంట | లక్షణతిలకము |
| | లక్షణసారము |
| రామన్నకవి, పోడూరి | నిరోష్ఠ్యజానకీకల్యాణము |
| రామభద్రరాజు | నీలగిరినాథశతకము |
| రామభద్రరాజు, రేకపల్లి | పద్మినీపరిణయము |
| రామయ్య, ఆంధ్రకవి | విష్ణుకాంచీమాహాత్మ్యము |
| రామయ్య, కటికనేని | శ్రీకృష్ణలీలావిలాసము |
| రామయ్య, వాసిరాజు | బృహన్నారదీయము |
| రామరాజు, ఎలుకుర్తి | రామలింగశతకము |
| రామలింగకవి, తెనాలి | కందర్పకేతువిలాసము |
| | హరిలీలావిలాసము |
| రామానుజాచార్యులు, మరింగంటి | గణచతుర్థ్యుపాఖ్యానము |
| రుద్రకవి, కందుకూరి | బలవదరీ శతకము |
| లక్కాభట్టు (క్షేమేంద్రుడు) | శతపక్షిసంవాదము |
| | శూద్రకరాజచరిత్రము |
| | ముద్రామాత్యము |
| | లక్కాభట్లఛందము |
| లక్ష్మణకవి, ఏనుగు (తాత) | తుల్యానదీమాహాత్మ్యము |
| | ద్రౌపదీపరిణయము |
| | ధ్రువచరిత్ర |
| | నృసింహదండకము |
| | రాజశేఖరచరిత్ర |
| | (శల్లాణ రాయచరిత్ర) |
| లక్ష్మణకవి, ఏనుగు (మనుమడు) | విశ్వామిత్ర చరిత్ర |
| | విశ్వేశ్వరోదాహరణము |
| లక్ష్మీనృసింహకవి | నృసింహవిలాసము |

| | |
|---|---|
| లక్ష్మణకవి, గార్లపాటి | వీరభద్రచరిత్రము |
| లక్ష్మీనరసకవి, చట్రాతి | ఈశ్వరీపరిణయము |
| లక్ష్మీపతి, వారణాసి | రామాయణము |
| లింగకవి | ద్విపదభారతము |
| లింగకవి, గోపతి | చెన్నబసవ పురాణము |
| లింగకవి, పోశెట్టి | వీరసంగయ్యదేవచరిత్రము |
| | మలహణచరిత్రము |
| లింగన, తక్కెళ్ళపాటి | విద్యుత్ప్రభావిలాసము |
| | మలహణచరిత్రము |
| | శంకరదాసమయ్యచరిత్రము |
| లింగరాజు | శిష్యప్రబోధము |
| | ద్విపద భారతము |
| లింగరాజు, ధూర్జటి | ద్విపదభాగవతము |
| | పెదకాళహస్తిమాహాత్మ్యము |
| వాదీంద్రచూడామణి | ఆదిపురాణము |
| | వాదీంద్రచూడామణి |
| విజయరాఘవ నాయకుడు | ఉషాపరిణయము |
| | కంసవిజయము |
| | కృష్ణవిలాసము |
| | గోపికా గీతలు |
| | గోవర్ధనోద్ధరణము |
| | చెంగమవల్లీ పరిణయము |
| | జానకీకల్యాణము |
| | దక్షిణద్వారకాస్థలము |
| | ధనాభిరామము |
| విజయరాఘవనాయకుడు | నవనీతచోరము |
| | పాదుకాసహస్రము (ద్వి) |
| | పారిజాతాపహరణము |
| | పుణ్యకవ్రతము |

| | |
|---|---|
| | ప్రణయకలహము |
| | ఫాల్గుణోత్సవము |
| | భ్రమరగీతలు |
| | మంజరీద్విపదప్రబంధనాటకము |
| | మోహినీవిలాసము |
| | రతీమన్మథవిలాసము |
| | రాజగోపాలవిలాసము |
| | రాధామాధవము |
| | రాసక్రీడనవనీతచోరము |
| | వీరశృంగార సాంగత్యము |
| | వేడుకోలు విన్నపములు |
| | సత్యభామావిజయము |
| | సముద్రమథనము |
| విశ్వనాథకవి, వెణుతురుపల్లి | గౌరీ వివాహము |
| | హరిశ్చంద్రచరిత్ర |
| | శేషధర్మములు |
| విశ్వేశ్వరదేశికుడు | శ్రీరామవిజయము |
| విశ్వేశ్వరుడు (?) | విశ్వేశ్వరచ్ఛందము |
| | విశ్వేశ్వర శతకము |
| వీరన్న, పోచిరాజు | ఆనందలహరి |
| | కృష్ణార్జునసంవాదము |
| | పంచకావ్యములు |
| | భర్తృహరి సుభాషితములు |
| | మార్కండేయచరిత్రము |
| | ముక్తదేవుని కథ |
| | విభూతిమాహాత్మ్యము |
| | సౌందర్యలహరి |
| వీరభద్రకవి, ఊరి | కరణికోద్ధారిణి |
| వీరభద్రకవి, పక్కలంక | వాసవదత్త |
| వీరభద్రుడు | ద్రౌపదీస్వయంవరము |

| | |
|---|---|
| వీరయ్య, పిల్లలమఱ్ఱి | పురుషార్థసుధానిధి |
| వీరయ్య, పోతరాజు | త్రిపురవిజయము |
| వీరరాఘవకవి, నెల్లూరి | స్తంభోద్భవము |
| | కృష్ణభుజంగము |
| | కృష్ణలీలామృతము |
| | చాటుకథాచమత్కృతులు |
| | త్రిపురారిదండకము |
| | మంత్రపాదస్తవము |
| | రసమంజరి |
| | వల్లీ పరిణయము |
| | సర్వలోకేశశతకము |
| వెంకటకవి, ఎడవల్లి | అభిరామవాసుదేవము |
| | అఖిల పురాణసారము |
| | అభినవాంధ్ర నిఘంటువు |
| | ఆంధ్రప్రక్రియా కౌముది |
| | ఆంధ్ర ప్రతాపరుద్రీయము |
| | ఆంధ్రవసంతతిలకభాణము |
| | ఆంధ్రరసమంజరి |
| వెంకటకవి, గణపవరపు | ఉదాహరణము |
| | కఠినప్రాసశతకము |
| | కల్పితకల్పలత |
| | కృష్ణమల్లకథ |
| | జాంబవతీవిలాసము |
| | తారావళులు |
| | పరమభాగవతచరిత్ర |
| | పురాణసారము |
| | బాలరామాయణము |
| | యథావాల్మీకిరామాయణము |
| | యమకశతకము |
| | శరభాంకలింగశతకము |
| | శృంగారమంజరి |

| | |
|---|---|
| వెంకటకవి, తిరువాయిపాటి | యాదగిరి నరసింహశతకము |
| వెంకటకవి, వెణుతురుపల్లి | విష్ణుపురాణము |
| వెంకటకృష్ణకవి, కొటికెలపూడి | మేఘసందేశము |
| | దిలీపచరిత్రము |
| వెంకట నరసింహాచార్యులు, మరింగంటి | శ్రీకృష్ణ తులాభారము |
| (ద్వితీయ) | పద్మినీ కన్యకాభ్యుదయము |
| | హరివాసరవ్రతమహత్త్వము |
| వెంకటయ్య, చెంగల్వ | పార్వతీపరిణయము |
| వెంకటరమణకవి, గూణికల్లు | హరివంశము |
| వెంకటరమణకవి, చిత్రకవి | అభిమన్యువిలాసము |
| | కుమారగిరి విలాసము |
| | రాఘవ పాండవీయవ్యాఖ్య |
| | వసుచరిత్రవ్యాఖ్య |
| వెంకటరాఘవకవి, శీలం | సంపత్కుమారీయము (వేంకట విలాసము) |
| వెంకటరామయ్య. శ్రీనాథుని | శ్రీరామపట్టాభిషేకము |
| | (ఆళ్వారాయచరిత్ర) |
| వెంకటస్వామి, బండి | సుందోపసుందోపాఖ్యానము |
| వెంకటాచలకవి, కుందుర్తి | స్కాందపురాణము |
| | వచనరామాయణము |
| | వచనభాగవతము |
| | వచనభారతము |
| వెంకటాచలకవి, భాస్కర | నాంచారు పరిణయము |
| వెంకటాచలకవి, వెన్నెలకంటి | |
| వెంకటాద్రి, పెనుమత్స | ఇందుమతీపరిణయము |
| వెంకటాద్రికవి, ప్రయాగ | గోపికాంశుకాపహారము |
| వెంగమాంబ, తరిగొండ | గోపికానాటకము |
| | నరసింహవిలాసకథ |
| | రుక్మిణీనాటకము |
| | శ్రీ భాగవతము |

| | |
|---|---|
| వెంగళభూపాలుడు, దామెర్ల | కృష్ణకథ |
| వెంగళార్యుడు, వెలగపూడి | కర్ణామృతము |
| శరణమంత్రి, తామరపల్లి | సభాభిరామము |
| శరభరాజకవి, తుళ్లూరి | లవలీవివాహము |
| | శృంగారసుధార్ణవము |
| | కాళిందీపరిణయము |
| | భాగవతాభ్యుదయము |
| | ప్రజ్ఞావతీరాయబారము |
| శివదేవయ్య | పురుషార్థసారము |
| | శివదేవధీమణీశతకము |
| శివరామకవి, నెల్లూరి | మానసోల్లాసము |
| శేషాచలకవి, భాస్కర | సేతుమాహాత్మ్యము |
| శ్రీగిరికవి | శ్రీరంగమాహాత్మ్యము |
| | నవనాథచరిత్రము |
| | శ్రీగిరీశశతకము |
| శ్రీగిరికవి, తెనాలి | శ్రీశైలమాహాత్మ్యము |
| శ్రీనాథుడు | వల్లభాభ్యుదయము |
| | వాసవాభ్యుదయము |
| | శాలివాహనసప్తశతి |
| | ధనంజయవిజయము |
| | మరుత్తరాట్చరిత్ర |
| | సునందనచరిత్ర |
| | నందనందనచరిత్ర |
| | పండితారాధ్యచరిత్ర |
| సత్యనారన, కొరవి | రామాయణము |
| సర్వదేవుడు | ఆదిపురాణము |
| | విరాటము |
| సింగరన్న | త్రైశంకవోపాఖ్యానము |

| | |
|---|---|
| సింగరాచార్యులు, మరింగంటి | ఆంధ్రభాషాభూషణము |
| | అష్టభాషావిశేషకృతులు |
| | చక్రలాంఛనవిధి |
| | కవికదంబము |
| | ధనాభిరామము |
| | నలయాదవరాఘవపాండవీయము |
| | శ్రీరంగశతకము |
| | ప్రేమాభిరామము (ద్వి) |
| | రాకాసుధాపూర్ణరసపుష్ప గుచ్ఛము |
| | రామకృష్ణచరితము (ద్వ్యర్థి) |
| | వరదరాజస్తుతి |
| | శతసంహిత |
| | సకలాలంకారసంగ్రహము |
| సంజీవకవి, చింతలపల్లి | చంద్రాంగదోపాఖ్యానము |
| సర్వన్న, మలయమారుతము | భాగవతషష్ఠస్కంధము |
| సింగన, ఏర్చూరి | కువలయాశ్వచరిత్ర |
| సింగరాచార్యులు, శేషభట్టరు | కేశవవిలాసము |
| సిద్ధన ప్రెగ్గడ | శాకుంతలము |
| సిద్ధనమంత్రి | రామాయణము |
| సీనయ్య, వంగల | రామానుజచరిత్ర |
| సుబ్బరాయకవి, ముప్పిరాల | సావిత్రీచరిత్ర |
| | ప్రద్యుమ్నచరిత్ర |
| సుబ్బరాయకవి, రాజవోలు | కృష్ణార్జున సంవాదము |
| | గరుడాంజనేయసంవాదము |
| | చిత్రాంగదాపరిణయము |
| | సుదంతాపరిణయము |
| సూరన, పింగళి | గరుడపురాణము |
| | గిరిజా కల్యాణము |
| సూరయ్య, కంచిరాజు | కన్నప్పచరిత్ర |

| | |
|---|---|
| సోమన, నాచన | వసంతవిలాసము |
| సోమన, లోకేరావు | లక్షణాదేవికల్యాణము |
| | భల్లాణచరిత్రము |
| | శివరాత్రి మాహాత్మ్యము |
| | శుకరంభాసంవాదము |
| సోమనాథకవి, వేములవాడ | ధ్రువచరిత్ర |
| | గంగాగౌరీవివాదము |
| | చతుర్భుజాభిషేకము |
| | మరుత్సందేశము |
| | ముద్రాలాభము |
| | యాదవచరిత్రము |
| సోమనాథుడు, పాల్కురికి | మల్లమదేవీపురాణము (ద్వి) |
| సోమనాథుడు, పెదపాటి | అరుణాచలపురాణము |
| | త్రిపురవిజయము |
| | రత్నావళి |
| | శివజ్ఞానదీపిక |
| సోమయాజి, నాచన | కృష్ణవిలాసము |
| సోమయ్య, దామరాజు | భరతము |
| సోమేశ్వరుడు, పాలవర్తి | త్రిపురసంహారమకుటము |
| హనుమంతకవి, వల్లూరి | త్రిపురారాతివిజయము |
| | సీతావిజయము |
| హరియప్ప | ఉలూచీపరిణయము |

## అనుబంధం - II

# కర్త తెలియని కావ్యాలు

అంబాలభాణము
కవికుముదసుధాకరము
కవిజనచింతామణి
కవిమనోహరము
కళావిలాసము
కామందకము
కిరాతార్జునీయము
కిరాతార్జునీయము
కృష్ణగోపికాలంకారము
కౌస్తుభాభరణాంకము
గిరిజాపరిణయము
గోకర్ణచ్ఛందస్సు
చంద్రశేఖరచరిత్ర
చమత్కారరామాయణము
చారుదేష్ణచరితము
చిత్రశేషభాగవతము
చొక్కవజీరుశతకము
నీలకంఠయదేవ కీర్తనలు
పంచతంత్రము
పంచబాణవిలాసము
పద్మావతీచరిత్ర
పురాతనచరిత్ర
పూర్ణచంద్రోదయము
బాలభారతము
బాలభారతము
భావవంచాశతి
భాస్కరచ్ఛందము
భీమసేనవిజయము
మదనవిజయము
మధుసేనము
ముద్రారాక్షసము
యాదవామాత్యచ్ఛందము
(లక్షణ శిరోమణి)
రంగనాథశతకము
రంగశాయిశతకము
రుక్మిణీపరిణయము
లక్ష్మీనారాయణసంవాదము
లక్ష్మీపరిణయము

ఛందస్సారసంగ్రహము
జైమినిరామాయణము
దత్తాత్రేయచరిత్ర
దశకుమారచరిత్ర
దేవీవిజయము
నవభారతము
నిజలింగచిక్కనికథ
నాగాభరణము
నీలకంఠచ్ఛందము
వామన చరిత్ర
విజయరామ భూషణము
వేంకట విలాసము
శారదాదర్పణము
శాలిహోత్రము
శేషభాగవతము
శ్రీధరచ్ఛందస్సు
సుమంతోదయము
సేతుమాహాత్మ్యము
స్మరతత్త్వసారము

—: o :—

# మరికొన్ని అలబ్ధ కృతులు

**అనిరుద్ధవిజయము**

మండ లక్ష్మీనృసింహకవి త్రిలింగ శబ్దానుశాసనంలో ఈ కృతి ప్రసక్తి కనిపిస్తుంది. (శ. పరి.) బడబాగ్ని భట్టారకుడీకృతికర్త.

**ఆదినారాయణ చరిత్ర**

గణపవరపు వేంకటకవి ఆం.ప్ర.ర. (15a పు.) లోనూ, మరి రెండు ఛందో గ్రంథాల (159/7; ఆం.సా.ప; D 705 ఆం.వి.)లోనూ ఈ కావ్య ప్రసక్తి కనిపిస్తుంది. కవి రాక్షసుడు దీని కర్త. ఇందులోని ఒక్క పద్యం మాత్రమే లభ్యమౌతుంది. (చూ: అ.కా.ప.ము. 204 పు.) లక్ష్మీనారాయణ విలాస కావ్యం కూడా కవి రాక్షస కృతంగా ఆం.ప్ర.ర.లో (20a పు.) పేర్కొ-బడింది. ఆదినారాయణ చరిత్రా, లక్ష్మీనారాయణ విలాస కావ్యమూ ఒకే కావ్యమో లేక భిన్న కావ్యాలో చెప్పలేం.

**బలరామవిజయము**

ఆం.ప్ర.ర. (19a పు)లోనూ, అ. రం - ఛం - (3. 71) లోనూ ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహరించబడ్డవి. నంది సింగయ ఈ కావ్యకర్త అని వీటిలో ఉన్నది. నంది-ఘంటల జంటలో నంది వంశీయుడు మల్లన కావి సింగన కాదు. నంది మల్లయ అనడానికి బదులుగా నంది సింగయ అని పేర్కొనడం జరిగిందో, లేక నంది వంశంలో సింగన కూడా ఉన్నాడో! ఆం.ప్ర.ర.లో ఉదాహృతమైన 'లోకస్తుత' అనే ఈ కావ్యంలోని పద్యం ఘంట నాగయ బల రామ విజయం లోనిదిగా పేర్కొ-బడింది. ఈ కావ్యంలోని మొత్తం ఐదు పద్యాలు లభ్యమైనాయి. (చూ: అ. కా. ప. ము. 88, 89 పు.)

**మరున్నందనశతకము**

లక్షణసార సంగ్రహకర్త చిత్రకవి పెద్దన చెప్పిన ఆంజనేయశతకమే మరున్నందన శతకమని నిడుదవోలువారు ల. సా. సం. పీఠికలో నిరూపించి నారు. కాకినాడ ఆం. సా. ప. లోని ఒకానొక ఛందోగ్రంథ తాళపత్ర ప్రతి

(159/7) లో మాత్రం ఇది వెన్నెలకంటి చంద్రశేఖరకవి కృతంగా పేర్కొబడింది. ఈ శతకంలోనివి రెండు పద్యాలు మాత్రమే లభ్యమైనాయి. (చూ: అ. కా. ప. ము. 102 పు.)

**మిత్రవిందాపరిణయము**

చక్రపాణి రంగనాథుడు ఈ కృతికర్త. ఇందులోని ఒక పద్యభాగం ఆం. ప్ర. ర. (159) లో ఉదాహరింపబడింది.

**యయాతిచరిత్ర**

సూరవరాజు ఈ కావ్యకర్త. క. సం. వి. (1-120) లోనూ, మరో ఛందోగ్రంథం (D 705; ఆం. వి.) లోనూ ఈ కావ్యంలోని ఒక పద్య భాగం ఉదాహృతం.

**రాఘవాభ్యుదయము**

మండ లక్ష్మీ నృసింహకవి త్రిలింగ శబ్దాను శాసనమనే వ్యాకరణ గ్రంథంలో ఈ కృతిని నన్నయభట్టారక కృతంగా పేర్కొంటూ 'ఉక స్వార్థే' (అమహన్నామానికి పరంగా స్వార్థంలో ఉక ప్రత్యయం వస్తుంది) అనే సూత్రానికి నిప్పుక, మిడుతుక అనే పదాలుగల ఈ కావ్యంలోని ఒక పద్యాన్ని ఉదాహరించినాడు. (శ. పరి.) లభించిన ఈ పద్యం నన్నయభట్టారకుని కవిత్వాన్ని పోలివుండక పోవడంవల్ల ఇతడా పేరుగల మరో అప్రౌఢకవియై ఉండ వచ్చునని వీరేశలింగం పంతులుగారు అభిప్రాయపడినారు.

**రామచంద్రోదయము**

బడబాగ్ని భట్టారకుడీ కృతికర్త. ఇందులోని రెండు పద్యాలు త్రిలింగ శబ్దానుశాసనంలో ఉదాహృతాలు.

**లక్ష్మీనారాయణ విలాసము**

కవి రాక్షసుడీ కృతికర్త. ఇందులోని ఒక్క పద్యం మాత్రమే మనకు ఆం ప్ర.ర. (20 ౪ పు.)లో లభ్యమౌతుంది. కవి రాక్షసకృతమైన ఆదినారాయణ చరిత్రకే లక్ష్మీనారాయణవిలాస మనేది నామాంతరమేమో!

**వామనపురాణము**

నంది సింగన కృతమైన ఈ వామన పురాణంలోనివిగా రెండు పద్యాలు అ. రం. ఛం. (3-172, 175) లో ఉదాహరింపబడ్డాయి. నంది, ఘంటల

జంటలో నంది వంశీయుడు మల్లన కాని సింగన కాదు. నంది మల్లయ అనడానికి బదులుగా నంది సింగన అని పొరపాటున పేర్కొన్నాడో లేక నంది వంశంలో ఒక సింగన కూడా ఉన్నాడేమో! బలరామ విజయం కూడా నంది సింగన కృతంగా ఆం. ప్ర. ర. లోనూ, ఆ. రం. ఛం. లోనూ పేర్కొబడింది.

### హరిశ్చంద్రచరిత్ర

లోకబాంధవుడనే కవి ఈ కృతిని రచించినట్లు కావలి వెంకట రామస్వామి పేర్కొన్నారు.

### హరిశ్చంద్రోపాఖ్యానము

గౌరన హరిశ్చంద్రోపాఖ్యాన ప్రభావంతో చంపూ రూపంలో రచింపబడ్డ కావ్యం. చంద్రమౌళి కవి దీని కర్త. ఈతడు తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతులచే పూర్వ కవి స్తుతిలో స్తుతింపబడినాడు. ప్ర. ర. లోనూ, ఒకానొక ఛందోగ్రంథం (D 705 ఆం. వి; 57 a పు.) లోనూ ఇందులోని పద్యం ఉదాహరింపబడింది.

# ఉపయుక్త గ్రంథ సూచిక


అప్పకవీయము (1962) కాకునూరి అప్పకవి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

ఆంధ్ర కవి సప్తశతి (1956) బులుసు వెంకటరమణయ్య, బాల సరస్వతీ బుక్ డిపో, మదరాసు.

ఆంధ్ర కవుల చరిత్రము : కందుకూరి వీరేశలింగము పంతులు.

ఆంధ్ర ప్రయోగ రత్నాకరము : గణపవరపు వేంకట కవి (తాళపత్ర ప్రతి; నెం. D 695, D 696), సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు.

ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర (1958) డా॥ యస్వీ. జోగారావు; ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు, విశాఖపట్నం.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రము (1957) వంగూరి సుబ్బారావు; కమల కుటీర్, నరసాపురము.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము; సంపుటము - 1 (1976) శిష్టా రామ కృష్ణశాస్త్రి; మద్రాసు విశ్వ కళా పరిషత్తు.

ఆనంద రంగరాట్ఛందము (1922) కస్తూరి రంగ కవి; వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

ఉదాహరణ పద్యములు: కాగితం ప్రతి; ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయం; కాకినాడ,

కవిచింతామణి (1982) తాతంభట్టు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, హైదరాబాదు.

కవిజన సంజీవని (1930) ముద్దరాజా రామన; వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

కవి జీవితములు (1955) గురజాడ శ్రీరామమూర్తి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

కవితరంగిణి: చాగంటి శేషయ్య; హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము, కపిలేశ్వరపురము (తూ. గోదావరి).

కవివాగ్బంధనము: తిక్కన సోమయాజి; (తాళపత్రప్రతి; నెం. 703) సరస్వతీమహల్ లైబ్రరీ, తంజావూరు.
కవి సంశయవిచ్ఛేదము (1955) అడిదము సూరకవి; వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.
గోలకొండ కవుల సంచిక (1934) సంపా: సురవరం ప్రతాపరెడ్డి, గోల కొండపత్రికాకార్యాలయం, హైదరాబాదు.
ఛందోగ్రంథము; తాళపత్ర ప్రతి, నెం. 159/7 ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయం, కాకినాడ.
ఛందోగ్రంథము; తాళపత్ర ప్రతి; నెం D 705 M 326 ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయం. విశాఖపట్టణం.
చరిత్ర కెక్కని చరితార్థులు (1985) డా॥ బి. రామరాజు; ఆచార్య బిరుదు రాజు రామరాజు షష్ట్యబ్ద పూర్తి సన్మాన సంఘం, హైదరాబాదు.
ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణము (1969) డా॥ తూమాటి దొణప్ప; ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖపట్నం.
ఛందోగ్రంథము : నెం. R 235; శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, తిరుపతి.
ఛందోగ్రంథము : నెం. 173/6; ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయం, కాకినాడ.
తెలుగు వ్రాతప్రతుల వివరణాత్మక సూచిక : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, హైదరాబాద్.
తెలుగు సాహిత్య కోశము : (ప్రాచీన సాహిత్యము) 1980; తెలుగు అకాడెమీ, హైదరాబాదు.
దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము (1954) నిడుదవోలు వెంకటరావు; మదరాసు విశ్వవిద్యాలయం.
పరిషత్పుస్తక భాండాగారము : (మూడవభాగము) ఆంధ్ర సాహిత్యపరిషత్తు, కాకినాడ.
ప్రబంధమణిభూషణము (1971), సంపా : నిడుదవోలు వెంకటరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.
ప్రబంధ రత్నాకరము (1992) పెదపాటి జగ్గన్న; సంపా : ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి; ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం.

ప్రబంధ రత్నావళి (1976) సంపా : వేటూరి ప్రభాకరశాస్త్రి; శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు.

ప్రబంధసారశిరోమణి (1985) పరిష్కర్త : ఆచార్య కొర్లపాటి శ్రీరామ మూర్తి; ఆంధ్రవిశ్వకళా పరిషత్తు, విశాఖపట్నం.

బాలబోధఛందస్సు, (R1212) శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖితపుస్తక భాండా గారం, తిరుపతి.

మరుగుపడిన మాణిక్యాలు (1961) డా॥ బి. రామరాజు; గోలకొండ పత్రిక ప్రచురణ.

మానవల్లి కవి - రచనలు (1972) సంపా : పోణంగి శ్రీరామ అప్పారావు; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.

రెడ్డి సంచిక (1947) సంపా: వడ్డాది అప్పారావు, ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, రాజమహేంద్రవరము.

లక్షణ దీపిక : వార్తాకవి రఘునాథయ్య, (కాగితపు ప్రతి నెం. D 1329), మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - మదరాసు.

లక్షణ విలాసము : (కాగితపు ప్రతి నెం. R 1024) శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, తిరుపతి.

లక్షణ శిరోమణి (1979) పొత్తపి వెంకటరమణకవి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

లక్షణసారసంగ్రహము (1971) కూచిమంచి తిమ్మకవి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.

వీరభూపాలీయము (కాగితం ప్రతి నెం. 1319), మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, మదరాసు.

శతక కవుల చరిత్ర (1957), వంగూరి సుబ్బారావు, కమల కుటీర్, నరసా పురము.

సకల నీతి సమ్మతము (1970), మడికి సింగన, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.

సకల లక్షణసార సంగ్రహము : ఉప్పులూరి వెంకటరెడ్డి (కాగితం ప్రతి) శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, తిరుపతి.

సమగ్ర ఆంధ్రసాహిత్యం : ఆరుద్ర; యం. శేషాచలం అండ్ కంపెనీ.

సరసాంధ్ర వృత్తరత్నాకరము లేదా మాల్యాద్రి నృసింహచ్ఛందము : వెల్లటూరి లింగయ మంత్రి (కాగితం ప్రతి, నెం. D 1229;) శ్రీ వేంక టేశ్వర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, తిరుపతి.

సుకవి మనోరంజనము : కూచిమంచి వేంకటరాయకవి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.

సులక్షణసారము (1972) లింగమగుంట తిమ్మకవి; వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

A Descriptive Cotologue of the Telugu Manuscripts in the Tanjore Maharaja Serfoji's Saraswati Mahal Library (1933) Andhra University, Waltair.

A Triennial Catalogue of Manuscripts Collected During the Triennium 1916 - 17 to 1918 - 19 for the Government Oriental Manuscripts Library, Madras. Vol. III, Part III Telugu (1925.)

A Triennial Catalogue of Manuscripts Collected During the Triennium 1922 - 23 to 1924 - 25. and 1925 - 26 to 1927 - 28 for the Govt. Oriental Manuscripts Library, Madras - Volume V - Telugu (1942.)

A Triennial Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library, Madras - Volume VI - (1949.)

A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library, Madras Volume - V (1935.)

*